

స్మృతిచిహ్నాలు

ఫొటో: నందగోపాల్, హైదరాబాదు.



# ఆజాద్ అస్తమయం

భారత రాజకీయాలలో 40 ఏళ్లుగా ప్రముఖ పాత్ర నిర్వహించిన మహావ్యక్తి మౌలానా అబుల్ కలాం ఆజాద్ ఫిబ్రవరి 22 వ తేదీ ఉదయం కాలధర్మం చెందారు. మౌలానా మరణంతో భారతీయ లోకం గొప్ప దేశభక్తుణ్ణి, మహావిద్వాంసుణ్ణి కోల్పోయారు. జన్మించింది మక్కాలో అయినా, మతరీత్యా మహమ్మదీయుడైనా, సంకుచిత మతాభిమానాలకు అతీతుడై జీవితమంతా విభిన్నమతానుయాయుల ఐకమత్య సాధనకు, భారత స్వాతంత్ర్య సంపాదనకు, స్వాతంత్ర్యసిద్ధి అనంతరం దేశపునర్నిర్మాణ కృషికి అంకితం చేశారు. 1920 నుంచీ గాంధీ మహాత్ముని సన్నిహిత మిత్రుల్లో ఒకరుగా ఉంటూ, చాలా సంవత్సరాలు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికై, సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని మొత్తం 11 ఏళ్లపాటు కారాగార క్లేశం అనుభవించారు. 1942 లో క్రిప్సుతోను, 1946 లో కాబినెట్ మిషన్‌తోను కాంగ్రెసు తరఫున చర్చలు జరిపారు. స్వాతంత్ర్యం వచ్చే ముందు తాత్కాలిక ప్రభుత్వంలోను, వచ్చిన తరవాత జాతీయ ప్రభుత్వంలోను సభ్యుడుగా ఉన్నారు.

మౌలానా ఆజాద్ రాజకీయవేత్తగానే కాక, పండితుడుగా కూడా ఎన్నదగిన వ్యక్తి. కొరానుకు ఒక భాష్యగ్రంథం, ఇంకా ఎన్నో తత్త్వగ్రంథాలు, కావ్యాలు రచించారు.

వీరి మరణం భారతీయులకు తీరని లోటు. ★

సంవత్సర చందా
రు. 18-0-0
విదేశములకు 26షి.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 28
5-3-58

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి ఫాల్గుణ పూర్ణిమ బుధవారం

## ★ విషయానుక్రమణిక ★



ముఖచిత్రం!

**సినీనటి భానుమతి**



రెండవ ప్రపంచయుద్ధకాలంలో వివిధయుద్ధరంగాల్లో పనిచేసిన మొట్టమొదటి స్త్రీ ఫొటోగ్రాఫర్ మార్గరెట్ బూర్క్-వైట్. పాతికేళ్ళ నుంచీ ఈమె ఫొటోగ్రాఫీనే వృత్తిగా పెట్టుకుని గొప్ప ప్రావీణ్యం, కీర్తి సంపాదించింది. విమానంలో కూర్చుని ఈమె ఫొటోలు తీస్తూండడం పై చిత్రంలో చూడవచ్చు.

# ఫొటోగ్రాఫర్ మార్గరెట్ బూర్క్-వైట్

సుమారు 30 ఏళ్ళక్రిందటి సంగతి. "టైమ్" పత్రిక నిర్వాహకుడు పరిశ్రమలకు, వర్తకానికి సంబంధించిన కొత్త పత్రిక ఒకటి నడుపుదామని నిశ్చయించాడు. ఆ కొత్త పత్రిక పేరు "ఫార్చ్యూన్". దానిలో ప్రచురించటానికి పరిశ్రమలకు సంబంధించిన ఫొటోలు కావలసివచ్చాయి. కొన్ని ఫొటోలు తెప్పించి చూస్తూండగా అందులో మార్గరెట్ బూర్క్-వైట్ అనే మహిళ తీసిన ఫొటోలు ఆయన్ని బాగా ఆకర్షించాయి. ఆమె తీసిన ఫొటోలు ఉన్నదాన్ని ఉన్నట్లు చూపించడమే కాక, ఏదో ఒక సత్యాన్ని నిరూపిస్తున్నట్లుగా ఉన్నాయి. కళాకారుడు ఒక చిత్రాన్ని కంపోజ్ చేసినట్లు కంపోజ్ చేసిఉన్నాయి. పైగా ఫొటోగ్రాఫర్లు ఎవరూ వెళ్ళ సాహసించనంత ప్రమాదకరమైన స్థలాలనుంచి ఆమె ఆ ఫొటోలు తీసింది ఇదంతా చూసి ముచ్చటపడి ఆయన ఆమెను పిలిపించాడు.

తీరా చూస్తే ఆ మహిళ 23 ఏళ్ల లేత వయసుపిల్ల. చక్కటి నీలికళ్ళు, చిక్కటి అందమైనజుట్టు, ఆవేశంతో, తొందరగా మాట్లాడేతీరు, నాజూకుతనం-చూస్తే ఈ పిల్లేనా ఈ ఫొటోలు తీసింది అనిపించింది. కాని ఆమె "ఫార్చ్యూన్" పత్రికలో చేరిన కొద్దికాలానికే ఆయన గ్రహించారు, ఆమె తనకు కావలసిన ఫొటో తీయటానికి ఎంత అపాయమైనా, ఎంత శారీరక మానసిక శ్రమయైనా లెక్క చేయదని.

మార్గరెట్ బూర్క్-వైట్ 1906 లో జన్మించింది. జీవశాస్త్రమంటే మొదట్నించీ అభిమానం. కాలేజీలో శాస్త్రవిషయాలతో పాటు కొద్దిగా చిత్రకళకూడా అభ్యసించింది. చిత్రకళ పాఠాల సందర్భంలో ఫొటోగ్రఫీకూడా కొద్దిగా నేర్చుకోవలసి వచ్చింది తనదగ్గిరున్న పాతడొక్కు కామెరాతో ఫొటోలు తీయనారంభించింది. మంచిపేరు సంపాదించింది. తండ్రి చని పోయిన తరువాత కేవలం తన ఫొటోల మీద వచ్చిన డబ్బుపెట్టి చదువు పూర్తిచేసుకుంది.

1927 లో చదువు పూర్తికావటంతో ఆమెకు మైక్రోస్కోపును ఉపయోగించటం కంటే కామెరా లెన్సును ఉపయోగించటమే బావుందనిపించింది అప్పటినుంచీ ఫొటోగ్రఫీనే ఆమె వృత్తిగా పెట్టుకుంది క్లీవ్‌లాండ్ (ఓహియో రాష్ట్రం)లో తనుంటే

# ఫొటోగ్రాఫర్ మార్గరెట్ బూర్క్ - వైట్

చిన్న ఇంట్లోనే ఒక డార్క్ రూమ్ ఏర్పాటు చేసుకుంది. స్నానపు తొట్టెలో ఫిల్మ్ డెవలప్ చేసుకొనేది. ఒక పేకామెరా ఉండేది. దాంతోనే ఆమె అదివరకెవ్వరూ పట్టించుకోని పారిశ్రామిక ఛాయాచిత్ర రంగంలో సాటిలేని కృషి చేసింది.

“ఫార్ట్యూన్” పత్రికలో చేరమని హెన్రీలూస్ ఆహ్వానించిన తర్వాత ఆమె ఆ పత్రిక బయటికి రావటానికి ముందు ఎనిమిది నెలలపాటు విపరీతంగా పనిచేసింది. అమెరికా అంతటా పర్యటించి పెద్ద పెద్ద పరిశ్రమలను ఫోటో తీసింది. తరవాత 1931 లో అంతవరకూ అమెరికాలో ఎవరూ ఫోటో తీయని సోవియెట్ ప్రథమ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాలను ఫోటో తీసి ఒక ఛాయాచిత్రకథగా ప్రకటించింది. 1936 లో హెన్రీలూస్ “లైఫ్” పత్రిక స్థాపించటంతో ఆమె అందులో చేరి, అప్పటి నుంచీ అందులోనే పనిచేస్తోంది.

“లైఫ్” మొట్టమొదటిసంచిక ముఖపత్రం మీద ‘మాంటానా’ రాష్ట్రంలోని పెక్ డామ్ బొమ్మ పడింది. అది బూర్క్-వైట్ తీసిన ఫోటోయే. ఆ బొమ్మ బావుండటంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని ఆమె ఆ బొమ్మకు సంబంధించిన చక్కని వ్యాసం కూడా రాయటం అందరికీ ఆశ్చర్యకారణమైంది.

ఆ తరవాత ఆమె ఎందరో ప్రసిద్ధవ్యక్తుల ఫోటోలు తీసింది. చర్చిల్, రూజ్వెల్టు, స్టాలిన్, మదాం చియాంగ్ కైషేక్, హేల్ సెలాసీ, నెహ్రూ, గాంధీ, పోప్, ఐసెన్ హోవర్ల వంటి వారివెన్నో ఫోటోలు ఆమె తీసింది. హెన్రీలూస్ పత్రికలకోసంగాను ఆమె యూరప్‌లోని ప్రతి దేశానికీ, రష్యా, ఆఫ్రికా, కొరియా, ఆర్కిటిక్ ప్రాంతాలకు వెళ్ళి ఫోటోలు తీసింది.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఫోటోగ్రాఫర్ గా పనిచేసిన మొదటి స్త్రీ ఈమెయే. ఒకసారి ఈమె సైన్యాలతో కలిసి ఉత్తర ఆఫ్రికా వెడుతుండగా ఆమె ఉన్న ఓడకు టార్పిడో తగిలి మునిగింది. ఆమె అదృష్టవశాత్తు తప్పించుకొంది. రెండేళ్ళపాటు ఇటలీలో వుండి యుద్ధచిత్రాలు తీసింది. మాస్కో ముట్టడిని ఫోటోలు తీసింది. జనరల్ పాటన్‌తో కలిసి రైన్‌నదిని దాటి, బాంబులతో ధ్వంసమైన జర్మన్ నగరాలను, నిర్బంధ శిబిరాలను దర్శించింది. ఈమె కృషిని అమెరికా యుద్ధశాఖ గుర్తించి 1947 లో ఆమెను గౌరవించింది.

భారతదేశ విభజన సమయంలో లక్షలాది ప్రజలు తరలిపోవటాన్ని ఈమె ఫోటోలు తీసింది. భారతదేశంలో, దక్షిణాఫ్రికాలో పరిస్థితులనుగూర్చి ఈమె ఛాయాచిత్రకథలు తయారుచేసింది. కొరియా యుద్ధకాలంలో నైరృతి కొరియాలో పనిచేసింది. ఈమె కొన్ని పుస్తకాలు కూడా రాసి తను తీసిన ఫోటోలతో సహా ప్రచురించింది. 1948 లో న్యూజెర్సీ స్త్రీలకళాశాల ఈమెకు డాక్టరేట్ ఇచ్చింది. మూడేళ్ళ తరవాత మిచిగాన్ విశ్వవిద్యాలయం డాక్టర్ ఆఫ్ ఫైనార్ట్స్ బిరుదు ఇచ్చింది.

ఇప్పుడీమె తన జీవితానుభవాలను వ్రాస్తోంది. “ఈమె తన మూడు నేత్రాలతో ఏ ఇతర స్త్రీ చూడనంత జీవితాన్ని, ప్రకృతి సౌందర్యాన్ని, విచిత్రాలనీ, యంత్రాల లయబద్ధ చలనాలను చూసింది,” అని ఒకరు ఈమెనుగూర్చి అన్నారు. ★



న్యూయార్కు హార్బరుమీదుగా హెలికాప్టర్‌లో పోతూ బూర్క్-వైట్ తీసిన “స్వాతంత్ర్యదేవి” విగ్రహం ఫోటో.



1936 లో “లైఫ్” పత్రిక మొదటిసంచిక ముఖచిత్రంమీద ప్రచురించిన ఫోర్ట్ పెక్ డామ్ (మాంటానా రాష్ట్రం) ఫోటో బూర్క్-వైట్ తీసినదే.

# న్యూఢిల్లీ లేఖ

## శ్రీ ఫిరోజ్ గాంధీ బయటపెట్టిన అధికారపత్రం


**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]


ఏసుక్రీస్తు పన్నెండుగురు శిష్యులతో కలిసి ఆఖరిసారిగా విందారగించాడు. ఆతరవాతనే ఆయనకి శిలువ వేయటం జరిగింది. అప్పటి నుంచీ 'పదమూడు' సంఖ్యను అరిష్టంగా పరిగణిస్తూ వచ్చారు. కేంద్రమంత్రి మండలిలో కూడా పదముగ్గురు మంత్రులున్నారు. వీరిలో ఒకాయన్ని ఇటీవల శిలువవేసి దేశంలో ప్రజాస్వామిక సంప్రదాయాలు వేళ్లుతన్ని నిలిచేట్లు చేశారు.

ఉద్వాసన చెప్పిన ఏమంత్రికీ ఇవ్వనంత ఘనమైన వీడ్కోలును శ్రీ టి. టి. కృష్ణమాచారికి ఇచ్చారు. ప్రధాని, ఆయనకుమార్తె శ్రీమతి ఇందిరాగాంధి, రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్, ఆహార వ్యవసాయమంత్రి శ్రీ ఏ. పి. జైన్, రవాణామంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, కార్మికమంత్రి శ్రీ నందా, వాణిజ్య, పరిశ్రమల మంత్రి శ్రీ మురార్జీ దేశాయ్, నీటిపారుదలశాఖమంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్, భారీపరిశ్రమలమంత్రి శ్రీ ఎమ్. ఎమ్. షా, ప్రధానకార్యదర్శి శ్రీ రాఘవన్ పిళ్లే, ఇంకా ఎందరో అధికారులు, మిత్రులు పాలం విమానాశ్రయానికి వెళ్ళి టి. టి. కె.కు వీడ్కోలిచ్చారు.

ప్రధానమంత్రి చాగ్లా నివేదికమీద పార్లమెంటులో చర్చ ప్రారంభిస్తూ ఆర్థికమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారికి సంబంధించినంత వరకూ కథ ముగిసినట్లేనని అన్నారు.

జీవితభీమా కార్పొరేషన్ విషయాల్లో ప్రభుత్వం మితిమీరినజోక్యం చేసుకుంటోందని చాగ్లానివేదిక విమర్శించింది. దీనికి సరిగా విరుద్ధంగా పారిశ్రామిక ధనసహాయ కార్పొరేషన్ విషయాలపై దర్యాప్తుచేసిన శ్రీమతి సుచేతకృపలానీ ఆకార్పొరేషన్‌విషయాల్లో ప్రభుత్వం తగినంతగా జోక్యం చేసుకోవటం లేదని విమర్శించింది. అప్పట్లో ఆవిడ ప్రజాసోషలిస్టుపార్టీలో ఉండేది.

ప్రధానమంత్రి, శ్రీ ఫిరోజ్ గాంధీ కొన్ని వివాదాలకు కారకులయ్యారు. చాగ్లా నివేదిక మీద మాట్లాడుతూ ప్రధానమంత్రి తానైతే ఎప్పుడూ లాబీల్లోకి వెళ్లిలేదుగాని, కొన్ని లాబీ వార్తలు విన్నానని వాటి ప్రసక్తి తీసుకొచ్చారు. అలాఅయితే ఎవరో "గస్టపో" పనిచేస్తూఉండి ఉండాలని సభ్యులు అన్నారు. ఎవరో మాటలు మోసుకెళ్లేవారు లేకపోతే ఎక్కడో తామనుకున్న మాటలు ప్రధానమంత్రికెల్లా తెలిశాయని వారు వాదించారు. ప్రధానమంత్రి ఉపన్యాసం అయిన దగ్గిర్నించీ సభ్యులు గోడలకు చెవులేకాక నీడలకు నోళ్లుంటాయనికూడా భయపడుతున్నారు.

చర్చలో కలగజేసుకుంటూ శ్రీ ఫిరోజ్ గాంధీ ఒకానొక అధికారపత్రాన్ని ఉదహ



రించారు. దానిమీద "అతిరహస్యం" అని వ్రాసి ఉందని ఆయనే చెప్పారు. అందులోని విషయాల్ని బటి అది అధికారుల ఫైళ్ళలోని పత్రమేనని తేల్తోంది. అతి రహస్యం అని గుర్తుపెట్టిన అధికారపత్రం అనధికార సభ్యుని చేతి కెలా చిక్కిందీ అని లాబీ వర్గాల్లో అనుకుంటున్నారు.

ప్రభుత్వ రహస్యరక్షణచట్టం "ఏ వ్యక్తి అయినా తనంతటతను ఏ రహస్య, అధికార సాంకేతిక భావనుగాని, సాంకేతిక పదం గాని, పటంగాని, పథకంగాని, నమోనా గాని, వస్తువుగాని, లేఖగాని, అధికార పత్రంగాని, సమాచారంగాని, స్వీకరించే సమయంలో ఆ సాంకేతికభావ, సాంకేతిక పదం, పటం, పథకం, నమోనా, వస్తువు, లేఖ, అధికారపత్రం, సమాచారం ఈ చట్టానికి విరుద్ధంగా అందజేయబడిందని తెలిసిగాని, అలా చట్ట విరుద్ధంగా అందజేయబడిందని నమ్మటానికి సబబైన ఆధారం ఉండిగాని స్వీకరిస్తే ఈ చట్టం 5వ విభాగం ప్రకారం అతడు నేరస్థుడుగా పరిగణింపబడతాడు" అని నిర్దేశించింది.

తాను ఉదహరించిన అధికారపత్రం "అతి రహస్యం" అని శ్రీ ఫిరోజ్ గాంధీకి తెలియటమే కాదు; అలాగని సభలో చెప్పారు కూడాను. అటువంటి రహస్య పత్రాలు శ్రీ ఫిరోజ్ గాంధీ చేతులో కెలా వచ్చాయో సంజాయిషీ ఇవ్వాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. ఎందుచేతనంటే, రహస్యపత్రాలు ఇవాళ శ్రీ ఫిరోజ్ గాంధీకి చేజిక్కాయి, రేపు కమ్యూనిస్టులకు చేజిక్కవచ్చును. కాంగ్రెసుపార్టీ సభ్యులకొక నిబంధనా, సోషలిస్టులకీ, కమ్యూనిస్టులకీ ఇంకో నిబంధనా ఉంటానికి వీల్లేదు.

కేవలం పరిపాలనదృష్ట్యా చూసినా, ఈ రహస్యపత్రాన్ని శ్రీ ఫిరోజ్ గాంధీ బయటపెట్టటం భావ్యంగాలేదు. దీంతో మంత్రులు చాలా ఇబ్బందిపడిపోయారు. పత్రికా ప్రతినిధుల గ్యాలరీలోంచి చూస్తే హోంమంత్రి పండిత గోవిందవల్లభ పంత్ బాధగా కనబడ్డారు.

శ్రీ కృష్ణమాచారి ఉదహరించిన మనుష్యుల్నితనే పెద్దపులినిగూర్చి శ్రీ ఫిరోజ్ గాంధీ పట్టిపల్లార్చారు. హోంమంత్రిని కుమాయూన్ పెద్దపులిగాను, పారిశ్రామికులను శాకాహారులైన పెద్దపులులుగాను ఆయన వర్ణించారు. అక్కడికి శాకాహార శార్దూలాలు, మాంసాహార శార్దూలాలు ఉన్నట్టు! మాంసం తినేవనీ, నరమాంసం తినేవనీ రెండురకాలుంటే ఉండవచ్చు. అదీగాక భారత హోం మంత్రి శాకాహారి అనేది అందరికీ తెలిసిందే. అందుచేత 'కుమాయూన్ పెద్దపులి' అనీ, శాకాహార శార్దూలాలనీ పేర్కొనటం బాగులేదు.

శ్రీ ముంద్రాకు ఉద్దేశింపబడిన ఒక టెలిగ్రామ్ తాలూకు ఛాయాచిత్ర ప్రతి నుంచి శ్రీ ఫిరోజ్ గాంధీ కొన్ని విషయాలు ఉదహరించారు. టెలిగ్రాఫ్ చట్టంప్రకారం ప్రైవేటు టెలిగ్రాములను హక్కులేని వారికి టెలిగ్రాఫ్ ఆఫీసులు చూపించనైనా చూపించగూడదు. అయితే ఈ టెలిగ్రాము ముంద్రా ఇంట్లోనో, ఆఫీసులోనో పోలీసులు పట్టుకున్నది కావచ్చునని కొందరనవచ్చును'

అయినా అది శ్రీ ఫిరోజ్ గాంధీ కెలా వచ్చిందని సమస్య.

ఈ రెండు విషయాలమీద "విచారణ" జరపకపోయినా, కనీసం ఫిరోజ్ గాంధీ సంజాయిషీ ఇచ్చుకోవాలి.

ఇక ముంద్రా వ్యవహారంతో సంబంధమున్న అధికారులపై చర్యలు తీసుకునే విషయమై కేంద్ర ప్రభుత్వం పాలీ సమావేశం మంగళవారం రాత్రి అయిపోగానే, బుధవారంఉదయం నిర్ణయంచేసింది. ఈ దురదృష్ట వ్యవహారంపై ఇంకా దర్యాప్తు చేయగూడదని ప్రభుత్వం మొదట అనుకున్నదిగాని లాబీవర్గాలు చెప్పే దాని ప్రకారం శ్రీ మహావీర్ త్యాగికి ఇది ఇష్టంలేకపోయిందట. నిర్లక్ష్యంగా, అశ్రద్ధగా పని చేశారని ఛాగ్లా నివేదిక అభిప్రాయపడిన అధికారులపై తగిన చర్య తీసుకోవలసిందే నని శ్రీ త్యాగి పట్టుపట్టాడట. ఆయనమాటే నెగ్గింది. అందుకే ప్రభుత్వం తమ అసలు తీర్మానాన్ని సవరించుకోవల్సి వచ్చింది.

* * *

వ్యాపారసంస్థల్లో చాలావాటికి న్యూఢిల్లీలో "ప్రతినిధు"లున్నారని ఈ మధ్య అంతా అంటున్నారు. ఈ మనుషులు చాలా డబ్బు ఖర్చుపెట్టి సచివాలయంలో పనులు దబ్బున జరిగేట్లు చూస్తారనీ, తమ యజమానులకు అధికారులతో తేలికగా సాన్నిహిత్యం కలిగిస్తారనీ అంటున్నారు. 'అయితే ఇది కొత్తగా వచ్చిన అలవాటేమీ కాదు. బ్రిటిషు ప్రభుత్వకాలంలోకూడా ఇలాంటి "ప్రతినిధులు" ఉండేవారు. వీరిలో ఒకాయన సర్ బిరుదుగల పెద్దమనిషి. "ప్రతినిధులే" కాదు, ఒత్తిడిచేసే మనుషులు, అమెరికన్ పద్ధతిలో శాసనసభలోపల వ్యవహరించే లాబీ మనుషులుకూడా ఉన్నారు. పంచదార సమస్యను ఉదాహరణగా తీసుకోవచ్చు. ఈమధ్య పంచదార ఎగుమతినిగూర్చి లోక్ సభలో ప్రశ్న వచ్చింది. పంచదారను ఎగుమతిచేసే సౌకర్యంలేకుండా పంచదార ఉత్పత్తి పెరిగిపోతోందని, దీనివల్ల మిల్లు యజమానులకు చాలా కష్టాలు కలుగుతాయనీ, కాంగ్రెసు పార్టీ సభ్యులు ఒకళ్ళ తరవాత ఒకళ్లు లేచి బోలెడు ఆందోళన వెళ్ళబుచ్చారు. అయితే వీదేశాల్లో ధరలు భారత దేశంలో ధరలకంటె తక్కువగా ఉంటున్నందున పంచదార ఎగుమతి చేయటం దాదాపు అసాధ్యమైపోతోందని ప్రభుత్వం సమాధాన మిచ్చింది. కాని ఈ సమాధానం సభ్యులకు రుచించలేదు. పంచదార ఎగుమతికి సౌకర్యాలు కలిగించాల్సిందేనని ఒత్తిడిచేశారు. పంచదార పరిశ్రమను ఎన్నో త్యాగాలుచేసి స్థాపించుకున్న భారతీయ ప్రజలమీద ఏ ఒక్క సభ్యుడు, ఆఖరికి ఏ కమ్యూనిస్టు సభ్యుడూ కూడా సానుభూతి కనబరచలేదు. పంచదార కొరత పరిస్థితిని పంచదార పరిశ్రమస్వాతంత్ర్యం వచ్చాక కనీసం రెండుసార్లయినా తన స్వార్థానికి వినియోగించుకుంది. ఒకసారి ఈ కొరతను కావాలని కల్పించటం కూడా జరిగింది. దేశంలో పంచదార గిరాకీ కంటె ఉత్పత్తి ఎక్కువగా ఉన్నప్పుడు వినియోగదారులకు కాస్త తెరపిఇచ్చేందుకు గాను జరగవలసిన ధరల మార్పులు జరగనివ్వాలి. కాని వినియోగ దారులమీద అటువంటి సానుభూతి ఎవరికీ, ఆఖరికి కార్ల్ మార్క్సును ఉదహరించే వారికికూడా ఉన్నట్లు కనబడలేదు. దీన్నిబట్టి ఒత్తిడిచేసే మనుషులకి, లాబీ మనుషులకి ఉన్న పలుకుబడి స్పష్టమవుతుంది.

అధికారంలో ఉన్న పార్టీ సభ్యులకు వర్తక ప్రముఖులు ఆతిథ్యం ఇవ్వటాన్ని గూర్చి నేను ఇదివరకు వ్రాశాను. ఆతిథ్యమేంఖర్మ, చాలమంది వ్యాపారస్తులే కాంగ్రెసులో చేరారు. వాళ్ళకి వేరే 'ప్రతినిధులు' దేనికి, వారే వారి ప్రతినిధులైతే!

* * *

శ్రీ కృష్ణమాచారి రాజీనామాతోను, మౌలానా ఆజాద్ మరణంతోను ప్రధాన మంత్రికి కొత్త సమస్యలు ఎదురైనాయి. మొత్తం కేంద్రమంత్రి మండలినే పునర్నిర్మించవలసి రావచ్చు. కేంద్రప్రభుత్వ పరిపాలనా వ్యవస్థనే క్రమబద్ధం చేయాలని ఒక అభిప్రాయం లాబీల్లో వినవస్తోంది. కాబినెట్ హోదా ఉన్నమంత్రుల సంఖ్య తగ్గించాలని, స్వతంత్రంగా ఆయాశాఖలపై అధ్యక్ష్యం వహించే మంత్రుల్ని ఎక్కువ చేయాలని అంటున్నారు. సాంఘిక వ్యవహారాల శాఖ ఒక దాన్ని స్థాపించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ శాఖ క్రింద సమాచార

(49-వ పేజీ చూడండి)




[ఉద్యోగపర్వంనుండి]

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నొంపదె యొంటి నున్న య
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం
బొరయునె యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు లట్లుగా
కెరవయి నిల్చినం గెలని కెల్లిద మై పఱివోదు రెంతయున్.

వ. కావునఁ గౌరవులు పాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెదిరికి నజయ్యు లగుదురు పరుల యొత్తు లేని రాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీ కొడుకులకు నిలుపు గావించుట యగు నని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందును గల రప్రియం బగుం గాకేమి యని పథ్యంబు పలుకువారు లేరు జూదంబు నప్పుడే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక పథ్యంబు పలికితి నది నీకు రుచియింపక రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించున ట్లయ్యె నైన నిప్పుడుం జెప్పెద వినుము కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయుచందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితి నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు దల్లడించెదవు కులంబునకై యొకనిఁ దొఱంగుటయ నీతి యని పెద్దలు చెప్పుదురు దుర్నయపరుండై సద్బుద్ధి చెప్ప వినం డేని మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగు నదియట్లుండె సంపద సహాయంబు నపేక్షించియుండు సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు ని ట్లవి యొకటొకటి పొందునం గాని సిద్ధింపవు గావున నీ సంపదపాండవులకును వారి సహాత్వంబు నీకునుం బ్రియం బొనరింప నొండొరుల కలయుట మేలుగాక మనలావు వెలిసేయుట లెస్స యగునే కురువంశ నిస్తారకు లగు భీష్మయుధిష్ఠిరులును నవక్రవిక్రము లగు కర్ణార్జునులును బ్రతాపధాము లగు భీమదుర్యోధనులును శస్త్రాస్త్రపారగు లగు నభిమన్యు లక్షణ ప్రభృతి కుమారులును శాపానుగ్రహసమర్థు లగు ద్రోణద్రుపదాది పరమాప్తులును వారివారి బంధుమిత్త్రజనంబులును నొక్కమొగంబై నీ పనుపుసేయుచు నయవిక్రమంబు లప్రతిహతంబులై నడవం బృథివి శాసింప భవదీయ విభవం బుజ్జ్వలంబై యొరుల కెడలేక చెల్లుచున్న నెంత యొప్పగునో యటు విచారింపుము పాండవులు ధీరమతులై వైర మెత్తక యూరక తొలంగి యుండిరేనియుఁ గతిపయ దినంబులలోఁ జీకాకుపడి చెడుం గాక గాంధారీనందనుచేత వసుంధరా పరిపాలనభారంబు నిర్వహింపం బడునే యనిన విని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె.

తే. నీవు సెప్పినమాటలు నిర్మలములు, నిపుణసమ్మతములు రాజనీతిమార్గ
బోధకంబులు నైనను బుత్త్రు విడువ, నోప ధర్మజయుతి యని యుండువాఁడ.

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె. దేవా జ్ఞాతులు గుణహీను లైనను విడువం దగ దనిన సకలగుణ సంపన్నులై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులం దిగవిడువం దగునే, యేను నీకు హితంబు గోరెడువాఁడ నని విశ్వయించి నాబుద్ధి వినుము వారల జీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్స యని చూచెద నతని విడువ వలయు నని చెప్పితి నేనిఁ బెనఁకువం బశ్చాత్తాపంబు వుట్టు దాని కప్పుడు ప్రతీకారంబు లేదు కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధి సేయవలయు నట్లుం గాక.

క. తమలోని పాళ్ళకుంగా, నమరము సేసినను గాని చాఁ జనదె శరీ
రము లాధివ్యాధిజరా, సమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్.

చ. గజతురగాది సంపదలుఁ గాంతలతోడి విహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయుక్రమంబుఁ గోరుల

విజయముఁ బొంది పేర్చుటయు విస్ఫురితాభరణాను లేప వ
స్త్రజనిత వైభవంబుఁ గల రాజులుఁ బోయిర తాత నిల్చిరే.

క. కాపునఁ జెడితిం జేఁ దగు, నీవాక్యము వినఁగఁ జాలి తేని నిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికి, దావల మై వెలయు టింత తథ్యము సుమ్మా.

క. తగ నీతో నాహింపుము, దిగవిడువకు ధర్మతనయు దృఢమతి వై పొం
దగుచందము గొడుకులకుం, బ్రెగడలకుం జెప్పి తీర్పు మెం పేర్పడఁగన్.

ఆ. అనిన నాంబికేయుఁ డను నీదుపలుకులఁ, గలఁక దేఱె బుద్ధి దెలివి నొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్జము ధర్మ, మును యశంబు లాభమును దలంప.

చ. అనుడు ముదంబు నమ్మునియు నాత్మఁ జెలంగొన తన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దపడి కక్కట నీమది కార్యవృత్తి నూ
ల్కొనియె సుయోధనుం గని యకుంఠితనిశ్చయ మై యతండు బ్రా
లిన దెసఁ బ్రాల కుండిన బలే మనుబోఁటులకుం బ్రియం బగున్.

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించె.

క. దైవంబ నేర్చుఁ గాకిటు, వోవఁగ నే నేర్తు నేరఁ బో మ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు, దైవము పౌరుషముకంటె ధరణీనాథా.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ జఱులకాంతికి నునుమెఱుఁగు వెట్టి
ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసఁగి
యరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళ యను జిగి దళముకొల్పి
చక్రవాకద్వయసంతతి యెఱకల గోమరారు కెంజాయఁ గ్రొత్తసేసి

ఆ. తనదుబాలబింబ మనుపమేయప్రభా, పటలజటిలగగనభాగ మగుచు
నుల్లసిల్లి జగము లెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు.

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు తత్కాలోచితాచారంబులు నిర్వర్తించి తగు తెఱంగున నలంకృతుం డయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ గుంభసంభవకృపకృతవర్మాశ్వత్థామకర్ణాదు లగు దొరలును భీష్మవిదురబాహ్లికసోమదత్తభూరిశ్రవః ప్రభృతు లగు బంధుజనులును దుర్యోధన దుశ్శాసన ప్రముఖు లగు కుమారులును లోనుగాఁ గల సమస్తపరిజనంబులును వచ్చి బలసియుండి రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిటనిలిచి పడిహారులవలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచితప్రదేశంబునఁ గూర్చుండి తన మాటలు వినుటకుఁ దిడిముడిపడుచున్న కొలువుఁ గలయం గనుంగొని యిట్లనియె.

## సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట

తే. పాండురాజతనూజులపాలి కరిగి, నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచి నాతండు మైత్త్రిమెఱయఁ, గౌరవుల సేమ మెల్లఁ బేర్వేర నడిగె.

వ. మఱియుం దత్పవారలనెల్ల నయ్యైయుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె నేనును భూనాథుండు గఱపిన తెఱంగునఁ గొఱంతలేకుండ బంధుత్వంబునకు వలయు మాట లాడితిఁ బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింత యొప్పునే యని యగ్గించిన ధృతరాష్ట్రుం డవహితుండై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పిన భంగులు నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించిన చందంబులు ధర్మనందను పలుకులపరిపాటిం దేటపడం జెప్పి సూత సూనుండు వెండియు నిట్లనియె.

తే. ఏ నుపప్లావ్యపురమున కేఁగి తొలుత, వాసుదేవార్జునులఁ గంటి వారు నీతి
పథము దప్పనిమాటలు బలిమిఁ దోఁచు, నట్లుగా నాడి రవి వినుం డాదరించి.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డవ్వాసుదేవుచిత్తం బెట్లతం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె.

ఉ. తానును సత్యభామయును ద్రౌపదియుం నరుఁడుం రహస్యగో
ష్ఠీనిరతాత్ములై సుతులుఁ జేరని చెందనియట్టి చోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె న
న్నా నలినోదరుండు హృదయంబున నీ దెస కూర్మి యెట్టిదో.

వ. ఏనును దత్ప్రకారంబు పణిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటంజేసి కంచుకంబును శిరోవేష్టనంబును ధరి
యించి వినీతవేషుండనై పోవునప్పుడు కృష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితులై యొక్క సెజ్జ నున్న
వారు. కృష్ణుండు పవ్వళించి యుండి చాఁచినచరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు సత్య
భామయుం బాంచాలియు గద్దియలపై నున్నవారు సవినయంబుగా నేనును దండప్రణామంబు సేసిన నన్నాదరించి
కృష్ణుని చేసన్న నర్జునుపనుపునం గనకరత్నమయం బగు నతనిపాదపీఠం బతండు వ్రేల్చినకాళ్ల దిగిచికొని యిద్దఱు
ముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు
మొగిడ్చి ఫాలతలంబునం గదియించి నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుం బోలె నున్న
యమ్మాధవధనంజయులఁ జూచినప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దదనంతరంబ భయంబునుం బుట్టె నట్టియెడ.

క. ఈ యిరువురుఁ బంచినపని, సేయుదు రంటె ధర్మజునకుఁ జేకుఱనితలం
పేయది యతనిం దొడరుట, వేయేటికి జముని శిరము వ్రేయుట గాదే.

వ. అని తలంచుచుండ నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయోగించునట్టి యన్నపానంబులును దమకుఁ గట్టఁ
దగినట్టి వస్త్రంబులను దాము దొడుగునట్టి భూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిన నేనును నా పోయిన
కార్యంబు విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వారిజోదరుం
డిట్లనియె.

## సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడు సెప్పిన మాట లెఱింగించుట

తే. వినుము సంజయ ధృతరాష్ట్రవిభుని పెద్ద, కొలువునందుఁ దత్పుత్రులు గురుఁడుఁ గృపుఁడు
నాపగానందనుఁడు మొదలైన సకల, జనులు వినుచుండఁగా నిట్టు లనుము నీవు.

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీల్గుల, నగ్ని పుట్టినట్టి దయ్యె మీకు
నార్ప వెరవు లేదు నేర్పుమై నింకఁ గా,వింపవలయుపనులు వినుఁడు మీరు.

వ. అవి యెవ్వి యంటేని.

సీ. కలయట్టి వివిధార్థములు నశేషంబుగఁ దగ నొసంగుండు సత్పాత్రములకు
జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి సత్కరింపుఁడు సంతసం బెలర్ప
నిచ్ఛానుగుణముగ నింద్రియసుఖముల ననుభవింపుఁడు హృదయంబు లలర
నాండ్రను బిడ్డల నష్ట్యవిధంబుల గారవింపుఁడు ప్రియపూరితముగ

తే. మఱియు నెవ్వరిచిత్తమెత్తెఱఁగునందు, వాటమైయుండు నది యెల్లవలయునట్లు
సేసి విహరింపుఁ డిం కెడసేయ కనికి,నడవుఁ డఱచేతఁ బ్రాణంబు లిడి కడంగి.

వ. అని చెప్పు మింత యేమిటి కంటేని.

ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్న నన్ను గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యాఁగఁగ రాని యప్పఁ బో
లెం దలపోయ వ్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్.

తే. ఇట్టియేఁ దేరు గడపంగ నెందు నుతికి నెక్కు గాండీవ మేడ్తెఱ నెక్కువెట్టి
రెండు దొనలును బూని కిరీటి యనికి, వచ్చు నేఁ డల్లి యెందుఁ బోవచ్చు మీకు.

వ. అని పలుకునప్పటి వారి యెత్తికోలును నీ కొడుకు విడుపోపమియునుం దలంచి భయం బందితి నితండు వారల
నెఱుంగండు భీష్మద్రోణులప్రాపును గర్ణుగర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు ననిన విని ధృతరాష్ట్రుం
డర్జునుం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె.

క. నరుఁ డలుక వాడమియును సు, స్థిరుఁ డై తనమొత్తుసెరలచెలువునఁ గెంజా
మరలం దెగడెడుకన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా.

ఆ. ఆ సుయోధనుండు నతనికిఁ దోడ్పడ, నపుగు దెంచినట్టి ధరణినాథ
చయము వినుచునుండ సంజయ నావచ,నములు గాఁగ నీ వనంగవలయు.

ఉ. పాండునియ్యగనందనుఁడు పా లడుగం దగ నీఁడయేని మా
కొండన నేల మే లది సుయోధనుఁ డింతకు మున్ను పెక్కు లు
ద్దండతఁ దాను జేసినవిధంబుల కెల్ల మొఱుంగు పెట్టిన
ట్లుండెడుఁగాక యేసును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్.

క. మా యిరువురతోఁ గయ్యము, సేయ నతం డియ్యకొనిన సిద్ధించెన తా
దే యుచితచరితుఁ డగుకొం, తేయా గ్రజుకార్య మట్టితెఱఁ గొప్పఁ గదా.

క. వనవాసంబున భూశ, య్యను ధర్మజుఁ డున్న యట్టియాయాసము వో
వుసె యంపశయ్య దుర్యో,ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిన్.

ఉ. సూనృత మాఁది బన్నములు సూడక లోన నడంచినట్టి కో
పానల మొండి యున్న నిబిడాటవిపైఁ బచరించు తీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్పినం
గాని యుధిష్ఠిరున్ నరకుగాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్.

మ. గద సారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముఁ డు
న్మదమాతంగచయంబు నుగ్గుగ లసన్నానారథవ్రాతముల్
చదియన్ భూరిహయవ్రజంబు పొడి గా సంరంభతుంగాంగుఁడై
కదియం జూచి బళే సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు నుఱుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టిదంబుగ వీఁచుచందమున నదరి
కసిమసంగినమారి గడఁగి జీవులమీఁద నుగ్రతఁ గవియుఁ ట్లురవడించి
యాఁకొన్నలయరుద్రుఁ డాగ్రహంబున జగత్ప్రిచయంబు ముట్టెడుభంగిఁబొదివి

తే. నకులుఁడును దదనుజుఁడు సాత్యకియు నాసు,భద్ర కొడుకును నెదిరినబలము నెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ బెల్లుసావఁ, జేయఁ గని కౌరవులు సంధి సేయువారు.

ఉ. చిత్తము లుల్లసిల్ల నలసింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువుమాడ్కి నరాతిబలంబు ముట్టి యు
ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్రు లేవురున్
నెత్తురుసీరఁ దేల్చిన నవిం గని మీనృపుఁ డల్క దీఱెడిన్.

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహోజం బ్రాణముల్ డాఁప కు
జ్జ్వలులై తో నడవన్ విరాటుఁడును బాంచాలుండు నేపారి సే
నల యుద్రేకము రౌద్రముం బెనుప నానాహేతిఘోరంబుగాఁ
దలపడ్డం గని గాక ప్రసుక్కుదురె గాంధారీసుతుల్ మాటలన్.

చ. తఱిమి శిఖండి దన్నొరులు దాఁకఁగ నెవ్వరి దిక్కుఁ జూడ కే
డ్తెఱఁ దనపూన్కిపై మనము ధీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁ డను బ్రహ్మకు వేయును నిండ భీష్ముపై
కుఱికినఁ గాక మాకు నగ మూరక యిత్తురె మీరు మేదినిన్.

శా. విద్యుద్దండము నిల్చి పోల్చినగతిన్ వి ల్లందమై యుండ న
స్మద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట యేల తక్కుదురు మీ దుర్గాహవక్రీడకున్.




'వక్క మాటలను
వినని గాడిదకు
దొక్క బద్దలై పోలేదా!'
(—పంచతంత్రము)

'కిం కర్తవ్యమ్?' అనుకున్నాడు కొలంబస్. ఓ క్షణం ఆలోచించి, 'భజగోవిందం' పాట తెలుసా, భ్రాజమానం?' అన్నాడు రాజు భుజం తట్టి.

'జ్ఞాపకం లేదండి'.

'భేష్. దార్లో కొస్తున్నావు. ఏది అడిగినా, 'రాదు' అనరాదు. గుర్తులేదు అనాలి. అన్నపాఠం వంటబట్టిందన్న మాట. సినిమాకి పనికొస్తావు ఫరవాలేదు...సరేగాని టాక్సీ డ్రైవరు సంగతేమిటి?'

"టాక్సీ డ్రైవరు చిత్రములో దేవానందూ వానియొక్క భార్య కల్పనా, బ్రాకెట్టు కార్తీక్ బ్రాకెట్టు ఆనందూ నటించిన ఈ చిత్రానికి—"

"హోల్డాన్. అది కాదు. మనగుమ్మంలో మన కోసం కాసుక్కూచున్న యొక్క టాక్సీ డ్రైవరు సంగతి. వాడికి డబ్బివ్వక పోతే తోలు ఒలిచేస్తాడు."

"ఎవరిదండి?" అన్నాడు రాజు ఎందుకైనా మంచిదని.

"నీకే"

"అయ్యా బాబోయ్ ఎలాగా?... డబ్బివ్వకపోతే మనని ఇంక ఎక్కనివ్వడా?"

"నిక్షేపంలా ఎక్కనిస్తాడు కాని మళ్ళీ దిగనివ్వడు"

'మీ బావగారు ప్రొడ్యూసరు గారు కదాండి. అక్కడికి కెళ్ళమని, గట్టిగా అరుద్దాం...డబ్బులిస్తారు అప్పుడేమో—'

'ఊహూ మంచిదే. కాని, మా బావకి నేను కనబడితే, నాగ్గూడా డొక్క చీల్చి డోలు కట్టిస్తాడు. పొద్దుట ఆయన ఓ చెక్కిచ్చాడు. తీరా అది మార్చేసరికి ఒక ...ఒక ఆడఫ్రెండు అప్పు తీసుకుంది.'

'అలాగాండి...మరి మీ బావకి చెప్పేస్తే ఆవిడ మళ్ళా ఇచ్చేస్తుందని?'

'ఆవిడ మళ్ళా ఇవ్వదుగా. అప్పు తీసేసుకుంది.'

'ఓహో అదాండి. మీకే ముందస్తుగా బాకీ అన్న మాట. భలేవారే.'

'పటక్'

'యస్సార్'

* * *

ఐదు నిమిషాలయేసరికి బయట కారు హారన్ మోగడం మొదలుపెట్టింది. ఇంకో నిముషానికి టాక్సీ డ్రైవర్ తల తొంగిచూచి తప్పుకుంది.

'బ్రదర్ లాభం లేదు...లే' అన్నాడు కొలంబస్ నిట్టూర్చి.

'వెత్తే ఎలాగండి. వాడు తోలు ఒలిచేస్తాడన్నారుగదా?'

'ఔను. దానికేం చేస్తాం. వాడిష్టం.'

'అంటే, నన్నేగా వాడు—'

'మరే నిన్నే.'

'అయ్యా బాబోయ్. ఎలాగండి. ఐ విల్ హోల్డ్ యువర్ లెగ్స్. మీ కాళ్లు పట్టుకుంటాను. దీజార్ నాట్ యువర్ హాండ్స్. ఇవి మీ చేతులు కావు' అన్నాడు రాజు లెంపలెత్తిపోయి.

'నావి కాపోతే నీవా...పటక్'

'యస్సార్.'

తనమీద కాస్సేపు జాలిపడ్డాక రాజు మీద పడ్డాడు కొలంబస్. అనక తను లేచి, రాజును లెమ్మని భుజం తట్టాడు. లేచి పెటిపట్టుకు బయల్దేరమన్నాడు. మళ్ళీ "ఒద్దులే...నేనే పట్టుకుంటాను. నీకింకా చేతకాదు. చిన్నపెడివేగా' అంటూ తనే పెట్టెపట్టుకుని రెండడుగులు వేసి, మళ్ళీ వెనక్కొచ్చి, పెట్టె తెరిచి అందులో విప్ప బేసి తీసి జేబులో పడేసుకు, పెట్టె మూసి బయల్దేరాడు. రాజు, వెనకే భయపడుతూ వస్తున్నాడు.

గుమ్మంలో టాక్సీ డ్రైవరు ఎదురై 'ఎన్నా సార్' అన్నాడు విసుగ్గా.

కొలంబస్ ధీమాగా నవ్వాడు; 'వెయిటింగ్ చార్జెస్ ఇస్తాన్లేవోయ్. డబ్బుతో పనిమాలాన లేటైంది' అంటూ; తక్షణం, కొలంబస్ చాలా బరువైన పెట్టె మోస్తున్నాడని డ్రైవరుకి అనిపించింది.

'ఇవిడీ తక్కుంగో' అన్నాడు ఆ పెట్టెని అందుకోబోయి.

'హ్హాహమ్మ. నువ్వొద్దు. వేండా. నాన్ మొయ్యరే. నేనే మోస్తాం లే! అంటూ బరువు మొయ్యటాన్ని అభినయించి, కారులో కూర్చున్నాడు.

'ఫో వేగా ఫో' అన్నాడు. కొంతసేపటికి దీపాలు వెలిగాయి.

* * *

'అంగ నిల్లు' అన్నాడు కొలంబస్ ఓ యిల్లు చూపించి. ఆ యింటిదగ్గిర బండి ఆగింది.

'ఇదు' అన్నాడు కొలంబస్ కారుదిగుతూ. రాజు ఎడంచేత్తో అవలీలగా ఆ పెట్టె తీయ్యబోయాడు.

కొలంబస్ ఛళ్లున అతని చేతిమీద ఓటి వేశాడు. 'ఆ పెట్టెని ముట్టుకోవద్దన్నానా. డబ్బా మరోటా! బరువు. ప్రతి తోటి దాన్నిం మోస్తావు' అని మందలించాడు.

'అందులో—' గొణగబోయాడు రాజు.

'మరేం ఫర్వాలేదు. ఈ బండి వాడు తెలుసులే' అంటూ చరచర రాజుని ఈడ్చుకుపోయి ఓ యింట్లో ప్రవేశించాడు కొలంబస్.

## ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

లోపల ఎవరో మీసాలతనూ ఇతనూ, 'టార్జాన్ యండ్ ది జంగిల్ బొన్' లో జానీ విసిముల్లర్ కన్న, తరవాత టార్జానులు వేసిన లెక్స్‌బార్కర్ ఎంత గొప్పవాడూ అన్న విషయమై పది నిముషాలు గుసగుస లాడుకున్నాక 'ఎడిటర్షి'ని అడక్కుండానే ఏకీభవించేశారు.

'ఇట్నుంచి అవతల వీధిలోకి దారుందా' అన్నాడు కొలంబస్.

'ఓ' అన్నాడు గూటంలా ఉన్న ఆ మీసాల అతను.

'కమ్' అన్నాడు కొలంబస్.

రాజా అతనూ పెరటి గుమ్మంలోంచి పక్క వీధిలోకి వెళ్ళిపోయారు.

'పెట్టో?' అన్నాడు రాజా.

'పెట్టె వాడికి, లేడ మనకి' అంటూ నవ్వాడు కొలంబస్.

* * *

టాక్సీవాడు 45 నిమిషాలు కూర్చున్నాడు. లీడీలు అన్నీ అయిపోయాయి. లేచి, వెనకసీట్లో పెట్టె వంక నిశితంగా చూశాడు.

మళ్ళీ కొలంబస్ ప్రవేశించిన ఇంటి వేపు చూశాడు.

పెట్టె తెరిచిచూస్తే బాగుండదు.

చూసే దేముంది. తెలుస్తూనే ఉందిగా అనుకుని, మెల్లిగా టాక్సీని పదిగజాల దూరం తోసుకుపోయి అక్కడ లోపల కెక్కి ఇంజన్ స్టార్టుచేసి తుర్రుమన్నాడు.

'ముకాల్ పసింగో......అప్పుడే కూడ, శాల్పతించి నిమిషం నా మరియాద గత్తాను ఇరిండ. ఇదుకు కూలె ఎవనాలె ముడియం. ఇదిపోరుం......ఇది నమ అదిష్టం' అనుకున్నాడు వెనకసీటులో పెట్టెకేసి అప్యాయంగా చూస్తూ.

రాజా, కొలంబస్ మళ్ళీ కాఫీహోటల్లో దూరారు.

"ఏంకీ దిగులుగా వున్నావు? జీవితంలాగు లేదు?" అన్నాడు కొలంబస్ తన విజయానికి మురిసిపోతూ.

"ఏంలేదు. ఇందాకట్నుంచి ఆలోచిస్తున్నాను. పాపం లక్ష్మన్నరసుని అలా అవమానం చేసేశానే అని. ఎంత కృతఘ్నుడిని అనుకుంటుందో! ఛెఛె. ఎమ్మెస్ రామారావునైతే పెద్ద బ్రాండు పొంగు పాడేవాణ్ణి ఇంక అపలిలా చెయ్యను. అది చెప్పినట్టే వింటాను. ఇద్దరం కలిసే గొప్పవాళ్ళం అవుతాం—" అన్నాడు రాజా.

కొలంబస్ జాలిగా నవ్వాడు. 'బ్రదర్ వుట్టి భ్రమ. అదెందుకు నిన్నెందుకు చేరదీసిందో నాకు తెలీదు కాని, తప్పొద్దన్న అది కనక రెండు పిక్చర్లలో హీరోయిను అయితే మొట్టమొదట మెడ పట్టి గెంటేంచేది నిన్నే. టోకరా ఇచ్చేది నీకే. అనుభవంమీద చెబుతున్నాను. ఎప్పుడూ ఇంకోళ్లతో కలిసి పైకి రావాలని ఆశపడకు. పైకెక్కే వాడిపక్కన నించుంటే వాడెప్పుడూ నీనెత్తిని కాలు కాలుబెట్టి ఇంకో మెట్టెక్కాలని చూస్తాడు అవసరం వస్తే అందుకు సందేహించడు. సినిమాలే కాదు. ఎక్కడేనాఅంతే. ఇంకెందుకు ఓకథ చెప్తాను విను.

చాలకాలం క్రితం రాజారావు, రామారావు అని ఇద్దరు బావమరుదులుండేవారు. ఇద్దరూ వెళ్లాళ్ళు అటూయిటూగా హోలీవుడ్ వచ్చారు సినిమాలోచేరాలని. రాజారావు చిన్న చిన్న వేషాలు సంపాదించడం మొదలెట్టినా, రామారావు ఇంకా వీధులవెంట తిరిగేస్థితిలోనే ఉంటూవచ్చాడు చాలా రోజులు. నిజానికి ఇతను ప్రజ్ఞావంతుడు కథలూ, పద్యాలూ పాటలూ అవీ రాయడంలో కాస్త చెయ్యితిరిగినవాడు. నాటకాలు వేసి, నటనలో కూడా అనుభవం సంపాదించాడు. పిటికన్న ముఖ్యం, అతని తెలివితేటలు. అందువల్లనే అలా అవస్థ పడేవాడనుకో.

రాజారావుకి బతుకు తెరువు తెలుసు. ఎవరో డిస్ట్రిబ్యూటర్లనీ, మంచిచేసుకుని వాళ్ళ వాడుగా ఉంటూ, వేషాలు సంపాదించేవాడు. సాధారణంగా సినిమాలో కథ ఆరంభం కావడానికి మొదట్లోనే చచ్చిపోయేవాళ్ళ వేషాలు దొరికేవి. అలా ఉండగా ఒక టమిల్ పిక్చర్ డబ్ చేసే బేరం వచ్చింది. డిస్ట్రిబ్యూటర్లకి, 'గౌరవ—అడ్డమైనవాడూ' అయిన రాజారావు ఆ బేరాన్ని సంపాదించాడు. రచన, డబ్బింగు, డైరెక్షను, డైలాగులు చదవడం గట్రా అన్నీ తనే చేసేటట్టు ఒప్పందం. మీరు రాసిన వేమన్నా ఉంటే చూపించమన్నారు వాళ్ళు. మనవాడికి పొట్టకోసి పెర్ర్పైతే పేసినట్టికి తే అక్షరముక్కకనపడదాయె, ఇప్పుడే వస్తానుండండి అని చెప్పి, రామారావు రూముకి వెళ్ళి, అతగాడు రాసిన పుస్తకాలో అవీ పట్టుకొచ్చి చూపించాడు. వాటిమీద టి. ఆర్. రావు అని పేరు ఉంది. రామారావు ఇంటిపేరు 'టి' వారుకే. అందుకని అలా వేయించుకున్నాడు. చిక్కు, రాజారావులక్కూ ఎక్కడంటే, రాజారావు ఇంటిపేరుకి కూడా 'టి' అనే అక్షరంతోటే మొదలవుతుంది అందుకని, వీడూ టి. ఆర్. రావు అవుతాడుగదా. సరే కాంట్రాక్టు రాసుకున్నారు. ఇప్పుడు డైలాగు రాసేవాడెవడు? పరాయివాడికి తెలిస్తే చిక్కని, అతను రామారావునే



ఆంధ్ర సాహిత్యసమితి ఆధ్వర్యాన పచ్చయప్ప కళాశాలలో జరిగిన అంతర్ కళాశాల ఏకాంక నాటికలపోటీలలో ఉత్తమ నటుడుగ ఎన్నికైన నిప్పాణి గిరిధర్

కూర్చోబెట్టి, పనిఇస్తాను చేస్తావా అన్నాడు. రామారావు సందేహించాడు.

అతని మేలుకోరిన ఒక పెద్దమనిషి, సినిమా అనుభవాలతో తలపండినవాడు ఒప్పుకోవద్దని సలహా ఇచ్చాడు

'అబ్బాయి! నువ్వు పైకిరావలసినవాడివి నీ ఫ్రెండు రాజారావూ అలాటివాడే. అందువల్ల మీయిద్దరు జాయింటుగా పైకిరాలేరు. ఎవడో ఒకడు ఇంకోడినెత్తిన కాలుపెట్టి పైకెక్కాలి అతనికి పనిఏమీ తెలీకపోయినా, అంతా తనే చేస్తాడని బేరం ఒప్పుకున్నాడు. కాబట్టి ప్రజ్ఞాశాలి. నీకు పని తెలిసినా, సందేహిస్తున్నావు. కాబట్టి నువ్వు లోకవ్యవహారంలో పరమవాజమ్మవి. అంచేత మీ కాంబినేషన్ నీకు మంచిది కాదు" అని నూరిపోశాడు.

కాని రాజారావు బలవంతం చేసినందువల్ల, రామారావు ఆ సలహాలు పట్టించుకోకుండా, పనిచేయడానికి ఒప్పేసుకున్నాడు.

ఇంక చెప్పేదేముంది. రాజారావు నానా హడావుడీ చేసి పెద్దరికం చెలాయించేవాడు.

ఇతన్ని గది కదలొద్దని శాసించి, సినిమాకి డైలాగులూ పాటలూ అన్నీ రాయించేసుకున్నాడు. ఇదికాక, ఇంకా అడ్డమైన చాకిరీ చేయించుకొని ప్రొడక్షన్ ఖర్చులన్నీ జేబులో వేసుకునేవాడు. డబ్బింగులో, మూడు కారెక్టర్లకి రామారావు చేత డైలాగులు

(56-వ పేజీ చూడండి)





# పెళ్ళికానుక

యన్. శ్రీకృష్ణారావు

"ఇవ్వాళ తారీకు ఎంతో తెలుసా?" అంటూ ఆఫీసు ఫైల్సు చేతి కందించింది కమల.

"జీతం రావటానికి ఇంకా పదమూడు రోజులుంది" అన్నాడు కమల భర్త మధుసూదనరావు.

"నే నందుకు చెప్పలేదండీ! మీ స్నేహితుడు చంద్రశేఖరంగారి పెళ్లి ఇక పట్టుమని పదిరోజులైనా లేదే అని జ్ఞాపకంచేస్తున్నా."

"అవును-దానికి ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?"

"ఇది మరీ బావుంది! ఏం చెయ్యాలో మీకు నేను చెప్పాలా? ఆయన కల్యాణానికి మనం కూడా ఏదైనా కానుక ఇవ్వవద్దా? పెండ్లి పందిరిలో ఉత్త చేతులతో నిల్చుండా మనంకూడా ఏదైనా తీసుకెళితే కదా గౌరవంగా వుంటుంది? ఆయన మన పెళ్ళికి ఏం ఇచ్చారో మర్చిపోయారా?..." అని చెప్పుకుంటూ పోతోంది కమల...

"సరి సర్లే!...ఆ సంగతంతా నాకు తెలుసు. నీ వ్యాఖ్యానాలేమి అక్కర్లేదు" అంటూ విసుగ్గా కోపంగా వెళ్ళిపోయాడు మధుసూదనరావు.

ఆఫీసుకు వెళ్ళాడన్న మాటేగాని అక్కడ ఏ పనీ చేయలేకపోయాడు. ఆఫీసుకువచ్చే ముందు కమల చెప్పినమాటలే ఆఫీసులో వున్నంతసేపూ జ్ఞాపకానికి వచ్చాయి.

"చంద్రంతో స్నేహం ఇవాల్టిది, నిన్నటిది కాదు. ఫస్టుఫారంనుంచి బియ్యేవరకూ కలిసి చదువుకొన్నాం. మేము ఇంటర్ చదువుతూండగానే చంద్రానికి పెళ్లిచేయాలని వాళ్ల తల్లిదండ్రులు ప్రయత్నించారు. కాని తను ఒపసకోలేదు. నేను కూడా ఉద్యోగంలో చేరేవరకూ పెళ్ళిచేసుకో కూడదనుకొన్నాము. కాని విధి బలీయమవటంవల్ల మేము బియ్యే ఫైనలీయర్ చదువుతూండగా కమలతో నాకు వివాహం జరిగింది. కల్యాణ సమయంలో చంద్రం నాకిచ్చిన ప్రెజెంట్ను గురించి తల్చుకొన్నప్పుడల్లా, నాకెంతో సంతోషంగా వుంటుంది. నామీద అతనికి ఎంత అవ్యాజ ప్రేమవుందో వర్ణించలేను. అతనిచ్చిన ప్రెజెంటులోనే వుంది, అతని దూరదృష్టి—బుద్ధికౌశలమూ—అందరి మాదిరిగా తను వెండి బంగారు వస్తువులివ్వ లేదు. నా పేరుతో తీసుకొన్న వెయ్యి రూపాయల నేషనల్ సేవింగ్ సర్టిఫికేట్లు నా కల్యాణ సమయంలో నాకు కానుకగా ఇచ్చిన చంద్రాన్ని చూసి పెండ్లి పందిరిలో వున్న వారంతా ఆశ్చర్యపోయారు! నాకు చెప్పలేని ఆనందం కలిగింది. నాలో నేనే తన్మయత్వం చెందాను. కృతజ్ఞత ఎట్లా చెప్పాలోకూడా నా కర్థం కాలేదు.

ఆ మర్నాడు—

"చంద్రం! నువ్వు చేసిన అపూర్వమైన ఉపకారానికి నేను నీకు ఏ విధంగా కృతజ్ఞత చెప్పాలో తెలియటంలేదు. శీఘ్ర కాలంలోనే నీకూ వివాహమయి నేనుకూడా నీలాగే ఓ ప్రత్యేకమైన కానుకను ఇస్తేనే కాని నా మనస్సుకు శాంతివుండదు. అం

# ★ పెళ్ళి కానుక ★

మను నాకా అవకాశాన్ని కల్గించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను" అన్నాను.

"పోరా! చవటా! కానుకట—కానుక! నా కల్యాణానికి నువ్వు సతీ సమేతంగా వచ్చి, నా దగ్గర కూర్చుంటే అదే నాకు నువ్వు ఇచ్చే ఉత్తమోత్తమమైన కానుక. పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనస్సు పాడు చేసుకోకు!" అని నన్ను హెచ్చరించాడు నా ప్రాణ స్నేహితుడైన చంద్రశేఖరం అనాడు.

ఇదంతా జరిగి మూడేళ్ళయింది.

చంద్రం సెక్రటరియేట్‌లో యిప్పుడు అసిస్టెంటు సెక్రటరీగా ఉన్నాడు. నిజం చెప్పాలంటే నాకు ఈ వుద్యోగం కూడా అతని దయవల్లనే దొరికింది. అదృష్టం కొద్దీ అతను గజిటెడ్ ఆఫీసరయాడు. నా దురదృష్టంకొద్దీ నేను గుమాస్తా అయాను!

ఇన్ని సంవత్సరాల తర్వాత చంద్రం వివాహం చేసుకోనేందుకు ఒప్పుకున్నందుకు నేను చాలా సంతోషించాను. కాని వెంటనే, అదోక విధమైన కలవరం నాలో ప్రవేశించింది.

చంద్రం వివాహానికి నేను ఏమి ఇవ్వగలను? నా వివాహానికి అతను ఇచ్చినది అందరికీ తెలుసు. అందుకు బదులు నేనుకూడా ఏదైనా ఇవ్వకపోతే, మా క్లాస్‌మేట్స్ అంతా నన్ను హేళనచేస్తారే! భగవంతుడా! నాకీపరిస్థితి ఎందుకుతెచ్చి పెట్టావు అని దుఃఖించాను!

చంద్రం వివాహం కిందటినెలలో జరిగి వుండినా బాగుండేది. కిందటి నెలలోనే చెల్లి పెళ్లికోసం చంద్రం ఇచ్చిన సర్టిఫికేట్లన్నీ మార్చివేశానే! ఇప్పుడు చంద్రం పెళ్ళికి పది రూపాయలు కూడా ఇవ్వలేని స్థితిలో వున్నానే! పది మందిలోనూ ఏంచెప్పను? పోనీ వెళ్ళటం మానేద్దామంటే ఉన్న ఊళ్ళో జరిగే పెళ్ళికి వెళ్ళకుండా ఎల్లా కుదురుతుంది. ఉన్న ఊరు కాకపోతే మాత్రం—చంద్రం వదిలేస్తాడా? ఎవళ్ళనో పంపిస్తాడు కూడాను, నన్ను లాక్కురమ్మంటూ...!

మనస్సు పరిపరి విధాలపోయింది. సాయంత్రం అయిదుగంటలయింది. బరువుగా కాళ్లు ఈడ్చుకుంటూ - ఆలోచిస్తూ ఇంటికొస్తున్నాను. దారిలో మా మిత్రబృందం నన్ను ఆపింది.

"ఏం మధూ! నీప్రాణ స్నేహితుడిపెళ్ళికి ఏమిటి నీకానుక?" అన్నాడు రామం.

వెంటనే ఏం సమాధానం చెప్పను? ఏమని చెప్పను?

"అంతా, పెళ్ళిరోజుదాకా రహస్యంగా వుంచాలనుకొంటున్నావా? ఆ కొంచెం మాకు తెలిసిపోతే నీలాటిదే మేము కూడా తెచ్చి నీ ప్రెజెంటుకు విలువలేకుండా చేస్తామనుకొంటున్నావా?" అన్నాడు జగన్నాథం.

"అదేంకాదురా! ప్రస్తుతం నేను కొంచెం చిక్కుల్లోవున్నాను. చంద్రం మీద నాకున్న ప్రేమకు సానుభూతిగా నాలుగు అక్షతలు వాళ్ళిదరిమీదా వేస్తాను. అదే నా కానుక" అన్నాను.

ఈ మాటలు విని వాళ్ళంతా విరగబడి నవ్వారు—"ప్రేమట! ప్రేమ! పాట్లకారేంకాదూ? ఈయనగారికి ఒక్కరికే కాబోలు ప్రేమ! మిగిలినవాళ్ళంతా విరోధులు—అంతేనా...యీ మాదిరి వేదాంతం మాట్లాడి ఊరందర్నీ మోసం చేయకు తమ్ముడూ" అంటూ నా భుజం తట్టాడు రామం.

"ఒరేయ్ రామం! మన మధు చూడ్డానికి చాలా అమాయకుడిలా వున్నాడని మోసపోకు! జలేయమ్‌డన్! లేకపోతే నీలాగ నాలాగ వుంటాడనుకొన్నావా? తన సొమ్ము ఖర్చంచూడు—తన వివాహానికి చంద్రం ఇచ్చిన వెయ్యి రూపాయలు మూటకట్టుకొన్నాడు. ఇప్పుడు చంద్రం పెళ్ళికి తను నాలుగు అక్షతలు వేసి తన పని పూర్తిచేసుకోనేందుకు చూస్తున్నాడు! ఒరేయ్! మధూ! నువ్వు బాగుపడతావురా!" అంటూ హేళనగా నవ్వుతూ నా వీపు తట్టాడు మూర్తి.

ఇంకా ఏమేమో అన్నారు. వినగలిగే స్థితిలో నేను లేను. మే మందరం క్లాసుమేట్స్. ఒకే ఆఫీసులో కాకపోయినా, ఒకే వూళ్ళోనే ఉద్యోగాలు చేస్తున్నాం. వాళ్ళు అంతా ఎవరికి క్కి తగినట్లు వాళ్ళు తలొక వస్తువూ ఏర్పరచుకొన్నారు.

అవాళ్టికి మా సంభాషణ ముగిసింది. ఎవరి ఇళ్ళకు వాళ్ళం వెళ్ళిపోయాము.

ఊరంతా బొంగరంలా తిరిగాను. అప్పు చేసి అయినాసరే కల్యాణమండపంలో నా గౌరవాన్ని కాపాడుకోవాలనుకొన్నాను.

తెల్లవారితే చంద్రం పెళ్లి!

ఆరోజుదాకా ఒక పెద్దమనిషి రెండు వందలు రూపాయలు అప్పు ఇవ్వటానికి అంగీకరించి అకస్మాత్తుగా—సర్దుబాటు కాలేదని మోసం చేశాడు! నాకు గట్టిగా ఏడవాలనిపించింది—కల్యాణానికి వెళ్ళటానికి కట్టుకోటానికి మంచిచీర లేదని కమలగోడ... ఎవరితో చెప్పుకోను నా బాధ...!! చివరికి ఒక నిశ్చయానికొచ్చి కమలతో చెప్పాను.

"కమలా! నా దురదృష్టంకొద్దీ అప్పు కూడా పుట్టలేదు. మనం ఉత్తచేతులతో అక్కడకు వెళ్లటం ఏం బాగుండదు. జీతం రాగానే—ఈనెలకి ఇంటి అద్దె, పాలు—కిరాణా కొట్టుబాకీలు అప్పు చేసి—ఏదైనా కొనితెస్తాను. మళ్ళీ నెలలో ఎల్లాగో సర్దుకొందాము—ఇద్దరం కలిసి అప్పుడు వెళ్దాం," అన్నాను.

కమలమాత్రం ఏం చేస్తుంది? 'సరే' నంది భారంగా.

వీధి తలుపు చప్పుడయింది. "కమలా! అప్పుడే ఎవర్నో పంపించాడు లాగుంది. చంద్రం! నేను ఇంట్లోలేనని చెప్పేసేయ్. లోపలికి రానివ్వకు" అంటూ నేను నా గదిలో దాక్కున్నాను.

కమల నేచెప్పినట్లు చెప్పి ఆ వచ్చిన మనిషిని పంపేసింది.

'హమ్మయ్య' అంటూ కూర్చొన్నాను. ఇంతలోకే చంద్రంకారు హారన్ మా ఇంటి ముందు మ్రోగింది. నాకు మతిపోయింది! వచ్చిన వాళ్ళు సామాన్యులా? చండప్రచండులైన రామం, మూర్తివచ్చారు. తిన్నగా నా గదిలోకే వచ్చేశారు.

"మధూ! ఇంకా కూర్చునే వున్నావా? నువ్వు రాలేదని మమ్మల్ని తిడుతున్నాడు చంద్రం. ఊ...ఊ...బయలుదేరు. నువ్వు

రాకపోవటంవల్ల అక్కడ ప్రోగ్రామంతా ఆగిపోయింది. అంతా నీకోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు రామం.

"నాకు వంట్లో బాగుండలేదు రామం! క్షమించమని చెప్పు," అన్నాను.

"ఒరేయ్! నువ్వు దబాయించకు! జ్వరంగావున్నా సరే! స్ట్రెచర్‌లో వేసి తీసుకు రమ్మన్నాడు-మేమంతా వాడికళ్ళకి మనుష్యుల్లా కనిపించటం లేదు—నువ్వు లేకుండా మేము అక్కడికి వెళ్తే వాడు మా వీపులు వాయించేస్తాడు!! నువ్వు గనుక ఇంకా పెంకితనం చేశావంటే మేము నీవీపు వాయించేస్తాం...ఆలోచించుకో... మర్యాదగా కారెక్కు" అన్నాడు మూర్తి.

నాకు ముందే తెలుసు ఇటువంటి దేదో జరుగుతుందని—ఏంచెయ్యను? వాళ్ళతో బయలుదేరాను.

నేను చంద్రం దగ్గరకు వెళ్ళానో లేదో:

"ఏరా ఫూల్! నన్నే మోసం చేద్దామను కొంటున్నావా?" అంటూ తనపక్కనే కూర్చో పెట్టుకొన్నాడు నన్ను చంద్రం. ఆ తర్వాత శాస్త్రప్రకారం జరగవలసిన వివాహకాండ అంతా జరిగింది. తర్వాత వధూవరులకు కానుకలు—

ఎవరికి తోచినది వారు చదివిస్తున్నారు. నేనో రాతిబొమ్మలా కూర్చున్నాను. ఎవరైనా నా ప్రజెంటుసంగతి అడిగితే నేను ఏం చెప్పను? మర్యాదగా అందరితోపాటు మొదట్లో నే పెళ్లికి రాకపోవటంవల్ల—పది మందిలోనూ నన్ను అవమానం చేయటానికి వేసిన ప్లానేమోఇది. లేకపోతే, నన్ను బలవంతంగా ఎందుకు రప్పించాలి? ఇంక అక్కడ వుండలేక పోయాను. నేనులేచాను వెళ్లిపోవటానికి...

"ఒరేయ్ మధూ! ఇంకా ఆశీర్వచనాలు కాలేదు కూర్చో" అంటూ మళ్లీ కూర్చొ పెట్టాడు నన్ను చంద్రం.

నాకు కళ్ళనీళ్ళు కూడా తిరిగాయి. ఎవ్వరూ చూడకుండా కళ్ళు ఒత్తుకున్నాను.

అందరూ బహుమతులివ్వటం పూర్తయింది. అప్పుడే లోపల్నుంచి యిద్దరు పని వాళ్లు ఒక పెట్టెతెచ్చి, అందులో వున్న దానిని బయటకు తీసి వధూవరుల ముందుంచారు.

"తన ప్రియమిత్రుడైన చంద్రశేఖరానికి వివాహ సందర్భంలో మధుసూదనరావు హృదయపూర్వకంగా సమర్పించే కానుక-రేడియోగ్రామ్" - అన్నాడు పురోహితుడు-

నా చెవులను నేనే నమ్మలేక పోయాను-నేనేమిటి?- రేడియోగ్రామ్ ఇవ్వట మేమిటి?

మా మిత్రబృందం అంతా నన్ను తెగ పొగిడారు. నేను ఎవళ్ళతోనూ ఏమీ మాట్లాడలేని స్థితిలో వున్నాను. నాకిదంతా అయోమయంగా వుంది. తర్వాత ఏకాంతంగా చంద్రాన్ని ఇలా అడిగాను:

"ఇదంతా ఏమిట్రా తమాషాగా వుంది?"

"తమాషా లేదు - గిమాషా లేదు - ముందు ఏదైనా తిందాంపద' అంటూ లాక్కుపోయాడు. ఆ తమాషా ఏమిటో చెప్పకుండానే నన్ను ఇంటికి పంపివేశాడు చంద్రం.

ఇంట్లో కాలుపెట్టే టప్పటికి నాకు మరో తమాషా ఎదురయింది.

తళతళ మెరిసిపోయే గులాబీరంగు సిల్కు చీర కట్టుకొని బాగుందా అంటూ ప్రత్యక్షమైంది కమల!!

మీ చంద్రశేఖరంగారు తన చెల్లెలుచేత పంపిచారు. మీకూవచ్చాయి బట్టలు - ఊఁ... మీరిల్లాగా వెళ్ళొచ్చారు కాబట్టి-కొంచెం ఇంట్లో వుండండి. నేనోసారి వాళ్ళింటికి వెళ్లివస్తా అంటూ, బయలుదేరింది. మళ్లీ వెనక్కుతిరిగి బట్టలతోపాటు ఏదోఒక కవరు కూడ వచ్చింది. మీ బల్లమీద పెట్టాను చూడండి," అని వెళ్ళిపోయింది కమల. కవరు చించాను. దాన్ని చంద్రమే రాశాడు!

ప్రియమైన మధూ!

నువ్వు మహాబుద్ధిశాలివి! నీ మెదడుకు ఇన్సూర్ చెయ్యాల్సిందే! కేవలం ఒక కానుక ఇవ్వలేని కారణంగా, నీ ప్రాణ స్నేహితుడి పెళ్లికిరాకుండా, ఇంట్లో వుండే లేదనిపించిన నువ్వు—బుద్ధికి బృహస్పతివి!!

నువ్వు ఎవరిదగ్గర అప్పు చేద్దామను కొన్నావో వారి ద్వారానే విషయం అంతా తెలుసుకొన్నాను. నీకు ఆయన ఇస్తానన్న డబ్బు ఇవ్వకపోవటానికి కారణం కూడా నేనే. నా కోసం నువ్వు అప్పుల్లోపడి కొట్టుకోటం నేను చూసి సహించలేను. అందుకే డబ్బు ఇవ్వద్దని చెప్పాను.

మూడు సంవత్సరాలక్రితం నీతో నేనేం చెప్పానో జ్ఞాపకం తెచ్చుకో! నువ్వు నా పక్కన వచ్చి కూచుంటే — అంతకన్నా నాకింకేం కావాలి? నీ నిర్మలమైన మనస్సులోని మంచితనాన్ని అర్థంచేసుకోగలిగిన నాకు నువ్వు కానుక ఇవ్వాలా?

చదువులో శుద్ధ మొద్దునయిన నన్ను నీ అపార విజ్ఞానంతో, పట్టుదలతో నా చేత కష్టపడి చదివించి ఉత్తమ విద్యార్థిగాచేసి—అన్ని పరీక్షలలోనూ ఫస్టుక్లాసులో ప్యాసయేటట్లు చేసిన నువ్వు—ఒక విధంగా నాకు గురువైన నువ్వు — కానుక ఇస్తే తీసుకొంటాననే అనుకొన్నావా?

నీ స్థితిగతులన్నీ నాకు బాగా తెలుసు— నా హృదయంలో నీకు శాశ్వతమైన స్థానం వున్నది. నేను శ్రీమంతుణ్ణనో లేక గెజెటెడ్ ఆఫీసర్ననో అని—నిన్ను మర్చిపోతానను కోకు. నేను ఎక్కడవున్నా నిన్ను మాత్రం మర్చిపోను. మనలో ఇమిడివున్న అవ్యాజ ప్రేమ శాశ్వతమైనది. దానిని ఎవర్లూ చెరుప లేరు.—

నీ ప్రస్తుత పరిస్థితివల్ల నా పెళ్ళికి రావని నాకు బాగా తెలుసు. అందుకనే నిన్ను బలవంతంగా రప్పించాను. నేనే ఒక రేడియోగ్రామ్‌కొని నీ పేర చదివించాను' పదిమందిలోనూ నువ్వు చిన్న బుచ్చుకో కుండా వుండాలనే ఈ పని చేశాను. అంత కంటే మరో కారణం లేదు. ఈ రహస్యం నీ మనస్సులోనే వుంచుకో!

డబ్బున్న వాడిని నేనుండగా నువ్వు డబ్బుకోసం ఇబ్బంది పడి అప్పులపాలవటంలో అర్థంలేదు. ఇప్పుడు నీకు సుమారు అయిదు వందలుదాకా అప్పులున్నాయని తెలిసింది. ఈ అప్పుల బాధతో నువ్వు తెంగపెట్టు కొంటూ ఆరోగ్యాన్నికూడా పాడుచేసు కొంటున్నావు. ఇటువంటి పిచ్చి పిచ్చి పనులు ఇక మానెయ్యి. సాయంత్రం మా చెల్లి కిచ్చి ఆరువందలు పంపుతాను. వెంటనే అప్పు లన్నీ తీర్చెయ్యి.

మరొక విషయం! ఈ సమయంలోనే చెప్పదలచుకొన్నాను. త్వరలోనే నువ్వు కూడా ఒక ఆఫీసరు పదవి నలంకరించ బోతున్నావు. నేనే రికమెండ్ చేసి పంపాను. బహుశా ఈ నెలాఖరులోగానే ఆర్డర్లు వచ్చేస్తాయి" ఆర్డరు నీ చేతికి వచ్చే వరకు ఎవరికీ చెప్పకు.

త్వరలోనే నువ్వు తండ్రి అవబోతున్నావని విని చాలా సంతోషించాను. నీకు పుత్రోదయ మయ్యేనాటికి నీ రోజులు పూర్తిగా మారిపోతాయని ఆశిస్తున్నా...ఇక నించైనా సంతోషంగా కాలాన్ని గడుపు.

కమలకీ, నీకూ బట్టలు పంపాను. అవికట్టుకొని ఇద్దరూ కలసి భోజనానికి రండి. నీ,—

"చంద్రం"

ఆనందంతో మధుకళ్లనుండి జలజలా కన్నీళ్ళురాలాయి! ★




(గతసంచిక తరువాయి)

## 14

సం(క్రాంతి వచ్చింది. మల్లు బోమ్మలు పడుతున్నాడు. ఇల్లంతా పాకేస్తున్నాడు. పుల్లయ్యకేసి చూసి ముసిముసిముద్దు నవ్వులు పొలకబోస్తూ తూలుతున్నాడు. ఆనందంలో ఆడోమాదిరిగాఅయిపోయి పుల్లయ్యకొడుకు అదరగా గంతులేస్తూ "ఛినక్ ఛినక్ పో" ఝుంజినకడి...ఝుంజినకడి..." కొడుకు చేతులాడిస్తున్నట్టుంది......నోరు పెగిలిస్తున్నట్టు భ్రమపడుతున్నాడు. ఒక్కసారి ఆకాశంమీదికి కొడుకును ఎత్తుతుంటే, పిల్లాడు ఏడవలేదు; కానీ ముసలమ్మకోపం పడుతూంది.

"ఎవడనుకున్నావ్.....నీకళ్లతోను చూడవా? నాను మొగ్గేస్తే...ఎగ్రాకి మీద నిల్చోడా?"

మల్లుకి ఆరునెలలు దాటలేదు...కూర్చుంటున్నాడు. "అదిగో అదిగో కూర్చుంటున్నాడు. గోడపట్టుకొని నిలబడ్డానికి ఎగబడుతున్నాడు...నామల్లు...నామల్లు..." అని ఒకటే ముద్దులవర్షం కురిపించాడు.

ముసలమ్మ బోసినోటి నవ్వుతో, "వయసుకుతగ్గ బువ్వ—బువ్వకుతగ్గ ఒళ్ళు—నీకొడుకు వచ్చే యేటికి పుండలే కాళీ చేస్తాడు...అయ్యో! ఛాడుదాన్ని...నాకే దిష్టియేస్తన్నాను..."

కుర్రాడు రోజురోజా వెలుగుతెచ్చి మనసుల్ని ఆనందంతో ఉర్రూతలూగిస్తున్నాడు.

చెరువుపంటల్లో పెసలు కొద్దిగా పురుగు పట్టినా, ఒకవిధంగా బాగానే రాలింది. ధాన్యం ఖరీదుకి కొలవగా ఆ భూములవల్ల మిగిలింది పెసలే. పుల్లయ్య స్వంతపొలంలో పండిన గింజలతో కాలంవెళ్ళిపోతూంది. అది జాగ్రత్తగా వాడకపోతే రాననికి తప్పెక్కడిది? కాట్నంయిచ్చిన నూలు అమ్మగా వచ్చినది చెప్పుకోదగ్గడబ్బుకాదు. పనిపాట్లు మళ్ళీ వేసవిదాటితేగానీ యేమీవుండవు. చోడిపంట వేసవికి కానీ అందిరాదు.

బ్రతుకుతెరువులు ఇలా వున్నా కొడుకు మల్లు ఆ విషయం ఆలోచించడానికే తండ్రికి అస్కారం యియ్యలేదు. సాలలో వున్న పోతులవైపు చూసి అవి అరుస్తున్నా జడవలేదు. చందమామను చూసి చెయ్యి ఆడించటం నేర్చుకొన్నాడు. రావిచెట్టు మీద పిట్టలు అరుస్తూంటే అటువేపు దీక్షగా చూడటం, తల్లినిచూసి, తండ్రిని చూసి నవ్వటం, ఒకోసారి తీసుకోపోతే ఏడవటం కూడా చేస్తున్నాడు. చిన్న పన్ను వచ్చింది. నవ్వుతూంటే ఆ పాల పన్ను ఎంత అందంగా కనిపిస్తోంది!

ఆ సంవత్సరమే ప్రభుత్వం ధాన్యం సేకరణ మొదలు పెట్టింది. ఊళ్లో మూలనున్న ముసలమ్మకు కూడా ఇంగిషు వచ్చింది. "ప్రాక్యూరిమెంటు" అంటే అందరికీ ఏదో భయం పుట్టించింది. కొంద రెందుకిస్తాం అన్నారు. మా చెమట — మా ఇష్టం— గవర్నమెంటోడికి న్యాయం లేదన్నారు కొందరు. పీస చాలా అలజడి చేశాడు. వాడి మాటలు మాడోంతుల ముప్పాతిక మంది నమ్మారు. "లెక్కలన్నీ పంట పొలంలో ఉండగానే తయారయిపోయినాయి. యిప్పుడా దొంగరాతల్ని నమ్మి గవర్నమెంటోడు, పోలీసోళ్ళి, ఎఫ్ సఒని, టి. ఎస్, ఒని, పంపి, యిస్తావా, సస్తావా అని బెది రిసాగు పెద్ద కబుర్లాడిది కైదే!".

పుల్లయ్య మీసాలు మెలివేశాడు. "ఎలాంటోడు నాకొట్టు ముట్టాడో చూస్తాను, ఉన్నోడికొట్లు కాళీసేసి, లేనోడి దగ్గరికి గవుర్నమెంటోడురానీ, ... ఆశే అడికి కలిగింది యిస్తాడు".

"ఈ యేటి కిలాగయిపోయిందిలే. గవుర్నమెంటోడు, వచ్చేయేడు ముందే మిడతల దండులాగ వచ్చేస్తాడు", అని జోస్యం చెప్పాడు పీస.

గ్రామకరణీకం శాశ్వత వారసత్వపు హక్కు ప్రకారం, పట్నంలోవున్న, శ్రీ సీతారామస్వామివారి సంతతి చెయ్యవలసింది. కాని వారి హక్కును పదిహేనువత్సరాలకని నాలుగువందలు పుచ్చుకుని, వూళ్లోవున్న పట్నాయుడుకు యిచ్చారు. ప్రస్తుతంవున్న కరణం ముప్పయియేళ్లవాడైనా అయిదుగురు పిల్లల తండ్రి. తన తండ్రి ముసలిపండు నక్క. గొప్ప వ్యవహారస్తుడు. భూసంబంధమైన వ్యవహారాలు కుదిర్చి కొంత డబ్బు సంపాదించుకుని బ్రతుకుతున్నాడు. కొడుకుకు కరణీకంతో తనకు అధికారం వచ్చింది. అయితే యీ అధికారం యిదివరకు భూక్రయవిక్రయ తనఖాదుల సమయాల్లోనే డబ్బు చేసుకోడానికి పనికివచ్చేది. కాని ఇప్పుడు ప్రొక్యూరుమెంటు అసలైనఅధికారాన్ని యిచ్చింది.

ఈ ముసలినక్క ఒకప్పుడు చాలా వరకు వున్న మనిషి. పదకరాల పొలం, నిక్షేపంలా వుండేది. పది గ్రామాల్లోను, హోదాగా, మాలుకోదారుగా చెలామణీ అయిపోయేవాడు. ఉన్న ఒక్క కూతురుపెళ్ళి అయిదు రోజులు బ్రహ్మాండంగా సంతర్పణలతో చేశాడు. జలుమూరు మాలుకోదారుతో సంబంధం చేశాడు. జలుమూరు మాలుకోదారులంటే, ఆరోజుల్లో చక్రవర్తుల్తో సమానం. వాళ్ళ రాబడి తగ్గట్టు యింట లక్ష్మీ సరస్వతులు తాండవమాడేవి. అలాంటి కుటుంబం, అతిరంతోనే సరి. వాళ్ళ పిల్లలు, ఖరగ్పూరులో రైల్వే వుద్యోగాలు చేసి రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితులలో వున్నారు. ఆ మాలుకోదార్లగురించి యిప్పటికి ఆ చుట్టుపట్ల గ్రామాల్లో చెప్పుకుంటారు. భట్రాజులు ఆ పొగడ్తలు యింకా మరచిపోలేదు. అలాంటివాళ్ళతో ఆ రోజుల్లో సంబంధంచేశాడు. కత్తిపీటనుంచి పందిరికోళ్ళ గిలక మంచం వరకు సారె యిచ్చి పల్లకీతోనూ పద్దెనిమిది యెడ్లబళ్లతోనూ, నూటొక్క కావిళ్ళతోనూ కూతుర్ని అత్తవారింటికి పంపించాడు. ఆరోజుల్లో కట్నాలుండేవికావు. కట్నం అంటే యేవగింపు. కొన్ని సంవత్సరాల వరకు యీయనచేసిన పెళ్ళిగురించి ఆ చుట్టుపట్ల అనుకోకుండా వుండలేకపోయారు. ఈ కీర్తి తన పదకరాలను అమ్మించింది.

ఈయన ఇప్పటికి, తనజీవితంలో ఈఒక్క ఘనకార్యంచేశాను చాలని మురిసిపోతూంటాడు. కూతురు అత్తవారింటి కెళ్ళాక ఒక్క సంఘటన జరిగింది. పదిహేనేళ్లయినా నిండని యీ పిల్ల తెలివిని, అత్త, విసవాడపడుచూ పరీక్షింపచూశారు. వేపుడుకు, ముద్దకూరకు, పులుసుకు, కావలిసిన కూరగాయల్ని తరిగి ఒక జంగిడలో కలిపివేసి వంటయింటిదగ్గర పెట్టేశారు. మాలుకోదారు భార్య, కూతురు, సొఖత్స్నా వండవలిసిందే. వచ్చిన చుట్టాలకు వడ్డించవలసిందే! కోడలు కూడా ఆ యింటి తరహాను మన్నించాలి. దేనికి కావలిసిన కూరగాయలను, ఆమె వేరుచేయటంతో యిద్దరూ గర్వపడ్డారు. పొయ్యిమీదినుంచి దించటానికి వల్ల గుడ్డలేదని ఆ యిల్లాలు అత్తగారిని అడిగింది. అత్తగారు పరిహాసంగా, కన్నవారు యివ్వలేదా అని ప్రశ్నించింది. ఆమె వెంటనే కట్టుకొనివున్న పట్టుచీరచెంగుచించి వల్ల గుడ్డగా వాడింది. ఈ ఘటన యిప్పటికీ యీ తండ్రైన ముసలాయన, యెందరితోనో చెప్పి తన పరువు కూతురు నిలబెట్టిందని సంతోషిస్తూంటాడు.

భూమిపోగానే రాతకోతలతో బతుకుతూ కొడుకును కరణంగా చేసుకొన్నాడు. ఆ కరణం చెవుల్లో యీ వూళ్లో ఆడుతున్న గుసగుసలు దూరాయి. ఇటుజీతం హెచ్చించలేదని గవర్నమెంటుమీద, అటు తనకు మామూలు చెల్లించలేదని రైత్వారీ ప్రజల మీద అక్కసు హెచ్చయింది. రోజుకో లెక్క, రోజుకో డొక్క మొత్తంమీద సర్కారువారి బలవంతం, అంతగా లేకపోవటంవల్ల యిచ్చిన కొద్ది ధాన్యమే సేకరణ చేశారు. వేసవిలో చోడిపంట బాగా పండింది. మళ్ళీ వరి పూడుపులు పూర్తయ్యాయి.

పదేళ్ల క్రితం గరిసె అరవై రూపాయలు వున్న ధాన్యం, యిప్పుడు ఆరువందలైంది! ప్రపంచం తల్లకిందులై పోతోందని బీదా బిక్కీ, పేదా రోదా అనుకొన్నారు. బ్రతుకు భారం మోయలేక, చావలేక దేవునిమీద భారంవేసి, క్రుంగుతూ కృశిస్తూ వున్నారు. ధాన్యంతోసహా వుప్పూ పప్పులూ రోజుకో ధరతో, ముందుకు పరుగెత్తుతున్నయ్. కోమటి వీరయ్య అడ్డకు అణా హెచ్చితే, పదణాలు హెచ్చిందని కేకలు వేస్తున్నాడు. నాయుడు, పెద్దరైతు వగైరా పెద్దల అవసరాలు అన్నీ కోపరేటివ్ షాప్ కంట్రోలు ధరలకి యీయగా మిగిలినది మళ్లీ రాత్రికిరాత్రి పట్నం రెట్టింపుధరకి నడచిపోతూంది.

దాసుడు కావాలకు దరిచేరనీవాడు లేడు. వాసుకే ఆకలితో అలమటించి పోతున్నాడు. అయినా సాయంత్రమైతే నీలమ్మ గుడి తలుపు తీయటం మానటంలేదు. ఒక్కోసారి ఏడ్చేవాడు. ఆ కన్నీరులో తల్లి బాధ విన్నదనే తృప్తితో కడుపు కొంతనిండేది. ఊర్లో కాలంపెట్టి నలుగురితోను సంబరం తల్లికి చెయ్యండి. ధరలు తగ్గుతాయంటే, తెలివారు గ్రామపెద్దలకు చెప్పమనేవారు. పెద్దలు పకపకా నవ్వేవారు. దానితో మళ్లీ ఆకలితో ఒళ్లంతా నలుచుకుపోయేది. కోరతి అడగటానికి అందరికీ అభిమానం వేసింది. ఒకవాడు చీకట్లో వెళ్ళిపోతూ ఆ రాత్రి తను వస్తువుండాలని ఆ పిక వచ్చేసరికి కాలుముందుకు పడలేదు. ఆ త్రోవపోతున్న పుల్లయ్యకేళ్ళ చూసేసరికి ప్రాణం వచ్చింది. ఇదివరకు రెండుసార్లు పెద్దలను అడిగి, వాళ్ళ ఆగ్రహానికి పాత్రుడయ్యాడు పుల్లయ్య. మళ్ళీ అడిగించినా లాభంలేదు. అయినా భుజంమీద చెయ్యివేసి వెంట పడ్డాడు. నరాలన్నీ చుట్టుకుంటున్నా ఓపిక చేసుకుని మెల్లగా అడుగులువేస్తూ వేస్తూ,

# ★ దగాపడిన తమ్ముడు ★

పుల్లయ్య ఇంటికివచ్చి మౌనంగా చూస్తున్నాడు. మల్లు అప్పటికి వడుస్తున్నాడు. "అత్త...తాత" అంటున్నాడు. ఆడుకుంటు తనదగ్గరకు వచ్చాడు. ముఖంవేపుచూశాడు. బుడ్డీ దీపం వెలుగులో, నల్లగామాసిన గడ్డంతో, డొక్కలాడున్న దాసుడు మల్లుని చేరదీయటానికి చేయి చాచాడు. మల్లు దగ్గరగావస్తూ "తాతా..." అన్నాడు.

"ఆతల్లి రక్షించాలి...చీకటిలో పొద్దు—సంవత్సరంలో ఓడలాంటోడా తమ్మా!"

పుల్లయ్య కొడుకు యెదురగా భవక్ భవక్ సా, అనిగంతాడు. కొడుకు నవ్వుతూ గంతేయాడు, కాని దబ్బున పడిపోయాడు. ఏడుస్తాడనుకుంటే మళ్ళీ లేవబోతున్న కొడుకుని, యెగరవేసి గుండెకి హత్తుకున్నాడు. ఇప్పుడు "అమ్మ...అత్త" అని వత్తివత్తిగా అంటున్న కొడుకు మాటలన్నీ "అయ్య" అన్నట్లుగానే పుల్లయ్యకు వినిపిస్తున్నయ్.

దాసుడు మనకు తెలిసున్న నీలి, కోడిపింఛలో చేసిన రొట్టిముక్క యిచ్చింది. కళ్ళకు అద్దుకున్నాడు. నీలమ్మని తల్చుకునే, అలా చూస్తునే, నమిలిమింగేశాడు. తనంలో బలం వచ్చింది. మల్లుని ముద్దాడి మెల్లగా లేచి యింటివైపు నడుస్తున్నాడు. పుల్లయ్య కొడుకుతో ముచ్చట్లలో పడ్డాడు.

నడివీధిలో యేదోగొడవగా వున్నట్లుంది. సీనచుట్టూ యెంతోమంది మూగి వున్నారు. సీన పెద్దగొంతుకతో సీనవార్తలు చెపుతున్నాడు.

"మీరంతా యిన్నారో లేదో!... ఆ కృష్ణపరమాత్మకి అర్జునుడు లాంటోడు సెరూ! గ్రాంధీ మహాత్ముడున్నాడే, దేముడేకదా—ఆ దేముడు, పట్టుపడితే అలాంటి అక్షోణీలక్షోణీలసేనలతో వున్న, విరులు కౌరవబలమే ఓడిపోయిందికదా—యీ తెల్లోడు ఒకలెఖ్కా! రేపటినుంచి తెల్లోడి రాజ్యంపోయి—నల్లోడిరాజ్యం వస్తోందట...ఇంక చూడండయ్యా...!"

యింకా ఆ ధాటికి పుజగుమిగూడి పోతున్నారు. దాసుడు ఆ దరిదాపుల్లో పెద్దరైతు డాబాయింటి అరుగుమీద కూర్చుని వింటున్నాడు. సీన అభినయంతో— "ఇప్పుడున్నదంతా మారిపోతాది— ఈ కాంగ్రెసోలకి పెద్దోడా సెరూ! ఎక్కువ పిల్లలున్నోళ్ళకి ఎక్కువ వపాలం— తక్కువున్నోలకి తక్కువిస్తాడు."

"పిల్లలు లేనోలకో?" ఎవరో గుంపు నుంచి ప్రశ్నించారు.

"అలాంటోలకి గవర్నమెంటోడు పాలాపాలా తక్కువభూమి యిస్తాడు." సీనగొంతుక సర్దుకొని, "పట్నంలో మందడి యింతా అంతా కాదు. నీకొడుకూ, నాకొడుకూ కలెకరు అవుతాడు."

"పోపోరా!" అన్నాడెవడో.

"నూతిలో కప్పలోంటోడివి నీకేంతెలుసు! తెలివైనోడు నా కొడుకైతేనేం,నీకొడుకైతేనేం ఆడికిపెద్దపని అవుతాది-నాను పెద్దోడ్ని కాకపోయినా, నా కొడుకు తెలివైనోడైతే, పెద్దోడవుతాడట! మనిషికి మనిషికి తేడా వుండదు. పాకలోడి కూతురికి మంగలోడి కొడుక్కు, మంగలోడి కూతురు బాపనయ్య కొడుక్కి పెళ్ళాడొచ్చు! వద్దన్నోలకి గవుర్నమెంటోడు కైదులో పెట్టాడు!"

"ఏమూరాజు వచ్చినా యీ కరువు పోగొడ్తాడా?" అని ఒక ముసలమ్మ ప్రశ్నించింది.

"ఈ కరువుపెట్టినోలందరికి కైదే!— దానితో కరువు పటాపంచలైపోతాది. మనోడు గవుర్నమెంటోడు-మనమంచి నూడా! అంతా మేజిక్ లా పని యింక జరిగిపోతాది—నూడండి—నూడండి!"

ఈ మాటలు సాలామందికి నచ్చాయేమో కాని, దాసుడికి నచ్చలేదు. మెల్లగాలేచి ఆ సమూహందగ్గరకు వెళ్ళాడు. వెళ్తొండగానే అక్కడవున్న కొందరివైపు చూస్తూంటే, ఒళ్లు మండిపోతోంది. ఆ గ్రామానికి యిప్పుడు పెద్దలనుకున్న కుర్రకుంకలంతా అక్కడేవున్నారు. వాళ్ళకి దొంగసారా త్రాగటం తెలుసు. పట్నం పదిసార్లు బయస్కోపులకు వెళ్ళటం, సిగరెట్ పొగ రింగు రింగులా వదలటం అలవాటు. బింకంగా పసందుగావున్న అమ్మాయిలమీద కన్నేసి కార్యం నెరవేర్చుకోవటం తెలుసు. యిప్పుడు వీళ్లు గ్రామానికి నాయకులు. వీళ్ల తల్లిదండ్రుల మాటలు చెలుబడికాకుండా పోతున్నయ్.

వీళ్ళంతా "భేష్" అంటున్నారు. దాసుడు యెందుకో వుగ్రుడైపోయాడు. సీనయేవో కల్లిబొల్లి మాటలాడుతున్నాడని స్ఫురించింది. సమూహంచేరగానే, "సీనా!" అని అరచాడు. ఈ అరుపుతో నిశ్శబ్దం ఆవరించింది. "ఎవ్వడా నీకు చెప్పాడు? మేజిక్ లా అయిపోతాదని?" సీన యేదో చెప్పటానికి వస్తూంటే, అవకాశం యివ్వకుండా దాసుడు "మనసులబట్టి మనం! ఎవుడొచ్చినా మనలో నీతి న్యాయం లేకపోతే, యింతకంటే వూరు అధ్వాన్నం అయిపోతాది—"

నాయుడు యెగ్రగించి చూశాడు. దాసుడు పెద్ద గొంతుకతో "ఈ పెద్ద మనుష్యుల్లో యెందరికి నీతి వున్నాది? ప్రజలిలాగ మాడిపోతూంటే, డబ్బు దాచుకుంటున్న యీ తాగుబోతులంతా పెద్ద మనుషులా సీనా?"

"నోరుముయ్ మంగలి యెధవా?" అరిచాడు నాయుడు.

దాసుడు మతిచలించినట్లయింది. తన వునికి నేమరిచిపోయి "మూస్తాను మూస్తాను- ఆడదాని యేలుబడి—నీవేం నాయుడివి? ఊరిపెద్దవైతే యేనాడో ఆతల్లికి సంబరం చెయ్యిద్దువు. ఈ కరువులు, కాటకాలు తీరును!"

దాసుని తల పూడినట్లు ఒక్క దెబ్బ పడింది. త్రాగుడు వాసన చుట్టూ వెదజల్లే నాయుడితో సహా కూడిన యువకుల చేతులు దాసుడిపై పడ్డాయి. పడుతున్నా దాసుడు, తన నిందా వాక్యాలను యేక కంఠంతో అరుస్తున్నాడు. మీరే ఒక తల్లీ తండ్రికి పుట్టివుంటే ఆ కేసులో గడించిన డబ్బుతోనూ బీదా బిక్కా, ఆకలితో చచ్చిపోకుండా వుండనిచ్చేవారని, నీతిలేనిమనుషులనీ అరుస్తున్నాడు.

ఈ అరుపులు పుల్లయ్య చెవిలో పడగానే పరుగెత్తాడు. అప్పటికే కొందరు జోక్యం చేసుకొంటున్నా పుల్లయ్య నలుగురినీ నాలుగు వేపుల త్రోసి క్రింద కూర్చున్న దాసుని వేపు చూశాడు. ఆ కళ్ళల్లో రౌద్రం ఒక్కసారి పుల్లయ్యను చూడగానే అభిమానంతో నిండి అశ్రువులుగా మారిపోయాయి.

పుల్లయ్య ఆ పెద్దలందరినీ వుద్దేశించి "మీరంతా దున్నలు! వాటికైనా నీతి వుంటాది. దాసుడి మీద మళ్ళీ చెయ్యి వేసారంటే-ఒక్కొక్కడి పీక తెగేసాను-పోతారా లేదా?—ఊరికి పెద్దలు—గోచీ పాతలు—"

"ఎవడూ?" మాలిగాడు కోపంతో నాయుడు.

"నేను- పుల్లయ్యని! నాయుడైతే నాయుడిలా వుండు. "మధ్యను రాజిగాడు పోపోరా అన్నాడు పుల్లయ్యకు ముందుకొచ్చి, వాడిచేయిపట్టుకొని అంతదూరంవిసిరేశాడు. అక్కడనుంచేవాడు నీపనిపట్టకపోతే యెర్రయ్యకొడుకునే కాదన్నాడు, "పోరా యెదవా? నువ్వుయెర్రయ్యకు పుట్టినట్టే మాటాడతావు. గుడ్డెంకన్నరా మీ అయ్యా!"

పరిస్థితి విషమించేదే, నలుగురూ కూడి రాజిగాడ్ని, వాళ్ళ యింటివైపు త్రోసుకపోతూంటే, "మేక పులిని కరుస్తాదా? నీ బతుకంటేయెంత?"

పుల్లయ్య దాసుడ్ని లేవనెత్తి, చెయ్యి పట్టుకొని వాళ్ళయింటివైపు నడిపించాడు. దాసుడు దుఃఖంతో మాట్లాడలేదు. త్రోవలో ఒకయింటిదగ్గర గుమ్మంలో గ్రుడ్డివెంకన్న, గన్నెమ్మకూర్చునివున్నారు. అక్కడ జరిగినసంగతి పూరంతా ప్రాకిపోయింది. ఆయింటియిల్లాలు గంజిపోస్తూంటే వెంకన్న అన్నాడు;

"తల్లీ! ఆదాసుడు పంబరం పంబరం అని కొట్లాడిపోతున్నాడు. ఇపెజల్లా, ఆ నీలమ్మ తల్లిలోనూ నీతిసచ్చింది. ఆతల్లికే నీతుంటే యీ గేమ పెద్ద యిల్లల్లో నలుగుర్ని లేదనిపించదా?"

దాసుడు "ఛాఛా" అన్నాడు. "ఆతల్లికి నీతివుందికాబట్టి కొడుకులకు గ్రాసం లేక పోయినా, భరిస్తున్నది!"

అంతే మరిమాటాడలేదు. ఇల్లుదగ్గరగా వస్తోంది. ఊడిన జుత్తయినా ముడివేసుకోలేదు. ఆకాశాన చుక్కలువెలుగు. వీధిలో మరెవరూ నడవలేదు. దాసుడు ఆగి, "నాయనా పుల్లిగా!" అన్నాడు. "నానూ మొదట అబద్దాలాడేవోడ్ని. లేనిపోని వేసాలు వేసేవోడ్ని. ఆతల్లిని కొలిచాను. నాకుమంచిగతి దొరికింది. ఈలంతా...". పుల్లయ్య చప్పున "నువ్వేమి జడిసిపోక," అని అందుకున్నాడు.

దాసుడు చిన్ననవ్వునవ్వి "జడుపా! నీతి కోసం కడుపు మాడినస్తేయేం? నలుగురి నేతా దెబ్బలు తింటేయేం? నాయనా, యేడ్చేవాడినే ఆతల్లి ఓదారుస్తాది. నా గుండెలో యేడుపూ లేకపోతే నన్ను యెవరు యేం చేసినా, నాకు తగలదు — ఎర్ర నాయనా — పంబరం సెయ్యండని నాపాపులాట యెందుకు? నువ్వు గరిడీ మరిసిపోతే నీ కొడుక్కు వస్తాదా? నీ కొడుక్కు రాకపోతే అంతాసరి—ఆ పుట్టినోల్లు బతకఖర్లేదు!"

పుల్లయ్య వెనుకకు తిరిగాడు. దాసుడు మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ యిల్లు చేరుకునేసరికి కొడుకు అగ్నివర్షం కురిపించాడు. "కయ్యం పరికి పరితోనిఆడుతావా? పూరంతటితోని ఆడుతావా? నా పరపతి పోయింది. వేరే వుండు," అన్నాడు చివరికి కొడుకు.

దాసుడు ఆ క్షణంలో మినుకు మినుకుమనే చుక్కలవేపు చూస్తున్నా నీలమ్మతల్లి పాదాలు కనిపించటంచేత కాబోసు చిన్న నవ్వు నవ్వాడు.

## 15

వీరావేశంతో యింటికి వెళ్ళిన రాజిగాడు, పెళ్ళాం మాటలు వినక తప్పిందికాదు. భార్య నోరెత్తగానే నాయుడు కిక్కురు మనకుండా పూరుకున్నాడు. రాజిగాడి పెళ్ళాం పుల్లయ్యను సమయంవస్తే కాళ్ళమీద పడేటట్లు చేయిస్తానని మొగుడికి హామీ యిచ్చింది. తండ్రి వాడితో దెబ్బలాట ఎందుకన్నాడు. నాయుడితండ్రి, దాసుడ్ని సమర్థించగానే కోడలు కస్సుమంది. తను, పంవత్సరమైంది. యే విషయాల్లోనూ జోక్యం లేనట్లుగానే మెసులుతున్నాడు. ఒకప్పుడు ఏం కావాలన్నా, ఏం చెయ్యాలన్నా తన కోరిక సాగదు. అలా కోడలు పోసిందేదో త్రాగవలిసిందే!

ధాన్యం ధరలు రోజు రోజుకీ పెరిగిపోతున్నాయ్. గంజికూడా తాగడానికి లేక కొన్ని కుటుంబాలు తహతహలాడిపోతున్నయ్. ఉన్నమటుకు 'పిసరపిప్పి' అమ్మివేస్తున్నారు. ఇంకా కోతలు పట్టలేదు కాబట్టి ఎక్కడా పనిపాట్లులేవు. ఆకలి అబద్ధాలు ఆడించి కొందర్ని పూరినుంచి పట్నం పొయ్యేలా చేసింది. అక్కడ కూలీ నాలీ దొరకపోతే దొంగతనం చేయడమే పద్ధతి. ఏమైనా చిక్కితే ఇంటికి రావటం, లేకపోతే ఖైదు సంతోషంగా అనుభవించటం! ఇలాంటి దారుణ పరిస్థితులు రావటంతో, పీస చెప్పినమాటలు అబద్ధాలని ఎందరో ఎత్తి పొడిచేవారు. పీస అసలు బాధపడుతున్నాడు. రాత్రులు తిండివుంటే తినేవాడేకానీ, పిల్లలబాధ కొంతలో కొంతైనా తీరుతుందని, "ఉపవాసం వుంటున్నాను—" అనేవాడు. "పుట్టగానే పిల్లడు నడిసేసాడా? మాటాడేసినాడా? ఓర్సండి. మన గవుర్నమెంటోడు పెద్దోడైతే, మనకు యిలాగ వుస్తాడా? పోషించడా?" అని నలుగుర్ని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తే కొందరు "గవుర్నమెంటోడు తెలుసుకొంటే యేం కాదు? నందిని పందిసేస్తాడు; పందిని నందిసేస్తాడు!—కరువు పోవాలని గట్టిగా పట్టుపట్టైపోదా?" అని ప్రశ్నిస్తే,—

"ఓరయ్యా! కంట్రోళ్ళు పెబతుకుతారని పెటాడు. దానిపేరుసెప్పి అవతల గవర్నమెంటోడి సిబ్బంది, యిటు, యేపారం సేసినోడు పెజలకడుపుమాడ్చి మూటకడుతున్నారు! కట్టనీ—ఎలాగొచ్చింది అలాగే పోతాది! సెమటోడ్చి గడించిందే నిలవను, అలాంటిది యిదంతా నీటిబుడగలాంటిదిరా! ఏ తిప్పిరీలోపడి బుడగ పేలిపోదురా? ఆ గజేంద్రుడు మొరపెట్టేకదా దేవుడు విల పడపాటున వచ్చేసాడు. నీకూ నాకూ సావుంది కానీ, నాయం నీతికి సావు లేదురా?" చెయ్యికటిగా గుండెమీద వేసు

(47-వ పేజీ చూడండి)

## దద్దనాల రంగనాయకమ్మ

నేను క్లాసులో అడుగుపెట్టేసరికి నా సీట్లో ఒక అమ్మాయి కూర్చునివుంది. నేరుగా వెళ్ళి నా డెస్కుమీద పుస్తకాలు పెట్టుకొంటూంటే "ఇది మీ సీటా?" అంటూ పక్కకి జరిగిందా అమ్మాయి. ఆ పక్క సీటు అమ్మాయి పొద్దుట రాలేదు. మరి, ఈ పూట వస్తుందో, రాదో. నేను నా సీట్లో కూర్చున్నాను. మధ్యాహ్నం ఇంటికి వెళ్ళిన ఇద్దరు ముగ్గురమ్మాయిలు తప్ప క్లాసులో ఎవ్వరూ లేరు. నాకు కొత్తవాళ్లని పరిచయం చేసుకోటం చాలా సర్దా. ఆ అమ్మాయిని మాటల్లోకి దింపాను.

"ఇక్కడ జాయినవ్వటాని కొచ్చావా?" అన్నాను. అవునని తలూపింది.

"ఎవరు తీసుకొచ్చారు? జీతం కట్టేసి పేరు వేయించేశారా?"

"పేరు వేయించానని చెప్పాడు మా బాబాయి. తనే తీసుకొచ్చాడు."

"నీపేరు?"

"సుబ్బలక్ష్మి"

"అన్నయ్యలుగాని, తమ్ముళ్ళు గాని వున్నారా? ఏంచేస్తున్నారు? వాళ్ళ పేర్లేమిటి?

"ఒక్క తమ్ముడు, నాలుగేళ్ళంటాయి. పేరు శివభూషణ్. ఇంకో చెల్లివుంది. నాతోనే వచ్చింది, ఫస్టుఫారంలో చేరటానికి. ఆ అమ్మాయిపేరు నాగలక్ష్మి. నీపేరు?"

"సంపత్. మీ నాన్నగారేం చేస్తారు? మీ బాబాయికూడా ఉద్యోగమా?"

"లేదు. మా బాబాయి ఇంటర్ సెకండియర్ చదువుతున్నాడు. మా నాన్నగారు పోస్టుమాస్టరు. మేము నూజివీడునుంచి వచ్చాం. ఈ క్లాసులో ఇంకా ఆడపిల్లలు ఎంతమంది వున్నారు?"

"నాతో ఎనమండుగురం. ఇవ్వాళ్టినుంచి నీతో తొమ్మండుగురం. పుస్తకాలన్నీ కొనేశావా? ఇంకా కొనాలా?"

"అన్నీ నూజివీట్లోనే కొనుక్కున్నా. ఇక్కడ పాఠాలెంతవరకూ అయ్యాయి?"

"ఇంకా మేం కొన్ని పుస్తకాలే కొనలేదు. పాఠాలేమీ అంతగా చెప్పటంలేదు. ఇంకా స్కూలు తెరిచి యిరవై రోజులైనా అవ్వందే. మీ యిల్లు ఎక్కడ?"

"ఆఫీసు వెనక"

"నిజమే. మర్చిపోయా. పోస్టుమాస్టారిల్లు ఇంకెక్కడుంటుంది? మీ నాన్నగారిపేరు? నాకు పేర్లు తెలుసుకోవటమంటే అదో సర్దా. ఏమీ అనుకోకు. ఇంకా మీ ఇంట్లో వాళ్ళ పేర్లేమిటి?"

"నాన్నగారి పేరు భుజంగరావు. బాబాయి పేరు నాగేంద్రరావు. మా అమ్మ పేరు శేషమ్మ. మాకొక తాతమ్మ, అంటే నాన్నగారి నాయనమ్మ, అన్న మాట. ఆవిడ పేరు సీతమ్మ. అంతే ఇంకెవ్వరూ లేరు."

"ఇంకా వున్నారా మీ తాతమ్మగారు? మరి మీ తాతగారులేరా?"

"లేరు. ఆయన్నసలు మేమెరగం. కాని. ఆయన పేరు సుబ్బయ్యగారు."

ఇలాగ మేము మాటల్లో వుండగా తెలియకుండానే క్లాసంతా నిండిపోయింది. ఫస్టు బెల్ కూడా విండి. అందరి దృష్టులూ, తన మీదే వుంటంచేత కొత్తమ్మాయి కొత్త సిగ్గు పడింది గాని, నా అండన కొంచెం ధైర్యంగానే వుంది. క్రమంగా నేను సుబ్బలక్ష్మికి మాస్టర్లను గురించి, స్కూలును గురించి అంతా వివరంగా చెప్పాను. ఆ ఒక్క పూటలోనే మాకు పరిచయం కొంచెం ఎక్కువైంది. మిగిలిన అమ్మాయిలు సుబ్బలక్ష్మిని పలకరించారుగాని వాళ్ళకి, తనకి అంతగా కలవలేదు. సాయంత్రం వెళ్ళేటప్పుడు "ఇవ్వాళ మా యింటికి రా సంపత్. రేపు మీ ఇంటికొస్తాను," అంది స్నేహంగా. సరేనని నేను సర్దాగా బయల్దేరాను.

* * *

వాళ్లింటి కెళ్ళాను గాని నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నన్ను హాల్లో కూర్చోబెట్టి సుబ్బలక్ష్మి లోపలికెళ్లింది. నేను హాలంతా కలియజూస్తున్నా ఎక్కడచూచినా రెండు సర్పాలు ఆడుతున్న ఫొటోలే. పీఠిగుమ్మం కర్టెన్‌మీద రెండు సర్పాలు. ఒకే ఆకారంలో పడగలు విప్పుకొని, కృష్ణపాదాలు కనపడేలా, ఆడుతున్నట్టు కుట్టివుంది. హాల్లో ఒకమూల మనిషెత్తుండే బల్లమీద పాలరాతితో చెక్కబడ్డ రెండు సర్పాకారాల విగ్రహం వుంది. హాల్లోనుంచి లోపలికెళ్లే గుమ్మంపైన గోడమీద అందంగా రంగులో ఒకేరకమైన సర్పాలు పెయింట్ చేయబడి వున్నాయి. ఇదేవిధంగా దృష్టిపడ్డచోటల్లా జంటసర్పాలు! నాకు ఏ నాగలోకంలోనో వున్నట్టనిపించింది. దీక్షగా కర్టెన్‌వైపే చూస్తున్నా. ఇంతలో సుబ్బలక్ష్మి వచ్చింది కాఫీగ్లాసుతో.

"ఆ కర్టెన్ మీద నేనే కుట్టాను. బావుందా?" అంది గ్లాసు టేబుల్‌మీద పెడుతూ.

"మీరు నాగేంద్రుణ్ణి కొలుస్తారా! ఇంటి నిండా జంటసర్పాలే వున్నాయేమిటి? నాకు చాలా ఆశ్చర్యంగావుంది. క్లాసులో మీ అందరి పేర్లూ విన్నప్పుడు నాకు కొంచెం సందేహం కలిగిందికాని, అంతగా పట్టించుకోలేదు. మీ పేర్లు కూడా నాగసంబంధమైనట్టున్నాయి. మీరు సర్పాలంటే యిష్టమా?" అంటూ ఎంతో ఆశ్చర్యంగా గుచ్చిగుచ్చి అడిగాను.

"మేము తప్పనిసరిగా నాగేంద్రుణ్ణి పూజించాలట. పేర్లు కూడా అవే పెట్టుకోవాలట. లేకపోతే ఏదో అనర్థం జరుగుతుందని మా పెద్దవాళ్లు చెప్తారు. సరేగాని ముందునువ్వు కాఫీతాగు. మా యిల్లు చూపిస్తా." అంది తాపీగా. కాని నా ఆశ్చర్యం ఇంకా ఎక్కువైంది.

"నీ మాటలు నాకు నమ్మకం కలగటం లేదు. ఏం? ఎందుకు పూజించాలి? పూజించకపోతే ఏమి అనర్థం వస్తుంది? మీ పెద్దవాళ్ళు నీకు చెప్పలేదా?"

"ఎందుకు చెప్పలేదు? కావలిస్తే నీక్కూడా చెప్తుంది మా తాతమ్మ. అప్పుడే నమ్ముదువుగాని. ముందు కాఫీతాగు," అంది గ్లాసు అందిస్తూ.

నేను త్వరగా తాగేశాను. తర్వాత నన్ను సుబ్బలక్ష్మి లోపలికి తీసుకెళ్ళింది. లోపల గదుల్లో కూడా జంట సర్పాలాడుతున్నై. ముందు వాళ్ళమ్మని చూపించింది. "ఈ అమ్మాయే నమ్మా నా స్నేహితురాలు. ఈవిడికి మన నాగేంద్రుడి కథ కావాలట" అంది నవ్వుతూ, సుబ్బలక్ష్మి వాళ్ళమ్మతో. ఆవిడకూడా నవ్వి "మనింటి కొచ్చేవాళ్లంతా యిలాగే అడుగుతుంటారు. తాతమ్మ దగ్గరికి తీసుకెళ్ళు. ఆవిడ ఓపిగ్గా చెప్తుంది -



"ఏమ్మా! నీపేరు సంపతని చెప్పిందిలే సుబ్బులు. అప్పుడప్పుడూ వస్తూండు," అంది. ఆ తర్వాత సుబ్బులు నన్ను యింకోగదిలోకి తీసుకెళ్లింది. ఆ గదిలో కిటికీదగర మడతకుర్చీలో పండుతమలపాకులాంటి ముసలమ్మకూర్చుని కిటికీలోంచి కాంపౌండ్‌లోకి చూస్తోంది. సుబ్బలక్ష్మి ఆవిడ దగరగావెళ్లి వూపుతూ "తాతమ్మ, ఈ అమ్మాయి మా స్నేహితురాలే. మనిల్లు చూట్టాన్ని కొచ్చింది" అంది తాతమ్మ నాకేసి చూస్తూ "రామ్మ, కూర్చో, నీ పేరేంటమ్మాయ్?..." అంది ప్రక్కనున్న నాలుకాళ్ళ పీటను నాకు చూపిస్తూ. "నా పేరు సంపదలక్ష్మండీ," అంటూ కూర్చున్నాను. "అలాగా. మంచి పేరే. మరేమో మా సుబ్బులు నూజివీడు నుంచి స్నేహితుల్ని విడిచి వచ్చేస్తోంటే ఏడిచింది. ఆ అమ్మాయిలకీ దీనికీ ఎంతో స్నేహం. పోనీలే. దీనికి నువ్వు దొరికావు. మీరు స్నేహంగావుంటే అంతబెంగం వుండదు" అంది తాతమ్మ నన్ను చూస్తూ.

"అలాగే వుంటాంగాని, ఈ అమ్మాయికటా, మన నాగేంద్రుడి కథ కావాలట. నువ్వు బాగా చెప్తావని తీసుకొచ్చా. మరి తొందరగాచెప్పు" అంది సుబ్బులు. "అలాగే చెప్తా. ఏం? నోరేమైనా అద్దెకు తేవాలా? అబ్బో. ఎంతమందికి చెప్పానో! ఇప్పుడా! అప్పుడా నాపడుచప్పుడు జరిగింది. ఇప్పటికి సుమారు అరవై ఏళ్ళయ్యుంటుంది. మర్చిపోదామన్నా మరుపు..."

"అసలేం జరిగిందండీ?" అన్నా ఆతృత పట్టలేక. తాతమ్మ ఒకతడిదగ్గు దగ్గి చెప్పటాని కుపక్రమించింది. సుబ్బలక్ష్మి తాతమ్మ పక్కమీద పడుకుంది వింటానికి.

* * *

నేను, మాచెల్లి, అంటే మాతోటికోడలు ఎంతో సఖ్యంగా వుంటూ కోడరికం చేశాం మా అత్తింట్లో. ఈ కాలంలో తోటికోడళ్ళు అంత సఖ్యంగా వుంటారా? అబ్బో. మాకూ వీళ్ళకీ పోలికేలేదు. ఏపనిచేసినా కలిసిచేసుకొనేవాళ్ళు. మా అత్తగారైనా మంచిమనిషే గాని, కాస్త యిరకతిరకలుండకపోతాయా? వినా సర్దుకుపోవాలి, ఏం? ఇంతకీ ఏమైందంటే, ఒకనాడు గోంగూర పప్పు వండటానికి గోంగూర కోసుకువద్దామని మేమిద్దరం పెరట్లోకెళ్ళాం. అబ్బో! అప్పుడు మా పెరడు ఎంత వుండేదో! ఎన్నిరకాల పాదులు, మొక్కలు, తీగలు, చెట్లువుండేవో! ఒకటేమిటి? ఒకవేపున ఆకుకూరలు, ఒకవేపున కాయకూరలు, ఒకవేపున పూలమొక్కలు, ఇంకోవేపున పళ్ళచెట్లు, అబ్బో! ఎక్కడని చెప్పగలం? రోజూ కాస్సేపు పెరడుపనే సరిపోయేది."

నాకు అసలు సంగతేమిటో వినాలని ఆతృతగా వుంటంచేత, ఈ ఉపోద్ఘాతమంతా విసుగనిపించింది. నా విసుగు కనిపెట్టిన సుబ్బలక్ష్మి "అసలు సంగతి చెప్పు తాతమ్మా తొందరగా," అని తొందరచేసింది.

"అయ్యో. చెప్తున్నానా? అంత తొందర పనికిరాదమ్మాయ్. వినమ్మ నింపాదిగా" అంటూ తాతమ్మ మడతకుర్చీలో సర్దుకూచుని, ముందుకొంగి నన్ను తట్టుతూ చెప్పసాగింది; "ఇంతకీ ఏమైందంటే, మేము

 # రగిలిన పగ 

బుట్టలోకి గోంగూరకోసి, ఆ మొక్కలదగ్గిరే పెట్టే, కొకంపాదు పిందెలేసిందేమో చూద్దామని, ఇంకా పైకెళ్లాం. కాస్సేపన్నీ చూచి తిన్నగా గోంగూర బుట్ట చంకనెట్టుకొని యింట్లోకొచ్చాం. మా తోటికోడలేమో ఇంకోపనిలో జొరబడింది. నేనేమో గోంగూర బాగుచెయ్యటానికి నులకమంచ తెచ్చి, వసారాలో వాల్చి గోంగూరబుట్ట కుమ్మరించా. ఏ ఆకుకూరలైనా, నులకమంచం మీద వేసి దులిపి బాగుచేశేవాళ్లంలే. ఆరగాకర కాయలైనా నులకమంచానికి పెట్టే వాము తారు, నీకూ తెలిసేవుంటుంది—ఆ తర్వాతేం జరిగిందంటే, గోంగూర మంచంనిండా విడదీసి ఒక్కొక్క ఆకు బాగుచేస్తున్నాను. అలా చూద్దునుగదా, రెండు నులకతాళ్ళలాంటి పాముపిల్లలు మంచం పట్టెలట్టుకుని పాకుతున్నాయి! నా ఒళ్ళు గరిపొడిచింది. తగని భయంవేసింది. "బాబోయ్" అని కేక పెట్టానుకుంటా. అపక్కనే గట్టుమీద కూర్చుని మామరిదిగారు కవ్వంతాడు పేనుతున్నాడు. ఆయన గభాల్న వచ్చి మంచందగ్గరగా వంగి వాటిని చూటం మొదలెట్టారు. నాకేక విని మా అత్తగారు, తోటికోడలు పరిగెట్టుకొచ్చారు.

"ఎలావచ్చాయి వదినా ఇవి గోంగూరలోకి?" అని మా మరిది అడుగుతూంటే "ఇంకా చూస్తావేరా? వాట్ని చంపెయ్యక—చిన్నపామునైనా పెద్ద కర్రతో కొట్టమనిశాస్త్రం—అయ్యో, అలా దగ్గరగా వంగకు" అనిమా అత్తగారు కంగారు పడింది.

"గోంగూరబుట్ట కింద పెట్టినప్పుడు దూరాయి కాబోలు" అంది మాతోటికోడలు ఆశ్చర్యంగా. పాముపిల్లలింకా అటు ఇటు పాకుతున్నాయి. మా మరిదిగారికేంతోచిందో మరి ఇంట్లోకి పరిగెత్తుకెళ్ళి ఓ తాటాకులబుట్ట పట్టుకొచ్చారు. ఏం చేస్తారోనని వెయ్యికళ్లతో చూస్తున్నాం.

"వాట్ని చంపెయ్యక, బుట్టెందుకురా?" మా అత్తగారు అడిగింది.

"చంపనే. పెంచుతాను" అంటూ మరిదిగారు ఆబుట్టలోకి వాటిని ఎక్కించారు.

"అయ్యో, పాముల్ని పెంచుకోవటమేంటిరా! విషప్పురుగు! కుక్కనీ పిల్లినీ పెంచుకోటం చూశాంగాని, ఇదేం విడ్డూరం అబ్బాయ్! నీకేం బాద సమా? వాట్ని చంపెయ్యి" అంటూ అత్తగారు గోల పెట్టటం మొదలెటింది.

"అబ్బ అంత భయమెందుకేం? ఇవేం చేసేదుస్తాయ్? భర్వాలేదుగాని నేను పెంచుతాను జాగ్రత్తగా. మీకు భయమేస్తే దగ్గరికి రాకండి" అని ఆయన బుట్టలోని పాముల్ని అటూ ఇటూ తిప్పుతూ తిలకిస్తున్నాడు.

మే మెంతమందిమి ఎన్నివిధాల చెప్పినా వినలేదు. పోనీ చంపబుద్ధిగాకపోతే ఎక్కడైనా దూరంగా వదిలేసి రమ్మన్నాం. వినలేదు. ఈవిడ్డూరం విని వూళ్ళోవాళ్లంతా మాయింటికి ఎగబడేవారు. వాళ్లందరికి చూపిస్తూ తిరిగి మూత బెట్టేస్తూ వుండేవారు మరిదిగారు. చూచేవాళ్లు కొందరు పెంచమని కొందరు వదిలెయ్యమనీ చెప్పేవారు. కాని, ఈయన ఎవరిమాటా వినిపించుకొనేవారు గారు ఇక- ఆయన ఎంతమంది చెప్పినా వినిపించుకోరని చెప్పటం మానేశాం."

అంతవరకూ చెప్పి తాతమ్మ కాస్సేపు ఆగింది. సమయంచూసి "అసలువాటిని ఎలా పెంచేవారండి? కరిచేవిగావా?" అని అడిగా.

"చెప్తాను గాదుటమ్మాయ్. విను మరి. ఆయన ఓపిక్కి, ధైర్యానికీ ఆశ్చర్యపడాలి. సామానుగదిలో ఒక పక్క ఖాళీచేయించేసి, అక్కడ వుంచేవారు. వీటికోసం పెద్ద వెడల్పాటి బుట్ట ప్రత్యేకంగా అల్లించారు. చిన్న చిన్న చిల్లులుండేవి. కొన్నాళ్ళవరకూ అందులోనే వుంచేవారు. రోజూ రెండుపూటలా పాలుపోసేవారు. మేము మాత్రం భయమేసి ఆ ఛాయలకైనా వెళ్ళేవాళ్ళంగాదు—మళ్లా వాటికోసం పెరట్లో కొంతమేర ఒక గాబులా తయారుచేశారు. శుభ్రంగా గాలీ వెలుతురూ లోపలికొచ్చేవి. సన్నటి తీగల్తో తయారుచేసిందిగదూ, వీటి సందులో పడేసి తలుపు బిగించేస్తే, యిక అవి బయటికిగానీ, పైకిగానీ పోవటానికి వీలుండేదిగాదు. పైనకూడా తీగలమూత వుందికదూ, తేగలూ అవీ వచ్చేవిగావు. అవి అందులోనే కావలసినంత మేర తిరిగేవి. రోజూ సాయంత్రంపూట బుట్టలోంచి తీసి గాబులో కొదిలేవారు. ఈవిధంగా ఎంతో ఓపిగ్గా, శ్రమపడితే కొన్ని నెల్లకి కొంచెం ఎదిగాయి. చెప్పటం మరిచా. వాటిలో ఒకదాన్ని "సుబ్బయ్యా" అనీ, ఇంకోదాని "నాగయ్యా" అనీ పేర్లుపెటి పిలిచేవారు. చిత్రం అమ్మాయ్. దేనిపేరుపెట్టి పిలిస్తే అది తలెత్తిచూశేది! మరిదిగారు వాటిని మీద మీద కెక్కించుకొంటుంటే మా ఒళ్ళు గరిపొడిచేది.

ఏం భయంలేదు వదినా, ఇలా పట్టుకో అని దగ్గరకి తీసుకొస్తుంటే అంతదూరం పరిగెత్తిపోయేవాళ్ళం. మొదట్లో అంత భయపడేవాళ్లమా, రాను రాను మాకూ అలవాటై, భయంపోయిందమ్మాయ్. కొంచెం కొంచెం దగ్గరగా కూర్చుని తోకలమీద చేతులేసి నిమిరేవాళ్ళం. అవి ఏమీ చేసేవిగావు. చేతులమీద ఎగబాకేవి. ఒళ్లు జలదరించేది. ఈవిధంగా అవి రాను రాను బుట్టలో మానేసి ఇంట్లోనే తిరిగేవి, గాబులో వదలటంకూడా మానేశాం. అవి తిన్నగా పెరడంతా తిరిగేవి. "సుబ్బయ్యా, నాగయ్యా, ఎక్కడా? ఇలారండి" అని పిలిస్తే ఎక్కడున్నా సరే జరజరా పాక్కుంటూ వచ్చేసి పడగలెత్తి "ఎందుకు పిలిచావు?" అని అడుగుతున్నట్టుగా నిలబడేవి! "చీకటిపడిపోవటంలా? రండిక." అని కొప్పడి లోపలికొచ్చేస్తుంటే, తప్పుజేసి భయపడుతున్నట్టుగా, నెమ్మదిగా పాకుతూ వెనకబడేవి. పాలుపోస్తే తాగేసి పడుకోటానికి ఇంటి చూరులెక్కేవి. మా ఇంటి దూలాలు పెద్దవిగావుండేవికదూ, వాటిమీద పడుకొనేవి. అవి బాగా ఇంటిల్లిపాదికీ అలవాటుబడిపోయాయి. మా పాలేళ్ళకికూడా బాగా మచ్చికైపోయాయ్, మనుషుల్లో మనుషుల్లా మెలిగేవమ్మాయ్ వాటి విషపుగుణం ఏమైపోయిందోగాని," అంది తాతమ్మ వన్ను తట్టుతూ.

"మరి పెంపుడుకుక్కవుంటేనే ఎవరైనా యింటికిరావటానికి భయపడ్తారుగదా, అప్పుడు మీ ఇంటికెవరైనా వచ్చేవారండి?" అన్నా.

"నువ్వన్నట్టు మా ఇంటికి రావటానికందరూ భయపడేవాళ్ళు. వీధిలో నిలబడి పిలిస్తే, మేము వెళ్ళి వాళ్లని లోపటికి తీసుకొచ్చేవాళ్లం. ఒకనాడేం జరిగిందంటే, నాగయ్యా, సుబ్బయ్యా, పెరట్లో తిరుగుతున్నాయి. మేము వంటింట్లో పనిచేసుకొంటున్నాం. ఒక పాములవాడు నాగస్వరం ఊదుతూ పాముని ఆడించటానికి తీసుకొచ్చాడు. అనాగస్వరం వినపడగానే సుబ్బయ్యా, నాగయ్యా పెరట్లోనుంచి జరజరా పాక్కుంటూ సరాసరి వీధిలో కెళ్ళిపోయాయి. వీటినిచూచి పాములవాడి దగ్గర పాము బుట్టలోంచి బైటపడి వీటితో కలిసిపోయింది. పాములాడికి కంగారెత్తి నా-

స్వరం మారేసి నోరెళ్ళబెట్టి చూస్తున్నాడు ఆ పాముల్ని మేం పెంచుతున్నామని వాడికేం తెలుసు? వాడిచుట్టూ చేరిన పిల్లలు గోలగోలగా అరవటం మొదలెట్టారు. మేమంతా చావిట్లోకొచ్చి చూస్తే యిలావుంది భాగోతం. సమయానికి మా మరిదిగారు ఇంట్లోనే వున్నారు. ఆయనకూడా బయటకొచ్చి, చూచి కోపపడ్డారు. వాటికేసి తీక్షణంగా చూస్తూ "ఏం నాగయ్యా మతిపోయిందా? ఇలా ఎగబడ్డారేం? భయభక్తులు లేకుండా పోతున్నా యనుకుంటూ. సుబ్బయ్యా! తిన్నగా గాబులోకి పొండి. వెళ్ళండీ" అంటూ గద్దించేసరికి, అవి గజగజా వణికిపోయి, నెమ్మదిగా చావిడికి ప్రక్కవరండాలో నుంచి పెరటిలోని గాబులో జొరబడ్డాయి. పాములాడి పాముకూడా వాటివెంట గాబులో దూరింది. ఆ తర్వాత వాడు గాబుదగ్గరకొచ్చి తన పామునితీసి బుటలో పెట్టుకున్నాడు. అప్పట్నుంచీ వాటికి నాగస్వరమంటే ఇవమని తరుచు పాములాళ్ళ చేత వాటిదగ్గర కాస్సేపు పాడించేవారు. ఈ విధంగా పగలు నానా అల్లరీచేసి, రాత్రుళ్లు ఏ కాస్సేపు పడుకొనేవో. ఏమో, మళ్ళా మాకన్నా ముందే లేచిపోయేవి. తొలికోడి కూతకే మా మరిదిగారు లేచి మొహం కడుక్కొని పాలు తియ్యటానికి దూడల దొడ్లోకెళ్తే, వెనకే ఇంటిదగ్గర పడుకునే పాలేరు బిందెలకావిడి తీసుకొని వెళ్ళేవాడు. అబ్బో! అప్పుడు మా దొడ్డినిండా పాడిపశువులే. రోజూ రెండు పూటలా రెండేసి బిందెల పాలిచ్చేవి! అన్నీ మేం తాగేవాళ్ళమా? లేదు. ఇంటిలో వాడకానికి ఓబాన, బాటసారులకి దాహం ఇవ్వటానికి, మాలమండోళ్ళడిగితే పొయ్యటానికి యింకోబాన ఎప్పుడూ పాడితో పూరుతూ వుండేవి. ఈ రోజుల్లోలాగ, ఆ నాడు పాడి అమ్ముకుంటే పేలం సంపాదిద్దుమయ్యోయ్. ఎర్రగా మర్రిపూడల్లా కాచేసరికి అరిచేతి మందాన మీగడ కట్టుకొచ్చేది. మజ్జిగ చేసేసరికి పెకరాళ్ళంత వెన్న ముద్దలయ్యేవి. అప్పుడు మా ఇంట్లో, ఇద్దరు శూద్రపాలేళ్లుండేవాళ్లే. వాళ్ళే మలికోడికూతకే వచ్చి, చిలకబాన మజ్జిగ చేసేవాళ్ళు. అంతంత బానలు చెయ్యటం ఆడవాళ్ళం మావల్లనౌతుందా? అం... ఇంతకీ ఏం చెప్తున్నాను? పాలకబురుకదూ? మలికోడి కూసేసరికి పాలుతియ్యటం అయిపోయేది. ఇంటికి రాగానే సుబ్బయ్యనీ, నాగయ్యనీ పిలిచి పాలు పోసేవారు. సరిగ్గా ఆవేళకి, పేర్లు పిలిచిందే తడవుగా చూరుల్నించి దిగివచ్చి పాలుతాగి పెరట్లోకి పోయేవి. ఈ విధంగా మేమంతా ఆనందంగానే కాలం గడిపేవాళ్ళంగాని, పెళ్ళిళ్ళయి నాలుగేళ్ళవుతున్నా, మాకు పిల్లలు పుట్టటం లేదని, మా అత్తగారికిమాత్రం మహా దిగులుగానే వుండేది. "పాముల్ని బంధించి పెంచిన పాపానికి, పిల్లలు పుట్టటం లేద నేవాళ్ళు కొంతమంది. కాని మేము తల్లీ పిల్లా న్యాయంగావుండేవాళ్ళంగాని, వాటికేం చెరుపు చెయ్యలేదుగా!

ఇలా కాలం గడుస్తున్నకొద్దీ అవి ముసలివై పోసాగాయి. ఒకొక్కటే, రెండేసిబారల పొడుగునా, ఇంతేసిలావునా, వల్లగా, ముడతలుబడిపోయి వుండేవి. ఉత్సాహమంతా చచ్చిపోయినట్టు మందకొడిగా వుండేవి. రాత్రుళ్ళు పాలుతాగక, చూరులెక్కటానికి జవసత్వాలుడిగిపోయాయిగదూ, మహా ప్రయాసపడేవి. అది కనిపెట్టి మా మరిదిగారు చిన్నపాటి బల్ల చెయ్యమని "వడ్లాబత్తుడికి పురమాయించారు. కాని ఇంతలోకే అంత ఘోరం జరిగిపోయింది" అని చెప్పి ఆగింది తాతమ్మ.

ఆవిడ మొహంలో కన్పించిన విచారాన్నిబట్టి, అదేదో భరింపరాని ఘోరమే వియ్యుంటుందని అనుకొన్నాను.

"చచ్చిపోయాయాండీ?" అనడిగా. అయ్యో! వాటికవి చచ్చిపోతే యింకేమయ్యేయ్! చేతులారా చంపుకొన్నాం. వాటి ఉసురు మాకు తగిలింది — అదే ఏమైందో చెప్తావిను — రోజూలాగే ఆరోజునకూడా మలికోడికూసేసరికి మరిదిగారు పాలు తీసుకొచ్చేరు. యథాలాపంగా నాగయ్యా, సుబ్బయ్యా అంటూ రెండుమూడుసార్లు పిలిచారు. చూరుల్నించీ పాకి రాలేదు! మళ్లా పిలిచినా ఎక్కడా కదులుతున్నట్టయినా అలికిడవలేదు మాకాశ్చర్యం వేసింది. పెరట్లో కెళ్ళాయేమోనని పెరడంతా పోలిబొబ్బలు పెడుతూ తిరిగారు. ఎక్కడా లేవు. "ఏమిటిది? విచిత్రంగా వుంది. ఎక్కడికెళ్ళాయి?" అనుకుంటూ ఆయన అటకంతా గాలించారు. మేము ఇల్లంతా అడుగడుగునా వెతికాం. ఎక్కడా అయిపు లేవు. మా కందరికీ తగని ఆశ్చర్యం వేసింది. పైగా వాటికేం అపద సంభవించిందోనని కంగారు పడిపోయాం. కొన్నేళ్లనుంచీ వుంటున్నవి, యీనాటేమైపోయాయి? అని దిగులుగా "ఎక్కడికైనా వెళ్లాయేమో, కాస్సేపటికో, ఇంకాస్సేపటికో వస్తాయేమో" అని ఆశతో ఎదురు చూస్తూ ఎవరిపనులు వాళ్ళు చేసుకొంటున్నాం. మరిదిగారింకా పేర్లెట్టి పిలుస్తూ వెదుకుతున్నారు. చుట్టుపట్ల ఎప్పుడూ వాటి ప్రసక్తిలేని, మా ఆయనక్కూడా దిగులేసింది, వాటి సంగతి తెలియకపోయే సరికి.-ఇది ఇలా వుండగా మజ్జిగ చెయ్యటానికి గదిలోకెళ్లిన పాలేళ్లిద్దరూ గావుకేక పెట్టారు. ఎక్కడివాళ్ళం అక్కడ, అగదిలోకి పరుగెత్తాం. అంతాకలిసి అప్పుడు మాకళ్ళతో ఏం చూశామో, ఈక్షణానికీ కళ్ళకి కట్టినట్టుంది! ఆ పాలేళ్లిద్దరూ వణికిపోతున్నారు. పెరుగుబానలూ రెండూ గట్టు పక్కన దించి వున్నాయి. ఆ గట్టుమీద రెండుచోట్ల రెండు చితికిపోయిన మాంసపు ముద్దలా 'నాగయ్యా', 'సుబ్బయ్యా' పడి వున్నాయి. మా కా దృశ్యం చూచేసరికి ఒళ్లు



# రగిలిన పగ



జలదరించింది. అదిరిపోయాం. 'అసలేం జరిగిందని' అడిగితే మాకేం తెలీదయ్యా, మజ్జిగ చేద్దామని పెరుగుబానలు దించబోతే ఎంతకీ వూడిరాలేదు. గట్టిగాలాగి కిందబెట్టాం. అంతే, మాకూ యిలాగే కనపడింది. భయమేసి కేకలెట్టాం" అన్నారు పాలేళ్ళు. అంటే రాత్రినుంచీ అవి, బానలకిందవుండి పోయాయన్నమాట. రాత్రి రోజులా పాలు తాగేసి, చూరులెక్క లేక, పాలబానలు పెట్టే గుంటల్లో గటుమీద చుట్టుచుట్టుకు పడుకున్నాయి కాబోలు పొరపాటువశిగ్గా చూడక, మ్రిపూడల్లా ఎర్రగా, సలాసలా కాగే పాలబానల్ని పాలేళ్లు, పాముచుట్టల మీద పెట్టేశారు. అబ్బా! ఎంత బాధపడ్డాయో! కదల్లేవు, మెదల్లేవు, పైన అగ్నిగోళాల్లాంటి పాలబానలు. మాసం కాలి కుతకుతా వుడికిపోతోంది. భరింపరాని బాధ. అవి బాధపడ్డ ప్రతీఘడియా, ఏళ్ళూపూళ్ళైనమ్మల్ని పీడించింది. "ఇదంతా నా నిర్లక్ష్యమే. చేతులారా చంపుకొన్నాను నా నాగయ్యనీ, నీ; నా సుబ్బయ్యఅందరిదగ్గర చనువుగా మెసులుతున్నాయిగదా అని వాటిగురించి పట్టించుకోటం మానేశాను. వాటిని నా పొట్టన పెట్టుకున్నాను. ఆ నాడే పెంచకుండా వదిలేస్తే, అంతయమయాతన పొందేవి కావుగదా!" అంటూ మరిదిగారు భోరున ఏడ్చారు. కొంతసేపయాక దుఃఖం మింగుకొని "రాత్రి బానలెవరు పెట్టారు! కళ్లు మూతలుబడి పోయాయా!" అంటూ ఉగ్రనరసింహుడిలా గర్జించటం మొదలెట్టారు. రాత్రి బానలుపెట్టినవాళ్ళకి విషయం తెలిసి పరుగుపరుగున వచ్చి తాముచేసిన ఘోరం చూచుకొని పసిపిల్లల్లా ఏడ్చారు. "ఆముదం దీపం గుడ్డివెలుర్లో సరిగ్గా కనిపించలేదట, అసలే నల్లగా వున్న పాములు అందులోనుట్టి గట్టు. లేకపోతే మా చేతుల్తో యింత ఘోరం చెయ్యగలమా బాబూ!" అంటూ వాపోయారు. వాళ్ళనేమనగలం? అంతా ఖర్మ. లేకపోతే రోజూ చూరులెక్కి పడుకొనేవాడు ఎక్క లేకపోవాలా? గట్టుపక్కనున్న పెరుగుబానలు చూద్దుముగదా, పచ్చగా పసర్లు కక్కుతోంది పెరుగు. జీవితకాలంలో ఎప్పుడూ బయటబడని విషం, అగ్నిగోళాల క్రింద యమబాధపడుతున్నప్పుడు బయటపడిందేమోననిపించింది. ఆ మూగబాధలో ఎన్ని శాపనార్థాలుపెట్టాయో మమ్మల్ని! బ్రతికినంతకాలం ఎంత దయగాచూసేయం! ఆఖరికి పేరు నిలబెట్టుకోలేకపోయాం-ఈ సంగతి వూరంతాపాకి జనం తేలయీనిపట్టుగా వచ్చి మా యిల్లు చుట్టుముట్టారు. ఇక ఎంతసేపు విచారిస్తేమాత్రం ఏముంది? జరగవలసిందో, జరగకూడనిదో జరిగిపోయింది. గుండెనిబ్బరంచేసుకొని ఆ చితికిపోయిన పాముకళేబరాలకి దహనంచేసే ఏర్పాట్లు చేయించారు మా ఆయన. పూలబండిమీద వూరేగించి, గంధంచెక్కల చితిమీదపెట్టి మా మరిదిగారిచేత చితి అంటింపజేశారు. దహనం అయ్యాక అంతా యింటికొచ్చి పెరుగుబానల్ని ఆ గదిలోనే లోతుగా పాతిపెట్టించారు. అవి చచ్చిపోయినచోట రెండుకంచు విగ్రహాలు ప్రతిష్ఠించాలని పురమాయించారు. మేమంతా మైలపట్టాం. ఇంట్లో నాగయ్య, సుబ్బయ్య అనే ఇద్దరు మనుషులు పోయినట్టుగానే చిన్నదినం, పెద్దదినం, సంవత్సరీకం చేయించాలన్నారు. అలాగే చేయించారు. మేము కొన్నాళ్ళవరకూ మనుష్యుల్లో పడలేదు. చెప్పటం మరిచా. ఆ రోజున పాలబానలు పెట్టినవాళ్ళల్లో ఒకడు మనేదిపెట్టుకొని, చెయ్యరానిపని చేశానని భయపడి మంచంపట్టి చచ్చిపోయాడు. ఇంకొకడు పొలంగట్లెమ్మట తిరుగుతుండగా నాగుపాము కరిచి యమబాధపడి నిమిషాల మీద ఎగిరిపోయాడు. ఆతర్వాత మా బాధలు బయటబడ్డాయి" అంటూ చెప్తున్న కాంతమ్మను ఆపి "కాంతమ్మగారూ. ఒక్క సంగతి. పాలబానలు గట్టుమీద పెట్టేకా 'తోడంటు' వేశేవారా!" అని నా సందేహం అడిగాను. ఆవిడ తల పంకించి "అవునమ్మాయ్. సూర్యాస్తమయం అవుతోంటే పశువులు పొలాల్నుంచీ దొడ్డికొచ్చేశేవి. వెంటనే పాలు తీసి, యింటికి తెచ్చి దాళ్ళువేసి కాగబెట్టేవారు. అంతలోకే మరిదిగారు సుబ్బయ్యకి, నాగయ్యకి పాలుపోసేవారు. అవి ముసలి వవటంచేత పాలు తాగిన వెమ్మటే పడుకోవటానికి వెళ్ళిపోయేవి. పాలు బాగా మరిగాక పాలేళ్ళు, పాలబానల్ని గదిలో పెట్టేసి, మిగతా పని చేసుకొనేవారు. అప్పటికి కనుచీకటి పడే

దంతే. అటుతర్వాత, మగాళ్ళ స్నానాలు, భోజనాలూ, అయ్యాక మేము స్నానాలు చేసి, కబుర్లాడుకుంటూ భోంచేసి, వంటిల్లు సర్దుకొని, చావిట్లో కొచ్చేవాళ్ళం. సరిగ్గా పడుకోబోయేసరికి, ఈ రోజుల్లో లెక్క ప్రకారం తొమ్మిది దాటేదనుకొంటా. అప్పటికి పాలు చల్లారుతాయని మా అత్తగారు 'తోడంటు' వేసి వచ్చి పడుకొనే వారు. ఆనాడుకూడా ఆవిడ తోడంటు పెట్టి వచ్చారు గాని, బానలకిందవున్న వాటి నెలా చూడగలరు? ఏమంటావ్? అటుతర్వాతేం జరిగిందో చెప్తా విను—మేము నెమ్మదిగా విచారం మర్చిపోతున్నాం. నాకూ, మా తోటికోడలికీ కూడా నెలతప్పింది. ఇంట్లో మళ్ళా అందరి మొహాలమీదా ఆనందం కళ పడసాగింది. పెళ్ళైన ఎన్నాళ్ళకో సంతాన ప్రాప్తి! ఎవరికడుపులో వాళ్ళం ఎన్నెన్నో కలలు గనేవాళ్ళం కాని, మా కలలన్నీ కల్లలైపోయాయి. మా కిద్దరికీ పుట్టిన పిల్లలు గుడ్డివాళ్ళు. వాళ్ళైనా బ్రతక్కుండా పురుట్లో పోయారు. అటుతర్వాత మళ్ళా గర్భిణీ—కానీ మళ్ళీ నిరాశే. కలిగేసంతానమంతా అంగవైకల్యంగానే వుండేది. ఇలా కొన్నేళ్లు ఇంటిల్లిపాదిమీ కుమిలిపోయాం. కానీ, ఏం చెయ్యాలో తెలిసేదిగాదు. ఎవరో పెద్దలు చెప్పిన మీదట 'నిత్యానాగయ్యనీ, సుబ్బయ్యనీ పూజచేసుకొంటామనీ, తమ పేర్లే, కలిగే సంతానానికి పెట్టుకొంటామనీ, మా తప్పులు మన్నించి కనికరించమనీ' నాగయ్య, సుబ్బయ్య కంచువిగ్రహాల ముందు మోకరిల్లి వేడుకొన్నాం. వారు మమ్మల్ని క్షమించారని మా భావం. అప్పుడు మా గర్భాలు నిలిచాయి. మా అబ్బాయి పేరు సుబ్బయ్య. సుబ్బులు తాత. ఇక మీదట మా వంశంలో వారందరి పేర్లూ అవే. సుబ్బులు తల్లిపేరు పెళ్ళికాకముందు ఏదో వుండేది గాని, మార్పించాం. ఆనాడు జరిగినకథ నిలా చెప్పటానికి నేనూ, మా తోటికోడలూ బ్రతికి వున్నాం. అంతే. మేమెప్పుడూ పాములు కనబడితే చంపము. ఇదీ మా నాగేంద్రుడి కథ" అని తాతమ్మ వెనక్కి జార్లాబడింది.

తాతమ్మ చెప్తున్నంతసేపూ నాకు వివిధానుభూతులు కలిగాయి. నిజంగా జరిగిందా? అని సందేహం కలిగినా నమ్మాను. కిటికీలోంచి బయటికి చూచేసరికి చీకటిపడుతోంది. సుబ్బులుకేసి చూశాను. నిద్రపోతోంది.

"అది చాలాసార్లు విన్నదిలే" అంది తాతమ్మ.

నేను తట్టేసరికి సుబ్బులు లేచింది. "తాతమ్మగారు చెప్పటం అయిపోయింది. పొద్దుపోతోంది, పద" అన్నా.

"ఇట్టే నిద్ర పట్టేసిందే" అనుకొంటూ సుబ్బలక్ష్మి హాల్లోకి నడిచింది. నేనూ వెంబ

# సరస విరసాలు

ఏ శుభముహూర్తాన అయిందోగాని మా వివాహం—నాకూ మాఆవిడకు తూర్పు తెల్లారట మాలప్యం, చుక్కెదురు. నేను ఏదో చిలకంగా—నిండుగా ఉండాలని అతి తెలివిగా మాట్లాడుతూ తీరా ప్రొద్దుక్రుంకేసరికి తెల్లమొహం వేస్తుండేవాడిని. తలుచుకుంటే నాకే విపరీతంగా తోస్తుంది. అసలు నా కప్పుడప్పుడూ అనుమానం కలుగుతూ ఉంటుంది.—నేనంటే ఇంటావిడకు లవలేశం అసంతృప్తి ఏమోనని.

మరి పుస్తకాలలోనే చదివిందో, ఎవరి ఉపన్యాసమో, లేక చెప్పుడు మాటలే విన్నదో—ఎక్కడన్నా ప్రత్యక్షంగానే చూచిందో ఏమోకాని—నన్ను సరసం తెలియని వానిక్రింద జమకట్టి పారేసింది. పోనీ ఆ మాట తనలో తాననుకొని ఊరుకోకూడదూ ఉహూఁ! పొరుగింటి పుల్లమ్మతో అనేసింది. ఆ మాట నానని నువ్వుగింజలాగా అనోటా అనోటా పడి నా కర్ణతాడితమైంది.

నిజం చెప్పాలంటే సరసమంటే ఏమిటో నాకు తెలియదనే చెప్పాలి. రయినా! అలుమగల మధ్య సరసాలంటూ ఉంటాయా అనే ధర్మ సందేహం. ఉండనుపో! అవి అందరికీ తెలిసేటట్లు బహిరంగంగా ఉంటాయా? బావా మరుదులు—బావా మరదళ్ళు—ఇంకా వరసైన వారితో సరసాలూ ఆడవచ్చు—అవసరమైతే అవకాశం ఉంటే వసంతాలూ చల్లవచ్చు.—

అంతేకాని, పది మందికీ తెలిసేలా, అందులోనూ, ధర్మపత్నితో సరసమాడటం ఎలాగు? చేసుకున్న దానిని నలుగురిలో చిన్నబుచ్చటం ఎక్కడన్నా సరసమనిపించుకొంటుందా—పైగా అలా చేస్తే చూచినవారు—అల్లాంటి వాడిని సరసుడు కాడంటారు. ఎంతకూ నా సమస్యలు అపరిష్కృతంగానే నిల్చిపోయినై.

ఇలా కాదనుకొని నామటుకు నేనొక నిర్ణయాని కొచ్చాను. బహిరంగంగా మా ఆవిడతో సరసాలాడే దమ్ములేదు. ఒకవేళ గుండె దిటవుచేసుకొని ఆడదామన్నా చేతకాదు. ఇంకపోతే ఏకాంతంలో మాత్రమే కావలసినంత అవకాశం. అనుకోవటమే గాని అక్కడ మాత్రం అంత అవకాశం ఉంటుందన్న నమ్మకం ఆలోచించిన కొద్దీ సన్నగిలుతోంది. ఏదో విధంగా ఆమెను ఏడిపించడమే కదా పర్యవసానం. అంటే ఏడిపించటమంటే నా ఉద్దేశం సరసమాడటమనే గాని వేరే దురుద్దేశం కాదు. మరి సరసమంటే సారాంశం నలుగురి ముందూ, ఎదుటివారిని అపహాసించటమేగదా అని, అందుకోసం తీరికైనప్పుడల్లా సాధనచేసేవాడిని.

కాటూరి విజయ సారథి

నాకు రోజూ రాత్రి పడుకోబోయే ముందు ఒక గ్లాసెడు పాలు త్రాగటం చిన్నతనంనుంచీ మా నాయనమ్మ అలవాటు చేసింది. ఏ సందుపాటునో ఆ గ్లాసెడుపాలు తీసుకువచ్చి మా ఆవిడ నా పడకగదిలో పెడుతుంది.

'బాగు బాగు. వజ్రంవంటి ఆలోచన తట్టిందిరా' అనుకొని-గుట్టు చప్పుడుకాకుండా, నాయనమ్మ, పిల్లలు నిద్రపోయాక, వెళ్ళి, మా ఆవిడని తట్టిలేపాను. ఆమె కళ్ళు నులుముకొంటూ లేచింది. మృదువుగా ఆమె చేతిని గ్రహించి, నా మంచం దగ్గరకు తీసుకవచ్చి-"ఇవ్వాళ పాలు పెట్టలేదా?" అని అడిగాను.

ఇంత ఆలోచించి, తెలివిగల పనిచేశాననే అనుకున్నానుగాని, కళ్ళయెదుట ఉన్న పాలగ్లాసు తీసి ఎక్కడన్నా చాటున పెడదామన్న ఆలోచన తట్టపోయింది. వెరగ్గా వెరగ్గా నాకు సరసమాడటానికి ఆ పాలగ్లాసే దిక్కయ్యేసరికి తీసి దాచివేద్దామన్న సంగతే స్ఫురించలేదు. శ్రీమతి నిద్దరమత్తులో ఉందేమో, కొంచెం విసుగ్గా "అదేమిటి ఎదురుగుండా ఉంటేనూ-యీ భాగ్యానికే నిద్దరలేపాలా-" అంది-

నాకూ కొంచెం కోపం వచ్చినా, తమాయించుకొని, ముద్దుగా-లాలనగా-ఇలా తీసుకురావోయ్ అన్నాను. మా పెళ్ళయిన క్రొత్తలో "ఏమోయ్" అని అంటూ ఉండేవాడిని. రాను రాను ఇద్దరు పిల్లలు పుట్టేసరికి ఎవరన్నా వింటే నవ్విపోతారేమోనని "ఏమే" అనే అనడం ప్రారంభించాను. నాటిరాత్రి ఉన్నట్టుండి అలా "ఏమోయ్" అని పిలిచేసరికి నాకే క్రొత్త అనిపించింది. ఆ మాటలో మా ఆవిడ ముఖంలోనూ కాస్తంత చిరునగవు మెరపు తళుక్కుమన్నది. ఓహో! మన సరసం రసభరితమై పాకాన పడుతోందిరా అని గర్వించాను.

శ్రీమతి చిన్ననాటి సంఘటనలు తలపుకు తెచ్చుకొన్నదో ఏమో ఒక క్రొత్త గమనంతో, ఒయ్యారంగా వెళ్ళి గ్లాసు తెచ్చి చేతి కందించింది. నేను ఆమె పాణిగ్రహించి సరసన కూర్చోబెట్టుకొని "ఏమే! రోజూ నేను పాలుతాగుతూనే ఉన్నానుగా-ఇవ్వాళ ఇద్దరం కలిసితాగుదాం" అన్నాను. మా ఆవిడా అందుకు ఒప్పుకొన్నది. "ఐతే ముందు నువ్వుతాగి తరవాత నాకియ్యి" అన్నాను. "అలాకాదు ముందు మీరుతాగాలి, తరవాత నేను" అని నానోటి కందించింది పాలగ్లాసు. శ్రీమతి ప్రేమానురాగాలకు నామతిపోయిందో, లేక సరసమాడాలనే ఆత్యాసక్తిలో మరచిపోయానోగాని, మొత్తానికి ఆ చంద్రవదనాన్ని చూస్తూ, కళ్ళతో సౌందర్యాస్వాదనచేస్తూ గ్లాసెడుపాలూ త్రాగి, దానికి పట్టి గ్లాసు చేతికిచ్చాను. ఇంకా ఆగ్లాసులో పాలున్నాయనే భ్రమతో అమితాప్యాయంగా గ్లాసు నందుకొని నోటగరచి వంచుకొంటే చుక్కపాలు లేకపోయేసరికి - నావంక చురచురా చూసింది. నేను పెద్ద ఘనకార్యం చేసినవానిలాగా విరగబడి నవ్వాను.

నిజానికి పాలు అన్నీ నేనే త్రాగుతున్నాననే జ్ఞానం నాలో లేదనుకోండి. అయినా, అనుకోకుండా జరిగినా, అందులో నా ప్రయోజకత్వం లేకపోయినా, ఆ సంఘటన కూడ నాకు గర్వకారణమయింది. అది చరచరా వెళ్ళి ముసుగు బిగించి పడుకుంది. ఓహో కోపం వచ్చింది గాబోలనుకొని ముక్కిన పేనల్లే పడుకున్నాను.

తెల్లవారిం తర్వాత ఆమె ముఖం చూడాలంటే కాస్త సిగ్గనిపించింది. 'ఆడక ఆడక సరసమాడితే ఇలా పరిణమించిందేమిరా భగవానులూ' అని నా దుర్విధిని అప్రయ

## రగిలిన పగ

డింది. మళ్ళా జంటసర్పాల ఫోటోల్ని తదేకంగా చూశా. వాటిమీద నాకు అదో విధమైన ప్రేమ, సానుభూతి కలిగాయి. కర్టెన్‌మీద జంటసర్పాలు నన్ను దీవించుతున్నట్టుగా తలలూపాయి గాలికి.

"మీ యింటికి వచ్చినందుకు చక్కటి గాథ తెలిసింది. మావాళ్ళందరికీ చెప్తా" అని వచ్చేశాను గబగబా. ★

[దీని సారాంశం కల్పనగాదు. యథార్థం.]

ర్నంగా నిందించుకొన్నాను. ఆ రాత్రి 'ఎందుకొచ్చింది - అసలే కోపంగా ఉన్న' దని గుప్ చిప్ గా పడుకున్నాను సరసంమాట దేముడెరుగు ననుకొని.

ఇంటిపనులు చక్కబెట్టుకొని, జెడలో మల్లెలు ముడిచి కరకంకణ కింకిణీ స్వనంతో అపరలక్ష్మిలా నా భార్య చేతిలో తళతళ లాడే రజితపాత్రి పట్టుకుని నన్ను డాసి, భుజం పట్టుకుని లేపి కూర్చొబెట్టి పాలగ్లాసు చేతికందించింది. ఆహా! నేను నా పుణ్యం పండిందనుకొని పారవశ్యంలో నా చేయి తనంతటతా పాలగ్లాసు నోటికందించేసరికి తెలివి వచ్చింది. తీరా, చూడబోతే వెలిడి గ్లాసు, త్రాగబోతే వెలితిగ్లాసూను. ఓరా! దెబ్బకొట్టిందిరా అనుకొని దాని ముఖంలోకి చూశాను. "తిక్క వదిలిందా?" అన్నట్లుగా శ్రీమతి ఒక వింతనవ్వు నవ్వింది. పరాజయా న్నంగీకరించక తప్పలేదు. కాని ఆంత ర్యంలో విజయం నాదేనని ఉప్పొంగిపో యాను. సరసం రసకందాయంలో పడి ఎదిరి పక్షంనుంచి దక్కని సమాధానం వచ్చిందను కొన్నాను. మరి నేను సరసమాడినట్లు నా ప్రయోజకత్వం దానికి తెలిసిందో లేదోనని "నిన్న సరసానికలా చేశానే" అన్నాను నా తెలివితక్కువతనానికి నిదర్శనంగా. "సంతో షించినట్లే ఉంది సరసం" అంది మా ఆవిడ. ఆ అనటంలో సరసంగా అనకూడదూ. సరసంచేత కాకపోతే సామాన్యంగా అని ఊరుకోకూడదా - కొస్త దురుసుదనం ప్రతి ధ్వనించేలా అన్నది. దానితో మళ్ళా నా బింకం నన్నావహించి, "అఘోరించినట్లే ఉంది నీ తెలివి" అని అనిపించింది.

అసలు నేను మా అత్తవారింటికి వెళ్ళనే వెళ్ళను. అథవా వెళ్లానా—మా ఆవిడ నన్ను ముప్పతిప్పలబెట్టి మూడు చెరువుల నీరూ త్రాగిస్తుంది. దానికి వంతపాడుతూ మా బావమరది, మరదలు పిల్లాను...

ఇది తలుచుకొన్నపుడల్లా నాకు ఆశ్చర్యం కలుగుతూండేది. మా యింట ఉన్నప్పుడు మా ఆవిడకి మాయనటనలు, చమత్కారాలు తెలిసినట్లే ఉండేదిగాదు. దాని కన్నవా రింటమాత్రం సెరజాణ అయి పూరుకుం టుంది. ఈ మాట ఎప్పుడన్నా మా నాయ నమ్మతో నేను అంటే నమ్మడు సరికదా, పైగా దానినే వెనకవేసుకు వస్తుంది. దానికి నోట్లో నాలికే లేదుట, నోట వేలు పెడితే కొరకలేదుట. మరి యీ సంగతి నిజమని ఋజువు చెయ్యటానికి వీలులేక ఊరు కొన్నాను. బహుశా కన్నవారింట దానికి స్థానబలం, వాంగుబలం ఉండటంచేత నేమో అలా రెచ్చిపోయేది.

నా పెండ్లయిన కొత్తలో ఓసారి వాళ్ళిం టికి వెళ్లాను. ఆనాడు నా పేరు చెప్పకుని అందరూ భద్రసాపేతంగా విందుగుడిచారు. నా నోరూ అరగించకపోలేదనుకోండి. నాకు తీపి అంటే పరమ అసహ్యం. అలాగని అంతకారం తినగలిగిన మగటిమీ లేదు. మా ఆవిడ స్వహస్తాలతో, నా కోసమే అన్న ట్లుగా పంచదార ప్రేమ పొందుపరచి జిలే బీలు చేసింది. అంతవరకూ మా అత్తగారే వడ్డిస్తోంది. జిలేబీలు మాత్రం మా ఆవిడే వడ్డించింది. నేను వాటిని ముట్టనైనా ముట్ట కుండా వదిలిపెట్టేశాను. దానికి ఒళ్లు మండిందికాబోలు, మా మరదలితో చెప్పి బడ్డీలోంచి తెప్పించిన కిల్లీలో తీపిసామాను తీసివేయించి—ఆ నాలుగాకుల్లోనూ, "మాంచి" ఘాటైన సున్నంలో కారం మెదిపి యథాప్రకారం ఆకు ముడిచి ఇప్పిం చింది. అసలే భుక్తాయాసంగా ఉండ టంతో కిల్లీ చూడంగానే ప్రాణం లేచి వచ్చింది. ఆత్రంకొద్దీ కచాపచా నమిలేశాను ఏం చెప్పమంటారు నా బాధ! అప్పటికే అరక్షణం భరించాను. ఆ పైన దుర్భరమై, దవడపూడి క్రిందపడుతుందేమో నన్నంత భయం కలిగి రెండు చేతులా అదిమిపట్టి కసి తీరా చేసుకొన్న దానిని కసురుకొని రెండు గ్లాసుల మంచినీళ్ళు త్రాగేను. ఆ ఘాటు కెక్కడా ఈ నీళ్ళు చాలలేదు. అంతట శ్రీమతి పకపకా నవ్వుతూ జిలేబీచుట్ట లందించింది. నా అసహ్యం ఏమైందోగాని వరసగా నాలుగు జిలేబీ చట్రాలు తినేశాను. "మంచిగా తినమంటే సహించదూ" అంటూ ఎత్తిపొడిచింది. అన్నా! ఎంతపనిచేశావను కొని కాస్సేపు అలకపూనాను. అంతట, మరదలు పిల్ల "బావకు సరసం తెలియదే" అనేసింది. అక్కడితో ఆగక బావమరది- "బావకు నీరసమంటే మహాఇష్టంస్మీ!" అని

(31-వ పేజీ చూడండి)

## ...పి వెనుభూతం!

డాక్టర్
టి. కె. యన్. మీనన్
బరోడా
విశ్వవిద్యాలయం

# ...సకొన్ని మార్గాలు

టానికి ఒకవంక పథకాలువేస్తూ ఇంత భారీ ఎత్తున వృథాజరగనివ్వటం విపరీతంగా కనిపిస్తుంది."

## పదిలక్షలమంది

పరీక్షావిధానాన్ని సంస్కరించాలని వాదించేవారు ఒకవిషయాన్ని మరిచిపోరాదు. ఈ పరీక్షల్లో కొన్ని లోపాలున్నా భారత దేశానికి వీటివల్ల కొంతమేలు జరగకపోలేదు. వీటినిబట్టి విద్యకు కనిష్ఠ స్థాయిని ఏర్పరచటానికి, విద్యాలయాలకు పరిగణన ఇవ్వటానికి వీలైంది. వీటివల్ల చెడుజరిగితే జరిగిఉండవచ్చుగాని, అవి పొత్తిగా నిరుపయోగం అనిగాని, దేశంలో విద్య పాడైపోవటానికి అవే కారణమని గాని చెప్పటానికి వీల్లేదు.

అయితే పరీక్షా విధానం మీద అసంతృప్తి నానాటికీ పెరిగిపోతోంది. ఇందులో కేసబబు ఏమీలేదు. ఈ విధానాన్ని మార్చాలా, మార్చనక్కర్లేదా అనే ప్రసక్తే ఇక లేదు. మార్చవలసిందే. అయితే ఏవిధంగా మార్చాలి, ఎంత తొందర్లో మార్చాలి అనే ప్రస్తుత సమస్య.

పరీక్షల సంగతి అలా ఉంచినప్పటికీ ఏటేటా పెరిగిపోతున్న ఎస్. ఎస్. ఎల్. సి., మెట్రిక్ అభ్యర్థుల సంఖ్యను చూసైనా మార్పులు చేయటం అత్యవసరముగా తోస్తోంది.

1937 లో మెట్రిక్ పరీక్షలకు కూర్చున్నవారు లక్షమందే. ఈరోజున పదిలక్షలమంది! పరీక్షల్ని నిర్వహించడానికి ఏవైనా తేలిక పద్ధతులు కనిపెడితే తప్ప ముందు ముందు చాలా కష్టమైపోతుంది.

పరీక్షల్ని సంస్కరించాలంటే కొన్ని ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వస్తోంది. మనం అవునన్నా కాదన్నా పరీక్షలు ఒక ప్రబలమైన శక్తిగా తయారయ్యాయి. వాటిని మనం ఎంత విమర్శించినా అవి ఇప్పుడు పొమ్మంటే పోయేవి కావు. ఇవి సిలబస్‌తోను, విద్యార్థులు చదవటానికి, ఉపాధ్యాయులు చదువు చెప్పటానికి గల కారణాలతోను, వ్యక్తుల హోదాలతోను, సెలక్షను పద్ధతులతోను ముడి పెట్టుకుని ఉన్నాయి.

పరీక్షల్ని సంస్కరించేటప్పుడు ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని వ్యవహరించాలి. లేకపోతే మొత్తం విద్యావిధానమే నేలమట్టం కాగలదు. అలా కాకుండా జాగ్రత్తగా సంస్కరణలు తీసుకురాగలిగినప్పుడు విద్యార్థులు, ఉపాధ్యాయులు, పరిపాలకులు, ప్రజల సహాయ సహకారాలతో మనదేశంలో విద్య అతి శీఘ్రగతిని పురోగమించగలదు.

పరీక్షా సంస్కరణలకు మనం అవలంబించవలసిన దృక్పథం ఏమిటి? పరీక్షలు జరపటం, వీటిని బట్టి విద్యార్థుల తెలివితేటలను విలువకట్టటం విద్యాకార్యక్రమానికి తప్పనిసరిఅని మనం గుర్తించకతప్పదు. ఈ విద్యాకార్యక్రమంతో విద్యాబోధన లక్ష్యాలు, విద్యార్థిఅనుభవాలు, మొదలైనవన్నీ ముడిపెట్టుకుని ఉన్నాయి. ప్రస్తుతం మన చదువుకు ఒకటే లక్ష్యం ఉంది. ఎంత ఎక్కువ వీలైతే అంత ఎక్కువ సమాచారం సంపాదించటం. ఇలా కాకుండా విద్యాబోధన, విద్యార్జన ఆశయాలను విస్తృతంచేయాలి.

## మూడు లోపాలు

ప్రస్తుత పరీక్షావిధానంలో మూడు లోపాలున్నాయి. ఒకటి: పరీక్షలో ఇచ్చిన ప్రశ్నలకు వ్యాసరూపంలో సమాధానం రాయాలి. పేపర్లుదిద్దేవారివ్యక్తిగత లక్షణాల ప్రభావమంతా ఈ పద్ధతిలో కనిపిస్తోంది. రెండు: సాంవత్సరిక పరీక్షలలోనో, పబ్లిక్ పరీక్షలలోనో వచ్చిన మార్కుల్నిబట్టి విద్యార్థి తెలివితేటల్ని లెక్కగట్టడం జరుగుతోంది. అంతేకాని అతని క్లాసు రికార్డులు వగైరా వేటినీ పరిగణించడంలేదు. మూడు: సమాధానాలకు మార్కులిచ్చే పద్ధతిని మనమిప్పుడు అనుసరిస్తున్నాం. అంటే 'నూటికి ఇన్ని మార్కులివ్వవచ్చును' అనిఖచ్చితంగా తెగేసి చెప్పకలిగినంత సూక్ష్మమైనది మానవ మనస్సుఅని మనం నమ్ముతున్నామన్నమాట.

మొదటిలోపాన్ని వివరంగా చూద్దాం: వ్యాసం రాయటం ఒకవిధంగా మంచిది కాదని ఎవరూ అనరు. ఒకానొక విషయాన్ని గూర్చితనకు తెలిసిన అంశాలన్నిటినీ ఒక క్రమంలో గుదిగ్రుచ్చి వ్యాసంగా వ్రాయటానికి విద్యార్థికి తీక్షణమైన మేధాశక్తి కావల్సిఉంటుంది. ఒక అంశానికి మరో అంశానికి గల సంబంధాన్ని విద్యార్థి ఎంతవరకూ గుర్తించాడు అనేది తెలుసుకోవటానికి వ్యాసం చాలా సహాయపడుతుంది. కాని పబ్లిక్ పరీక్షల్లో వందలాది, వేలాదివిద్యార్థులను పరీక్షచేసే టప్పుడు, వ్యాసరచనలోని కొన్నికొన్ని ముఖ్య లోపాలు బయట పడతాయి.

వ్యాసరచనకు కోరేప్రశ్నలను తయారుచేయటంలో ఎవరూశ్రద్ధ వహించటం లేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. సాంవత్సరిక పరీక్షలకు ప్రశ్నాపత్రాలను తయారుచేసే ఉపాధ్యాయులుగాని, పబ్లిక్ పరీక్షలకు ప్రశ్నలు తయారుచేసే కొద్దిమంది పరీక్షకులుగాని విద్యార్థులు ఏ పరిస్థితుల్లో విద్యా

'డీన్'గా పనిచేస్తున్న డాక్టర్
...ప్రసంగం. ఆకాశవాణి పత్రిక
...నేటి పరీక్షా విధానంలో వున్న
...శల్యంగా పరిశీలించారు. దేశం
...లమంది విద్యార్థులు స్కూల్
...వుతున్నారు. ఇది ప్రతి ఏటా
...దాపు సగంమందికిపైగా దీనిలో
...ఖ్య పెరిగిపోయినకొద్దీ ముందు
... అసాధ్యంగా పరిణమిస్తుంది.
...శ్యం సంస్కరించాలంటున్నారు
... మేమిటన్నదే పెద్ద ప్రశ్న.
...కమకు తోచిన పద్ధతులను
...ప్రచురిస్తాము.

# ★ నేటి పరీక్షల పద్ధతి ★

ధ్యాసం చేస్తున్నారో దృష్టిలో పెట్టుకుని చేయరు. ప్రశ్నాపత్రాలు తయారుచేసేవారు సాధారణంగా ఏ రెండుగంటలసేపో సమావేశమవుతారు. సిలబస్ కేసి గబగబా చూసి ప్రశ్నలు తయారుచేస్తారు. ఎందుకైనా మంచిదని ప్రశ్నల్ని సాధ్యమైనంతస్థూలంగా ఉంచుతారు. సిలబస్‌లోని వివిధపాఠాలను విద్యార్థి ఏవిధంగా నేర్చుకొన్నాడో కని పెట్టటానికి వీలులేనివిధంగా, అసామాన్యంగా సిలబస్‌లోని పదాలనే ముక్కలుముక్కలుగా ఉపయోగిస్తూ ప్రశ్నలు తయారుచేస్తారు.

వ్యాసరచనను కోరే ప్రశ్నాపత్రంవల్ల విద్యార్థి తెలివితేటలు వ్యక్తమయితే అవుతాయి; లేకపోతే కావు. ఈ పద్ధతి అసమగ్రమైనదని ఒప్పుకోకతప్పదు. సమాధానాలకు మార్కులు వెయ్యటం చాలామటుకు దిద్దేవారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది దస్తూరిబావుంటే పేపరు దిద్దేవాడు సంతోషిస్తాడు. తనకు తెలిసిన పడికట్టుమాటల్ని, అభిప్రాయాల్నే విద్యార్థికూడా ఉపయోగిస్తే దిద్దేవాడికి మరీ సంతోషంగా ఉంటుంది. పేపరు దిద్దుతున్నప్పుడు విసుగు, అలసటా కలిగినా చిక్కే. ఇది ఇలా ఉండగా పరీక్షలు కూడా చాలాసేపు జరుగుతాయి. ఒక్కొక్క పేపరూ రెండు మూడేసి గంటలసేపు వ్రాయాలి. సాధారణంగా రోజుకలాంటి పేపర్లు రెండేసిఉంటాయి. దీనివల్ల విద్యార్థికి కూడా బోలెడు శ్రమా, అలసటా కలుగుతాయి.

ఇక మార్కులు వెయ్యడంలో కొన్ని కఠినమైన నిబంధనలు, ఏ సూత్రానికీ కట్టుబడని వాటిని మనం ఏర్పరచుకున్నాం. ఒక యూనిట్‌లోని మొత్తం విద్యార్థులు ఏ విధంగా పేపర్లు వ్రాశారో దాన్ని దృష్టిలో పెట్టుకుని ఒక విద్యార్థి పేపరును అంచనా వెయ్యటానికి వీలివ్వని విధంగా ఈ నిబంధనలు ఏర్పరుచుకున్నాము. ఈ లోపాల మూలంగా ఎందరు నాశనమయిందీ, దేశానికి ఎంత మానవశక్తి పనికిరాకుండా పోయిందీ చూస్తుంటే విచారం కలుగుతుంది.

విద్యార్థి క్లాసురికార్డుల్లో అభివృద్ధిని లెక్కలోకి తీసుకునే అవకాశం ప్రస్తుత విధానంలో లేదని పైన అనుకున్నాము. దీని ఫలితంగా ఏం జరుగుతోంది? న్యాయంగా పాఠాలను విషయ స్వభావాన్నిబట్టి కొన్ని భాగాలుగా చేయటం, వాటిని బోధించటానికి తగినంత కాలాన్ని కేటాయించటం జరగాలి. కాని అలా జరగటంలేదు. అందుచేతనే సాధారణంగా ఉపాధ్యాయులు ఏడాది మొదట్లో పాఠాలు తాపీగా కానిస్తారు. పెద్దపరీక్షలు దగిరికి వచ్చేకొద్దీ తొందరతొందరగా కొట్టేస్తారు. దీనివల్ల పాఠాలన్నీ క్షుణ్ణంగా నేర్చుకునే అవకాశం లేకుండాపోతోంది. మేష్టారు తెలుచుకున్నంతమాత్రాన విద్యార్థులకి చిటికెలో పాఠాలన్నీ వచ్చేయవు. అందుకనే మేష్టర్లు సాధారణంగా ఏంచేస్తారంటే తను 'ఇంపార్టెంటు' అనుకున్న పాఠాలను కాస్త వివరంగాను, 'అనింపార్టెంటు' అనుకున్న వాటిని టూకీగాను కొట్టేస్తారు.

ఇక విద్యార్థు లేంచేస్తారు? కొన్ని పాఠాలను మాత్రమే క్షుణ్ణంగా చదువుతారు. లేకపోతే బజారులో పుష్కలంగా దొరికే "నోట్సు" కొనుక్కుని పిక్కాపేస్తారు. లేకపోతే ట్యుటోరియల్ సంస్థల్లో చేరి చెప్పించుకుంటారు.

విద్యార్థులు "నోట్సు" మీది కెగబడుతున్నారని వెంగట్టుకునే ఉపాధ్యాయులు విద్యాధికారులు ఒక విషయం గుర్తించటం లేదు. వ్యాసరచన అవసరమైన పరీక్షా విధానమే ఈ మాదిరి నోట్సు, గైడ్లు బయలుదేరటానికి ముఖ్యకారణం. శాసనంచేసి ఈ నోట్సును బజార్లనుంచి మాయంచేయటానికి వీల్లేదు. అలాగే ట్యుటోరియల్ క్లాసుల్నికూడా నిషేధించే వీలులేదు. వీటిని నిజంగా బహిష్కరించాలంటే ముందు పరీక్షా విధానాన్ని మార్చాలి. అలా మారిస్తే నోట్సూ మాయమైపోతాయి; ట్యుటోరియల్ సంస్థలూ మూతపడతాయి.

ఇక మూడో లోపం,—మార్కుల పద్ధతి. పబ్లిక్ పరీక్షల్లో పేపర్లు దిద్దేవాళ్ళు ఎక్కడెక్కడివాళ్ళో అయివుంటారు. అందుచేత విలువకట్టడం రకరకాలుగామారిపోతూ ఉంటుంది. దిద్దేవారు స్థూలంగా కొన్ని ప్రమాణాలు పెట్టుకున్నా, తగురీతిగా జాగ్రత వహించినా, అసలువిధానమే వ్యక్తిగత విభేదాలకు తావిచ్చే విధానం గనక, దిద్దేవారికి దిద్దబడేవారితో ప్రత్యక్ష పరిచయం లేకపోవటంవలన, అధిక సంఖ్యాకులకు కనిష్ఠ పరిమితికి కొంచెం పైగా మార్కులు పడెయ్యడం జరుగుతుంది. "మరీ తేలికగా దిద్దుతున్నారండీ" అని ఎవరన్నా అంటే దిద్దేవాడు మరీ కఠినంగా దిద్దటం ప్రారంభిస్తాడు. "అబ్బే మరీ అంత కఠినంగా దిద్దుతారేమండీ" అని ఎవరన్నా అంటే మరీ తేలికగా దిద్దటం మొదలు పెడతాడు.

ఏమైనా నూటికి ఇన్ని మార్కులకంటె ఒక్కమార్కు ఎక్కువ వేయటానికివీల్లేదు, తక్కువ వేయటానికి వీల్లేదు అని ఖచ్చితంగా చెప్పగలిగినంతటి నైశిత్యం మానవ మనస్సుకు లేదు. విద్యార్థుల్ని స్థూలంగా అత్యుత్తమ, ఉత్తమ, సాధారణ, అధమ, అనర్హ వర్గాలుగా విభాగించటం మంచిపద్ధతి. అలాకాకుండా నూటికిన్ని మార్కులు అని ఒక విధమైన విచక్షణ విధానం అవలంబించటంవలన ఏ విద్యకు ఎవరు తగుదురు, ఏ వృత్తి విద్యకు ఎవర్ని సెలెక్టుచేయవచ్చును అనేదానికి సరియైన ప్రమాణాలు లభించకుండా పోతున్నాయి. 

[మిగతా వచ్చేవారం]



శ్రీశైల ప్రాంతంలో నివసించే చెంచులవాళ్లు.

—ఫోటో: నందగోపాల్, హైదరాబాదు.

## సరస విరసాలు

(27-వ పేజీ తరువాయి)

వంతపాడాడు. ఆ ముగ్గురు మధ్యా నే నొంటరివాడిని కావడంతో ఏమీ అనలేక వారితోపాటు నవ్వేసి ఊరుకొన్నాను. అయితే ఏం నాకు తలకొట్టేసినట్లనిపించింది. దుర్మార్గులు నన్ను ఆహ్వానించి ఇలా పరాభవిస్తారా! అనిపండ్లు పటపటలాడించుకొన్నాను ఎవ్వరికీ వినిపించకుండా.

తరువాత, తరువాత ఎందుకైనామంచిదని సరసం నేర్చుకొన్నాననుకోండి. ఈ సరసం నేర్చుకొనక ముందు నాకు మా ఆవిడకూ నిత్యం కీచులాట జరుగుతుండేసరికి మా నాయనమ్మ పిలిచి—"నీకూ మీ తాతయ్య పోలిక లొచ్చాయారా? ఆయనా ఇలాగే తెల్లారిలేస్తేపడుకోబోయేవరకు నాతో పోట్లాడుతూనే ఉండేవారు. నన్ను ఒకనాడు కోపేయడం మా మామగారు విని "ఆడపిల్లనెందుకు నోరుచేసుకుంటావు" అనిఆయన చివాట్లుపెట్టారు. ఆయన గారికి అభిమానం ముంచుకొచ్చి ఇంట్లోంచి వెళ్లిపోయి ప్రక్క ఊళ్లో వారిస్నేహితుడుంటే వాళ్లింటికి వెళ్లారు. రెండురోజులవరకూ రాకపోయే సరికి నామనస్సులో దిగులుదిగులుగా ఉండటం చూసి, మామామగారు "మరేంపర్వాలేదు లేమ్మా, రేపటికి వాడేవస్తాడు—అంతగా రేపు రాకపోతే నేను వెళ్లితీసుకొస్తాను—ఎక్కడికి పోతాడుగనక" అని అన్నారు. ఆ రాత్రి మూడుగంటలకి ఎవరోదబదబా తలుపుబాదుతుంటే తీరాతీసి చూద్దును కదా— మీ తాతయ్య లోపలికివస్తూనే— "పొద్దుమాకట మాలస్యం—తలుపులు బిడాయించుక్కూర్చుంటారు ముష్టిమూక" అంటూ గుడురిమి తగాదా మొదలెట్టారు. నాకునవ్వాగక— "ఏమండీ మళ్ళా నాతో తగవు ఆడటానికి వచ్చారా ఏమిటీ?" అన్నాను. అంతటితో ఆయన చల్లబడి— "నిజమే నే— యీరెండు రోజులూ నీతో పోట్లాడక పోవడం మూలాన్నేమో నిద్రాహారాలు లేవు. ఇవ్వాళ ఇంకా ఆగలేక ఏమీ తోచక బయల్దేరి వచ్చేశాను. రోజుకొకసారైనా నీతో పోట్లాడితేగాని నాకునిద్రపట్టదే" అని ఘుక్కున నవ్వారు" అని ఆమె చిన్ననాటి అనుభవం ఒకటి చెప్పేసరికి— నాకూ, మాఆవిడకూ నవ్వాగలేదంటే ఇసుమంతైనా అతిశయోక్తి లేదంటేనమ్మండి.

సరసం తెలియకపోవటం వారసత్వంగా కూడా వచ్చేదుర్గుణమేమో— విరసమూ ఒక సరసమే కాబోలు—సరసం లేకపోతే సంసారం నిస్సారమూ, నీరసమూ— కళాకాంతులే ఉండవు—అని అప్పుడునిజంగా నాకనిపించిన మాటమాత్రం వాస్తవం. ★

# నక్షత్ర ఫలితాలు

**(5-3-58 మొదలు 11-3-58 వరకు)**

## గ్రహస్థితి

| | [illegible] | | |
|---|---|---|---|
| శ<br>బు | 8 వ తేదీన శుక్రుడు మకరములో ప్రవేశించును. 9 వ తేదీని బుధుడు మీనములో ప్రవేశించును. సింహ కన్య, తుల, వృశ్చిక ములలో చంద్రుడు. | | |
| శు | | | |
| కు | | గు రా | |

## *అశ్వని [చూ, చే, చో, లా]*

ఈవారము అనుకున్నట్లుగా సౌమ్య అందకపోవడం బంధువులరాకవల్ల ఖర్చులు ఎక్కువవడమే కాకుండా కొత్త పనులు పైన వేసుకోవడంవల్ల కూడా అశాంతి కలుగుతుంది. కోర్టువ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతవి. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వస్తాయి. వర్తకులకు ఆందోళన. వ్యవహారములపట్ల చిక్కులు, వివాదాలు. భార్యకు అరోగ్యభంగము. విద్యార్థులకు చదువు సరిగా జరగదు. 5, 7, 8 తేదీలలో స్వల్పముగా కార్యలాభము. 9 న ఆరోగ్య చింత, వివాదము 10, 11 తేదీలలో కొంచం అనుకూలత, కర్ర బొమ్మలుచేసే శిల్పులకు లాభము

## *భరణి [లీ, లూ, లే, లో]*

ఈ వారము చేతికివచ్చినడబ్బు చాలక పోవడంవల్ల అనుకున్నట్టుగా పనులు జరగవు. దగ్గర బంధువులకు సహాయము చేయబోయి అలాజరుగనందునమాటపడడంవల్ల మనోవ్యథ చెందుతారు. గృహోసరములు తీరక ఇంటో కలతలువస్తాయి. ఉద్యోగస్తులకు ఒత్తిడి గలుగుతుంది. విద్యార్థులు వినోదములలో పాల్గొని ప్రమాదాలకు లోనౌతారు. లోహములు, రంగులవర్తకులకు మేలుకాలము. పోలీసు ఉద్యోగస్తులకు కార్యలాభము. 5, 6 తేదీలలో కార్యభారము, త్రిప్పట, విఘ్నములు, ధనలోపము7, 8 తేదీలలో నూతన ప్రయత్నములు. 9 న ప్రమాదసూచన, కార్య భంగము, మనోవ్యథ. 10, 11 తేదీలలో కార్యానుకూలత, సోదరసహాయము.

## *కృత్తిక [అ, ఈ, ఉ, ఏ]*

గత రెండు వారములనుండి మీకు కలుగుతున్న చిక్కులను ఈవారము మీ బుద్ధిబలము, వలుకుబడి, అధికారుల సహాయముల వల్ల పరిష్కరించ కలుగుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. జ్ఞాతి సహాయం కూడా కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి శుభవార్త వస్తుంది. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. కవులు నూతన రచన ప్రారంభిస్తారు. 5, 6 తేదీలలో కార్యక్రమం ఒక రూపమునకు వస్తుంది గాని శ్రమ, త్రిప్పట తుంటవి. 7, 8 తేదీలలో ధనాదాయము, బంధు సహాయము కార్యానుకూలత. 9 వ తేదీని అధిక

**బి. నరసింగరావు**

ఖర్చులు, అలసట. 10, 11 తేదీలలో లాభ యోగము. కవులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము.

## *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈవారము మీకు యోగకాలము. ధనాదాయము ఎక్కువవుతుంది. శుభకార్యము గురించి నిర్ణయం కుదిరినట్టు ఉత్తర దిక్కునుండి వార్తవస్తుంది. కోర్టువ్యవహారములు లాభిస్తవి. కొత్తవారితో పరిచయమువల్ల గోష్ఠివల్ల కొత్తవిషయాలు తెలుసుకుంటారు. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఉద్యోగస్తులకు హోదా పెరిగే సూచన లున్నవి. ఉపాధ్యాయులకు, పండితులకు న్యాయవాదులకు, కళాకారులకు, యోగకాలము. 5, 6 తేదీలలో కార్యసాధనలో త్రిప్పట, శ్రమ 7, 8 తేదీలలో ధనాదాయము, కార్యానుకూలత, జ్ఞానాభివృద్ధి. 9 తేదిని ఖర్చులు అధికము, శ్రమ. 10, 11 తేదీలలో శుభవార్త.

## *మృగశిర [వే, వో, కా, కీ]*

గత వారము కలిగిన యోగము ఈ వారము కూడా కొనసాగుతుంది. మీ ఆలోచనలను అమలులో పెట్టకలుగుతారు. ఆదాయము వృద్ధిపొందుతుంది. కవితాగోష్ఠి, గానసభలు మొదలగు వినోదములలో పాల్గొంటారు. బంధువులతో మృష్టాన్నభోజనము ఆరగిస్తారు. విద్యార్థులకు చదువు సక్రమముగా వుంటుంది. బియ్యము, నూలు, బట్టల వర్తకులకు లాభము. వెండినగల వ్యాపారస్తులకూ ప్రయాణమువల్ల లాభము కలుగుతుంది. కవులకూ, గాయకులకూ, నటీనటులకూ యోగకాలము. 5, 6 తేదీలలో కార్యక్రమము ఏర్పాటు; విరామములేని త్రిప్పట. 7, 8 తేదీలలో ధన లాభము, బంధుసమాగమము, వినోదము, విందు భోజనము, 9 తేదీన కార్యభారముచే శ్రమ. 10, 11 తేదీలలో కార్యసిద్ధి, శుభ వార్త.

## *ఆరుద్ర [కూ, ఖ, ఙ, ఛ]*

ఈ వారము ధనాదాయము ఎక్కువగా వృద్ధి అవుతుంది. గతవారము అసంపూర్తిగా విడిచిన కార్యములు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి. ఇతరులకొరకు చేసే పనులు సానుకూలపడి మీ కీర్తి పెరుగుతుంది. శుభకార్యాలోచనలు ఒక నిర్ణయానికొస్తాయి. విద్యార్థులు వినోదములలో గడిపినను చదువుమీద శ్రద్ధవహిస్తారు. బంగారము, వజ్రములు మొదలైన ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 5, 6 తేదీలలో విశ్రాంతి లేని కార్యక్రమము. 7, 8 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి, 9 న అస్వస్థత. 10, 11 తేదీలలో శుభకార్య నిశ్చయము, విందు, వినోదము.

## *పునర్వసు [కే, కో, హా, హీ]*

అన్ని వ్యవహారములలోనూ ఎక్కువగా కష్టపడతారుగాని మాట దక్కదు. త్రిప్పట వల్లను, అకాలభోజనమువల్లను వుష్ణాధిక్యము కలిగి, ఆరోగ్యము భంగమయే సూచనలు కనబడగానే శ్రద్ధ వహించండి. ఉద్యోగస్తులకు బాధ్యతలు ఎక్కువైనా ఆదాయము అభివృద్ధి అవుతుంది. విద్యార్థులకు చదువు సాగదు. రాజకీయవాదులకు కార్యలాభము. 5, 6 తేదీలలో కార్యములకు ఆటంకములు, 7, 8 తేదీలలో ఉద్యోగస్తులకు యోగము. 9 తేదీని ఆరోగ్యము చెడే సూచనలు. 10, 11 తేదీలలో కార్యలాభము; ఔషధము లమ్మువారికి, అటవీఫలసాయ వర్తకులకు లాభము.

## *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు అంత యోగదాయకముకాదు. మిత్రు లెవరో, శత్రు లెవరో తెలుసుకోలేని విషమస్థితిలో వుంటారు. కాని వారాంతమునకు నిజమిత్రులను తెలుసుకొని కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తు

లను ఆర్థికచిక్కులు బాధిస్తాయి. వ్యాపారస్తులకు మొదట్లో అంత ప్రోత్సాహకరముగా లేకపోయిననూ వారాంతమునకు లాభము కలుగుతుంది. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. 5, 6 తేదీలలో ఆటంకములు, అయోమయస్థితి. 7,8 తేదీలలో ప్రయాణము, మిత్రదర్శనము. 9 వ అస్వస్థత. 10, 11 తేదీలలో కార్యలాభము, విజేతయులతో పరిచయము, విచిత్రవస్తు సంపాదన.

## *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదలుపెట్టిన పనులకు ఆటంకాలు కలుగుతాయి. మీ చాకచక్యము నంతటినీ ఉపయోగించి కార్యసాధనకు ప్రయత్నిస్తారు. దైవబలమువల్ల అన్నీ సాధ్యపడతాయనే నమ్మకముతో ప్రయత్నించి ఫలసిద్ధిని పొందుతారు. ఉద్యోగస్తులకు కొత్త బాధ్యతలు పైన పడుతవి. వర్తకులకు వ్యాకులము. విద్యార్థులకు శ్రద్ధ తక్కువైనా కొత్త విషయాలు నేర్చుకుంటారు. 5, 6 తేదీలలో నిలకడలేని స్థితి. 7, 8 తేదీలలో ప్రయాణము, ఆత్మవికాసము. 9 వ తేదీని ఇంట్లోవారి ఆరోగ్యము సరిగా వుండక వ్యాకులము. 10, 11 తేదీలలో కార్యలాభం.

## * మఖ [మా,మీ,మూ,మే] *

ఈ వారము కూడా ఆదాయాభివృద్ధికి అనేక విధాల ప్రయత్నములు చేస్తూ అధిక కార్యభారము పైన వేసుకుంటారు. ఒకరికి సహాయము చేసిందికి పూనుకొని అనవసరముగా నీచస్త్రీలతో వివాదములకు పాలౌతారు. ఖర్చులు ఎక్కువైననూ కోర్టు వ్యవహారములు మీపరము అవుతాయి. వ్యాపారస్తులకు లాభము తక్కువ. ఉద్యోగులకు అధికారుల ఒత్తిడి. 5, 6 తేదీలలో కార్యభారము, త్రిప్పట. 7, 8 తేదీలలో కొంత లాభము. 9వ వివాదము. ఆరోగ్యచింత, 10, 11 తేదీలలో కొంత శాంతి.

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *
## [మో, టా, టీ, టూ,]

ఈ వారము మీ కార్యక్రమమును ఉత్సాహముగా ప్రారంభిస్తారు కాని కారణము కనబడకుండా ప్రతి పనికి ఆటంకాలు వుంటాయి. కాని నిరుత్సాహపడకుండా పట్టుదలతో ప్రయత్నించి ఫలసిద్ధిని పొందుతారు. ధనలోపము ఎక్కువగా వున్ననూ ఆత్మీయుల సహాయముచేత సర్దుకొన కలుగుతారు. యంత్రములవల్ల గాని వాడిగల పనిముట్లవల్ల గాని ప్రమాదము కలిగే సూచన లున్నవి. జాగ్రత్తపడండి. పోలీసు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు మేలుకాలము. 5, 6 తేదీలలో కార్యభంగము, త్రిప్పట. 7, 8 తేదీలలో నూతన ప్రయత్నము. 9 ప్రమాదభయం. 10, 11 తేదీలలో కార్యలాభం, ఆర్థిక సహాయము.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
## [టే, టో, పా, పీ]

ఈ వారము మీ బుద్ధిని ఉపయోగించి చేసే పనులు నెరవేరుతాయి. ఆదాయం బాగుంటుంది. అధికారుల ఆదరణ పొందుతారు. ప్రయాణమువల్ల కొత్తమిత్రులను సంపాదిస్తారు. శుభకార్యనిశ్చయం అవుతుంది. కవులకు సన్మానము జరుగుతుంది. శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము. 5, 6 తేదీలలో అధికఖర్చులు, ప్రయాసము. 7, 8 తేదీలలో ప్రయాణము, మిత్రలాభము కార్యసిద్ధి. 9వ అలసట. 10,11 తేదీలలో శుభకార్యచింత.

## * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారం మీకు ధనయోగము కలుగుతుంది. ఉత్తమ గ్రంథపఠనవల్ల విజ్ఞానాభివృద్ధి అవుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తవి. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, కళాకారులకు మేలుకాలము. 5,6 తేదీలలో కార్యసాధనలో శ్రమ. 7.8 తేదీలలో ధనలాభము. 9 తేదీని అలసట. 10,11 తేదీలలో పండిత గోష్ఠి.

## *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీరు తలపెటిన కార్యములు నిర్విఘ్నంగా నెరవేరుతాయి. అనుకున్నట్టుగా సొమ్ము చేతికి వస్తుంది. బంధుమిత్రులతో శుభకార్యాలోచనలు చేసి, వినోదములలో పాల్గొంటారు. వెండి, బియ్యము, నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు మంచికాలము. విద్యార్థులు చురుకుగా చదువుకుంటారు. 5,6 తేదీలలో కార్యనిర్వహణకు త్రిప్పట, ప్రయాసము. 7,8 తేదీలలో బంధుమిత్రుల కలయిక, శుభకార్యాలోచన, మృష్టాన్నభోజనము, వినోదము. 9 తేదీని అధిక ఖర్చులు, మనోవ్యథ. 10, 11 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము యోగప్రదముగా వుంటుంది. ధనాదాయము బాగుంటుంది. మీ పనులను చేసుకుంటూ, ఇతరులకు ఉపకారము చేస్తారు. కోర్టు వ్యవహారములు అనుకూలమవుతాయి. ఇంట్లో పాడి, పశు సంపద వృద్ధి అవుతాయి. బంగారము, వజ్రములు మొదలగు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. 5,6 తేదీలలో తీరుబడిలేని కార్యక్రమము, 7,8 తేదీలలో ధనలాభము. 9 వ తేది బంధువుల రాక, 10,11 తేదీలలో శుభ కార్యాలోచన, విందు, వినోదము, కార్యలాభము.

## —ధరలు:—

నూలు, వస్త్రములు : స్వల్పముగా పెరుగును.

బెల్లము, పంచదార: మార్పులేదు.

నూనెదినుసులు : మందముగా వుండును.

చింతపండు: స్వల్పముగా తగ్గును.

ఆహారధాన్యములు : మార్పులేదు.

పప్పు దినుసులు : మందముగా వుండును.

వెండి, బంగారము: స్వల్పభేదాలతో వుండును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వ్యాసుడను పేరునకు స్వాతియును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

## *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు ఏమంత యోగకాలము కాదు. కార్యభారము ఎక్కువ. తలపెట్టిన పనులకు ఆటంకాలు. అదనుకు డబ్బు రావందున ప్రతిదానికి ఇబ్బంది కలిగి గృహకలతలు ఏర్పడుతాయి. అకాలభోజనమువల్ల ఆరోగ్యము సరిగావుండదు. వెంటనే శ్రద్ధవహించండి. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు కలిగి వేధించినను బాధ్యత, ఆదాయము ఎక్కువవుతాయి. వర్తకులకు ఆదివిషయము వ్యాపారమువల్ల లాభము. విద్యార్థులకు చదువుమీద ఆసక్తి తక్కువ. 5,6 తేదీలలో కార్యభంగము, శ్రమ, అశాంతి. 7,8 తేదీలలో పితృవర్గ సహాయం. 9 వ అస్వస్థత. 10,11 తేదీలలో రాజకీయములలో వున్నవారికి లాభము.

## *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మొదట్లో ఏ పనిచేసిందికీ, ఎటూ నిర్ణయించుకోలేని ఆందోళన పొందు



# నక్షత్రఫలితాలు



కారు. అనుకున్న సౌమ్య సకాలములో చేతికి రాదు. అనుకోకుండా లటస్థపడిన స్నేహితుని సహాయమువల్ల వారాంతములో మీరు తలపెట్టిన పనులు ఫలిస్తాయి. వర్తకులకు నిరాశ కనబడినా లాభము వుంటుంది. 5, 6 తేదీలలో ఆర్థికలోపము, కార్యభంగము. 7, 8 తేదీలలో ప్రయాణము, మిత్రసహాయము. 9న ఇంట్లో వున్నవారి ఆరోగ్య భంగముచే అశాంతి. 10, 11 తేదీలలో క్రొత్తవారితో పరిచయము, అనవసర ఖర్చులు, విచిత్ర వస్తుసంపాదన.

## *జ్యేష్ఠ [నో, యా, యి, యూ]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. ధన లోపమువల్ల అనుకున్నట్టుగా పనులు జరగవు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. మీరు దైవాన్ని నమ్మి కార్యసాధనకు ప్రయత్నించినందున ఫలమును పొందుతారు. 5, 6 తేదీలలో వర్తకులకు ఆశాభంగము, 7, 8 తేదీలలో పుణ్యపురుషుల దర్శనము, శాంతి, కార్యలాభము. 9న ఇంట్లోవున్న ముసలివారి ఆరోగ్యము గురించి ఆందోళన. 10, 11 తేదీలలో ఉద్యోగస్థులకు మేలు. విద్యార్థులకు చదువుపై ఆశక్తి వున్నా క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు.

## *మూల [యే, యో, బా, బీ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారమువల్ల శ్రమ. కోర్టు వ్యవహారములు కొన్ని అనుకూలముగా పరిష్కారమైనా, మరికొన్ని క్రొత్తవి తలెత్తుతాయి. ఇచ్చి పుచ్చుకు నేపట్ల దుష్ట్రీలతో వివాదములువచ్చి మనోవ్యథ పొందుతారు. ఇంట్లో వుండే స్త్రీలలో ఒకరికి ఆరోగ్యము చెడే సూచన లున్నవి. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు జరగదు. వర్తకులకు శ్రమతో కూడిన లాభము. 5, 6 తేదీలలో కార్యభంగము. 7, 8 తేదీలలో కొంతవరకూ అనుకూలత. 9న వివాదము, ఆరోగ్యచింత. 10, 11 తేదీలలో తోటివారి సహకారముతో కార్యలాభము.

## పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢ]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా కార్యసాధనలో లాభముండదు. సాహసము, పట్టుదలగలవారగుటచేత ప్రయత్నములను విడువకుండా చిక్కులను విప్పుకొని ఫలము పొందుతారు. సహోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సద్దుకుంటాయి. యంత్రములవల్లగాని, వాడియైన పనిముట్లవల్లగాని కలిగే ప్రమాదము జాగ్రత్తగావుంటే తప్పవచ్చును. 5, 6 తేదీలలో కార్యభంగము, మనోవ్యథ. 7, 8 తేదీలలో సోదరసహాయము, కార్యలాభము. 9న ప్రమాదభయం. 10, 11 తేదిలలో శుభయోగము. భూస్వాములకు, గనుల యజమానులకు లాభము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీకు యోగదాయకము. గత మూడు వారములనుండి కలుగుచున్న ఆటంకములను మీ ప్రజ్ఞచే సాధించి ఫలమును పొందుతారు. ఆర్థిక చిక్కులుకూడా తీరుతాయి. అధికారుల ఆదరణ వుంటుంది. నూతన వ్యక్తుల పరిచయము కలుగుతుంది. దగ్గర బంధువుల క్షేమవార్త వింటారు. విద్యార్థులకు చదువు శ్రద్ధగా సాగుతుంది. డాక్టర్లకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. 5, 6 తేదీలలో కార్యసాధనకొరకు త్రిప్పట, శ్రమ. 7, 8 తేదీలలో శుభవార్త 9 తేదీని అలసట. 10, 11 తేదీలలో ధనలాభము, మిత్రలాభము, కార్యసిద్ధి.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము అసంపూర్తిగా నిలిచిపోయిన పనులు ఈ వారము లాభదాయకము ముగుస్తాయి. రాబడితోపాటు అధికారముకూడా పెరుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము. 5, 6 తేదీలలో త్రిప్పట, శ్రమ. 7, 8 తేదీలలో పిల్లలకు క్షేమాభివృద్ధి కలిగే కార్యక్రమము ఏర్పాటు, వర్తకులకు లాభము. 9న తేదీని అధికఖర్చులు. 10, 11 తేదీలలో ధనయోగము, కార్యసిద్ధి. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. పండిత గోష్ఠిలో పాల్గొంటారు.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీరు చేసే ప్రయత్నాలు అన్ని రంగములలోనూ తృప్తికరముగా సానుకూలమవుతవి. ఆర్థికస్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కలిసి, కవులతోనూ, గాయకులతోనూ వినోదిస్తారు. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుపడుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ కలుగుతుంది. వెండి, బియ్యము, నూలు, బట్టలవర్తకులకు లాభము. 5, 6 తేదీలలో కార్యములపట్ల త్రిప్పట. 7, 8 తేదిలలో ధనలాభము. 9న ప్రయాణము, శ్రమ. 10, 11 తేదీలలో బంధుదర్శనము, మృష్టాన్నభోజనము, వినోదము.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము మీ ఆదాయము పెరుగుతుంది. తలపెట్టిన పనులు నెరవేరుతవి. కవితాగోష్ఠిలో పాల్గొంటారు. దూరప్రయాణము చేయవలసి వస్తుంది. సాంఘిక కార్యము చేయుటచే కీర్తి పెరుగుతుంది. శుభకార్యాలోచనలు, బంధుమిత్రులతో విందు భోజనము జరుగుతవి. కవులకూ, గాయకులకూ, కళాకారులకూ, నటీనటులకూ మేలుకాలము. 5, 6 తేదీలలో త్రిప్పట, శ్రమ, అధిక ఖర్చులు, 7,8 తేదీలలో ధనలాభము, ప్రయాణము, కార్యసిద్ధి. 9 తేదిని ప్రయాసము. 10 11 తేదీలలో శుభకార్యాలోచన, విందు వినోదము. ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము.

## * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము ధనలోపమువల్ల ఏ కార్యము నెరవేరదు. త్రిప్పట ఎక్కువగుటచేత వేళతప్పిన భోజనమువల్ల ఆరోగ్యము చెడేసూచనలున్నవి. శ్రద్ధ వహించండి. ఉద్యోగస్థులకు ఆదాయాభివృద్ధితోపాటు బాధ్యతలుకూడా పెరుగుతాయి. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ కలుగుతుంది. 5,6 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, అధిక ఖర్చులు. 7, 8 తేదీలలో ప్రయాణము, రాజకీయవాదులకూ కార్యలాభము. 10,11 తేదీలలో గోధుమలు మొదలగు ఆహారధాన్యముల వర్తకులకు లాభము.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈ వారము ఏపని చేసిందికీ తోచదు. ప్రతిదీ కొన్నాళ్ళు పోతేగాని అయేటట్టు కనబడదు. కార్యాచరణలో శ్రమపడుతూ కూడా మాటపడవలసి వస్తుంది. అనుకున్న డబ్బు వేళకు అందదు. అయినా వారాంతమునకు ఎక్కువ హోదాలో వున్న స్నేహితుని సహాయమువల్ల మీ ప్రయత్నాలు కొన్ని ఫలిస్తాయి. విద్యార్థులకు మనస్సు చంచలముగా వుండి చదువు సాగదు. 5, 7 తేదీలలో నిలకడలేని స్థితి, ఆందోళన 7, 8 తేదీలలో ప్రయాణము, కార్యలాభము. 9న ఆరోగ్యచింత. 10, 11 తేదీలలో క్రొత్తవారితో పరిచయము, అనుకోని ఖర్చు, విచిత్రవస్తు సంపాదన.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. సహాయము చేస్తారని నమ్మిన వ్యక్తే మీకు ఆటంకములు కలుగజేస్తాడు. ఈశ్వరానుగ్రహమువల్ల అన్ని కష్టములు తీరుతాయనే నమ్మకముతో క్రమేణా అన్ని ఆటంకము తీరి మీకు కార్యసిద్ధి అవుతుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి, వ్యాపారస్థులకు నిరాశ. విద్యార్థులకు చదువుమీద అనాసక్తి. 5, 6 తేదీలలో ఆటంకములవల్ల అశాంతి. 7, 8 తేదీలలో సాధుసాంగత్యము, ఆత్మశాంతి. 9న ఆరోగ్యచింత. 10, 11 తేదీలలో అనుకోని లాభము.



# వనితా లోకం

**దేశదేశాల మహిళలు:** **ఉత్తరవియత్నాం**

# ఆడపిల్లకు చదువెందుకు?

ఆడపిల్లకి చదువెందుకు. దండుగ. చదవడం రాయటం తెలిస్తే ప్రేమలేఖలు రాసేస్తారు ఎవడో ఒకడికి! అంచేత ఆడదానికి అక్షరజ్ఞానం తగదు.

* * *

“పదిహేను ఇరవై ఏళ్ళ క్రితంవరకూ మా దేశంలో పెద్దల ధోరణి ఇది. అందువల్లనే, ఆనాటికి స్త్రీలలో నూటికి 99 గురు నిరక్షరకుక్షులుగా ఉండేవారు” అని వియత్నాం రిపబ్లిక్ (ఉత్తర వియత్నాం) మహిళా సంఘాధ్యక్షురాలు గుయెన్-తి-తాప్ ఇటీవల ఒక వ్యాసంలో పేర్కొన్నారు.

నూరు సంవత్సరాల బానిసత్వాన్ని నిర్మూలించడానికి డా॥ హోచిమిన్ నాయకత్వాన జరిగిన కృషి 1945 లో ఫలించింది. ఫ్రెంచి ప్రభుత్వం, ఈ విప్లవాన్ని అణగద్రొక్కడానికి శాయశక్తులా ప్రయత్నించింది. వియత్నాం ప్రజలు ఆ బాలగోపాలం సామ్రాజ్యవాదుల సైన్యాన్ని ప్రతిఘటించి 9 ఏళ్లు పోరాడారు. దానికి సమానాంతరంగానే వియత్నాంలో మహిళాజనవికాసానికి కృషి ఆరంభమైంది. ముసలివాళ్లుకూడా చదువుకుని మంచీ చెడ్డా స్వయంగా తెలుసుకొని వ్యవహరించాలన్న ఉత్సాహంతో ముందుకు వచ్చారు. ఆ సమరంలో స్త్రీలు అన్నిరంగాలలోనూ ప్రముఖపాత్రలు నిర్వహించారు. యుద్ధరంగానికి దగ్గరలో శత్రుశిబిరాలను అనుకొని ఉన్న పొలాలలో ఆనాడు వీరు పనిచేసి పంటపండించి బిడ్డలను పెంచారు. యుద్ధరంగంలోఉన్న భర్తలకు, అన్నదమ్ములకూ, కన్నబిడ్డలకూ అన్నవస్త్రాలు సరఫరా చేశారు. అడపాతడపా శత్రువులు తమ ఇళ్లమీదకు దండెత్తివచ్చినప్పుడు ఆయుధాలు చేతబట్టి ఆత్మరక్షణ చేసుకొన్నారు. గుయెన్-తి-చియెన్, మాక్-తి-బోయ్ వంటివారు వీరవనితలని పేరుతెచ్చుకొన్నారు

1954 జూలైలో శాంతి నెలకొన్నది

నాటినుండి, మహిళావికాసానికి, పెద్ద ఎత్తున కృషి ఆరంభమైంది స్త్రీలంతా అమితోత్సాహంతో విద్యాభ్యాసానికి ఉద్యుక్తులయ్యారు రాత్రి పాఠశాలలు విరివిగా ఏర్పాటయ్యాయి. 1956 మొదటి మూడు నెలలలోనే ఈ పాఠశాలలకు వెళ్లి చదువుకొన్న స్త్రీలు 8 లక్షలమంది ఉంటారని అంచనాలు దూరదూరంగా కొండచరియలలో చెల్లాచెదరుగాఉన్న పల్లెటూళ్ళ నుండికూడా స్త్రీలు జట్లుజట్లుగా బయలుదేరి కాగడాలు వెలిగించుకొని రెండుమూడు

(42-వ పేజీ చూడండి)



వియత్నాంలోని అల్పసంఖ్యాకవర్గాలలో ఒకజాతికి చెందిన యువతి

'చూడమ్మత్తలకు' ఒక చిన్న సూచన

# ★ నన్నా? ఆ! నన్నే? ★

## సి. సీతాదేవి

"నా గురించేనా ఈ వ్యాసం? ఆ. సందేహం లేదు నన్ను గురించే" అని అంటోంది మా చూడమ్మత్త.

లోకంలో అనేకరకాల వ్యక్తులుంటారు. అనేక సంఘటనలు మన జీవితాల్లో జరిగి అవి కథల్లో వ్యాసాలలో కనుపిస్తాయి. వాటినిచూచి నన్నేనట్రోయ్, నాగురించే వ్రాసేసింది, అని కొందరు అనుకుంటారు. కాని, చదువు సంస్కారమూలేనివారు ఎలా అనుకున్నా ఫరవాలేదు. కాని చదువూ, సంస్కారము కలిగి, కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములనే అరిషడ్వర్గముల జయించాలని ప్రతినిత్యము ఉపన్యాసము లిచ్చే పండితోత్తములూ, వాటిని జయించాలనే ప్రయత్నము చేసే విజ్ఞానులూ కూడా పామరులవలె ప్రవర్తిస్తారు. వారి నేమనాలి?

ఆ మధ్య ఒక విచిత్రం జరిగింది. సినీనటి భానుమతిగారు 'అత్తగారు - ఆచారాలు' అని ఆంధ్రపత్రికలో ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసములో చూడమ్మత్త అనే పేరుగల ఒకపాత్ర, సరీగా మా చూడమ్మత్తలాగానే ఉంది. ఆఖరికి పేరూ వరసాకూడా మా చూడమ్మత్త పేరే. ఆ వ్యాసంలో చూడమ్మత్త అవసరాన్ని బట్టి ఆచారాలు వదలీ వదలనట్లు కనబడకుండా సంచరిస్తుంది. ఆఖరికి పనివాడు, సంతర్పణకు వండిన పెద్ద అన్నం గుండిగను తాకితే దానికి తులసితీర్థముతో శుద్ధిచేసి, 'ఆహితాగ్నులందరిచేతా భుజింపచేస్తుంది'. మనవడికోసం ఉల్లిపాయ కూర స్వంతంగా తయారుచేస్తుంది. సరీగా మా చూడమ్మత్త అలాగే చేసింది. మేము ఉల్లిపాయలు తింటామని ఎగతాళి చేసి మమ్మల్ని తిననిచ్చేది కాదు. వండనిచ్చేదీ కాదు. మనవడికోసం ఇప్పుడు నిత్యమూ అదేకూర. మమ్మల్ని తురక రాజ్యంలో ఉన్నామని, వారియింటికి వెడితే వంట యింట్లోకి రానిచ్చేది కాదు. మేము త్రాగిన గ్లాసులు తోమినా నిప్పువేసి కాల్చినా ఆవిడ ముట్టుకునేది కాదు. మా చేతినీళ్లు త్రాగేది కాదు. ఆలాటి మా చూడమ్మత్త యిప్పుడు హైద్రాబాదులో 'తురకల' ఇంటిప్రక్కనే ఉంది. మనమడి ఉద్యోగం కోసము పల్లెటూరూ ఆచారాలు, దేముడూ మడీ అన్నీ సమర్పించుకొంది.

మా చూడమ్మత్తకి ఉన్న ఈగుణాలు అన్నీ అచ్చుగుద్దినట్లు వ్రాశారు భానుమతిగారు. పేరుకూడా అదేనాయె. దాంతో ఇక మా అత్తగారు కనబడ్డవాళ్లందరి దగ్గరా నన్ను దుమ్మెత్తిపోసిందిట. ఓరోజున నేను వాళ్ళ ఇంటికి వెళ్ళాను ఆమెని చూడాలని. నలుగురు స్నేహితులరాళ్లు నావెంటవచ్చారు. వాళ్ళముందర నన్ను నానామాటలు అంది. నేను పత్రికవిప్పి భానుమతి ఫోటో, వ్యాసకర్తపేరు చూపెట్టాను. కాని ఆవిడ నమ్మదే! "నువ్వే ఆవిడకి నాగురించి ఏదో ఉత్తరం వ్రాసి ఉంటావు దానిమీద ఆవిడ వ్యాసం రాసింది లేకపోతే నేను ఎవరో ఎరగనిఆవిడ నన్నుగురించి ఎలా రాసింది?" అంటుంది.

ఇలాటి అనుమానం మనుష్యులను ఏమనాలి? ఒకరకం మనుష్యులు ఒక్కరే ఉండరు. ఒకరంగు ఒక వస్తువకే ఉండదు. ఒకగుణం ఒక పదార్థానికే ఉండదు. ఒకే గుణంకల అనేక వస్తువులు ఉన్నట్లే ఒక వ్యక్తిగుణాలు అనేక వ్యక్తులకు ఉంటాయి. ఒకే స్వభావంకల వ్యక్తులు అనేకులు ఉంటారు. ఏదో లోకమునుగురించి చెప్పిన విషయాలు అన్నీ వ్యక్తిగతంగా తీసుకుని నన్నుగురించే చెప్పారు అని అనుకోవటం పొరపాటు. లోకంలో మంచీ చెడూ రెండూ ఉంటాయి. మంచికంటె చెడు త్వరగా గుర్తిస్తారు; గ్రహిస్తారు. మానవులు అసలు మంచి ఏదో చెడు ఏదో తెలుసుకోవటం చాలా కష్టం.

చెడ్డవాని మనస్సుకు అతను చేసే దుష్కార్యాలు మంచివిగా నేవుంటాయి కాని వాటిని ఎవరేనా విమర్శించి నప్పుడు నన్నే అంటున్నారు అని గ్రహిస్తాడు. తన్ని కాకపోయినా సందర్భానుసారం వచ్చినమాటలు తన్ని గురించే అంటాడు. అనుమానము ప్రతీమానవునిలోనూ ఉంటుంది. కాని నిష్పత్తిలో మాత్రం మనిషికీ మనిషికీ భేదం ఉంటుంది. ఒకడు భార్యని అనుమానిస్తాడు. ఒకడు మానవులనందర్నీ అనుమానిస్తాడు. ఒకడు ప్రతీ వాళ్ళు దొంగలనే అనుమానిస్తాడు. కొందరు తమర్ని అంతా ఏదో అంటున్నారనిఅనుమానిస్తారు. అందరిదీ మానవ స్వభావమే. కాని ఏ వ్యాసము చూచినా "నన్నేనట్రోయి రాసేశారు అంతా నాగురించే"నని ప్రచారం చేసుకోవడం వాళ్ళ తప్పులు వాళ్లు బైట వేసుకోవడమే అవుతుంది. "బుడంకాయల దొంగ అంటే బుజాలు తడువుకున్న"ట్లంటుంది. పైగా వ్రాసింది తమని గురించే అని వ్యాసకర్తలను నలుగురిలోనూ అవమాన పరచటం ఏమంత మంచిపనికాదు. మా అత్తగారిలాటివారు ఉంటే ఈ వ్యాసం ప్రత్యేకం తమని గురించి అని అపోహ పడవద్దు. ఇది లోకం పోకడ కాని వ్యక్తిగతం కాదు. ★

# చేతిరుమాళ్లకు డిజైన్లు



వీటికి ఈ క్రిందిప్రకారం దారాలు ఉపయోగిస్తే బాగుంటుంది.
1. ఎరుపు, 2. నీలం, 3. బూడిదరంగు, 4. ఆకుపచ్చ, 5. గులాబీ, 6. పసుపు, 7. నలుపు.

—వానంసెట్టి అన్నపూర్ణాదేవి, కాకినాడ.

# ★ కట్నాలజాలం! ★

**భగవత్కుమార్**

ఆంధ్ర శాసనసభలో వరకట్న నిషేధపు బిల్లు ప్రవేశపెట్టబడినప్పుడు సభ వారిలో కొందరు వ్యతిరేకించిన వారు కూడా వున్నారు. అయితే శాసనసభ్యుల్లో చాలా మందికి యీ బిల్లును అమలు జరపవలెననెడి పట్టుదల వుండటంచేత ఎక్కువ మెజారిటీతో గెలిచింది. ఈ విధంగా అందులోనూ యింత త్వరలో బిల్లు రావటానికి కృషి చేసిన కాశీశ్వరరావుగారు అభినందనీయులు. వారికి నేనే కాదు యావదాంధ్ర ప్రజలు అందులోనూ ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులు ఎక్కువ కృతజ్ఞులు. అయితే ఈ నిషేధం బిల్లు శాసనం కావటానికి స్త్రీలసహకారం కూడా ఎంతో వుంది. స్త్రీ జనాభ్యుదయశాఖవారు అనేక టెలిగ్రాములు పంపారు. మహజర్లు విన్నవించుకున్నారు. ఈ బిల్లు విజయానికి పూర్తి సహకార మిచ్చిన అమ్మన్నరాజాగారిని మరువలేము.

ప్రభుత్వపు పని ఎంతవరకంటే కేవలం శాసనం చేయటంవరకే. శాసన మయినంత మాత్రాన దాని ప్రయోజనం ఏముంది? అది ఆచరణలోనికి రావాలి. అంటే ప్రజావాహిని సహకరించాలి ప్రభుత్వంతో. ప్రజలు సహకరించినప్పుడే ఏ శాసనమైనా జయప్రదం కావటానికి వీలుంటుంది.

ఈ వరకట్న నిషేధమన్నది దేశంలో అందరి సహకారం సానుభూతి లభించినప్పుడే జయప్రద మవుతుంది. ప్రతి యువకుడూ కట్నం పుచ్చుకోనూ అని ముందుకు రావాలి. ప్రతి యువతీ మావాళ్ళు కట్నం ఇవ్వరు అనే అభ్యుదయభావం కలిగివుండాలి. ఇల్లాంటి అభిప్రాయం ప్రతీ వ్యక్తిలోనూ కలిగిననాడే శాసనం జయప్రద మౌతుంది. కట్నం ఇచ్చినవారికి శిక్ష, పుచ్చుకొన్నవారికి శిక్ష అని ప్రభుత్వం ప్రకటించింది.

అయితే యిలా శాసించినంత మాత్రాన ఏమీ మునిగిపోయిందిలేదు; ఇచ్చేవాళ్ళు ఇస్తున్నారు; పుచ్చుకునేవాళ్ళు పుచ్చుకుంటున్నారు. కట్నం యిచ్చారన్న విషయం పెళ్ళిలో ప్రకటించరు; పెండ్లికి ముందుగానే పుచ్చేసుకుంటారు గప్‌చిప్‌గా. 'అప్పుడు నీకు సాక్ష్యం ఎవడు కేసు పెట్టటానికి'— అని కొందరడగవచ్చును. దొంగచాటుగా పుచ్చుకొనేవాళ్ళను గురించి శాసనమే కాదు ఎవరూ ఏమీ చెయ్యలేరు. అటువంటి మహానుభావుల్ని సాధ్యమయినంతవరకూ సక్రమపథంవయిపు మళ్లించటమే చేయవలసినపని. అయితే ఇల్లాంటి చీకటి బజారుని ప్రభుత్వం కనుక్కొంటుందా అని ప్రశ్న. అంత తేలికగా ప్రభుత్వానికి చిక్కేదెవరు? అంతా గప్‌చుప్‌గా జరిగిపోతూంటేనూ అని అంటారు కొందరు. ఈ దురాచారాన్ని రూపుమాపటం అనేది ప్రభుత్వానికి సంబంధించినది కాదు. ప్రజల్లోనే మార్పు వచ్చి "ఛీ! కట్నం పుచ్చుకోకూడదు. దీనివల్ల ఎన్ని కుటుంబాలు నాశన మవుతున్నయ్! మనంకూడా ప్రభుత్వంతో సహకరించాలి—" అనే నూత్నభావం ప్రజల్లో కలగాలి. అప్పుడే ప్రజల్లో నైతికంగా మార్పువస్తుంది. నైతికపరివర్తనకు దూరదృష్టి చాలా అవసరము. కట్నాలు పుచ్చుకుంటే జైలుప్రాప్తి అని బెదిరించినా ఫలితం శూన్యమే. ఒకరిద్దరి నయితే జైలుకు పంపవచ్చును కాని అందరినీ జైలుకు పంపాలంటే ఇంకా క్రొత్త జైళ్ళను సృష్టించాలి. నైతికదృష్టి అంటే ఏమిటి? ప్రజల మనోభావాల్లో ఇది మంచి ఇది చెడుపూ అని ఎంచి చూసుకునే మార్పుకే నైతిక పరివర్తన అని పేరు. ఈ భావమే ప్రజలలో చొచ్చుకుపోతే ఇక కట్నం అనే ప్రసక్తే వుండదు.

నేను యీ మధ్య ఒక పార్కుకు వెళ్ళినపుడు చిన్న సంఘటన జరిగింది. ఇద్దరు వ్యక్తులు వరకట్న నిషేధాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు.

మొదటి వ్యక్తి: వరకట్న నిషేధ చట్టం వొచ్చిందోయ్. ఇక మీ అబ్బాయిలకు కట్నం రాదు!

రెండవవ్యక్తి: ప్రభుత్వ శాసనం కాగానే సరిపోయిందటోయ్. కట్నం పెళ్ళికి ముందుగా తీసుకుంటాం. పెళ్ళిలో చదివించడంవుండదు. అంతా గప్ చుప్!

మొదటి వ్యక్తి: అరిపిడుగా! ఎంత ఆలోచన చేశావోయ్! వరకట్న నిషేధ చట్టం వచ్చింది కదా ఇక నా నలుగురమ్మాయిలకూ కాని ఖర్చు లేకుండా పెళ్ళి చెయ్యొచ్చునుకుంటే పెద్ద ఎత్తే వేశావే. ఇల్లా చీకటి బజారు ప్రబలితే నే నెక్కడ తెచ్చేదయ్యా వేలూ...!

ఆ మాటలు వింటుంటే నాకు ముళ్ళమీద కూర్చున్నట్లే వుంది. ఎంత కోపం వచ్చినా ఆయన పెద్దమనిషి కావటంవల్ల మందలించ లేకపోయాను. మరి యిటువంటి వాళ్ళను గురించి ఏమనాలి చెప్పండీ?

పురుషుడిమనస్సుకంటె స్త్రీమనసు చాలా సున్నితమైంది. అందుకని పురుషుడి మనసుని శిలతోనూ స్త్రీ మనసును వెన్నతోనూ పోల్చారు కవులు. స్త్రీ కష్టాల్ని సహిస్తుంది. ఇతరుల సుఖం కోసం స్వసుఖాన్ని వదులుకొని పురుషుడి కోసం, పిల్లల కోసం త్యాగం చేస్తుంది. ఇదే స్త్రీలో వున్న మహత్తర త్యాగము. ఈ విషయాన్ని సరిగ్గా అవగాహన చేసుకొని కొందరు యువకులు మామగారు సరిగ్గా లాంఛనాలు ఇవ్వలేదనే నెపంగానో, కట్నం సగమే ఇచ్చారనే నెపం కల్పించి పెళ్లాం మీద కస్సుబుస్సులాడుతూ పెత్తనం సాగిస్తుంటారు.

ఒక అబ్బాయి ఒక అమ్మాయిని ప్రేమించి కట్నం పుచ్చుకోకుండా చేసుకున్నాడనేగా కోపం! అందుకని కోడల్ని మాటిమాటికీ కష్టపెడుతూ సూటిపోటుమాటలనటం ఆ అత్తమామలకే చెల్లింది. భర్తకోసం ఎంత త్యాగంచేసినా అత్తమామలు సరిగా చూడకపోతే ఏ యువతి మనసయినా కష్టపడుతుంది. కట్నం ఎక్కువతెస్తే కోడల్ని గౌరవించేటట్లు కట్నం లేకపోతే అగౌరవించేటట్లూనా! ఇటువంటి మనస్తత్వం కల అత్తలూ మామలూ ఎంత శీఘ్రంగా మారిపోతే అంత శ్రేయస్సు!

కాని ఇంకోకోవకు చెందిన వ్యక్తులున్నారు.

"మా అబ్బాయిని బి. ఎ. వరకూ అప్పులపాలై చెప్పించాము. కట్నం తీసుకోకపోతే అప్పుతీరేదెట్లా!" అంటారు కొందరు.

"నాకు ఇద్దరాడపిల్లలు. అబ్బాయిలకు కట్నంపుచ్చుకోకపోతే మరి ఆడపిల్లల పెళ్ళిళ్లు చేసేదెలా!" అంటారు మరికొందరు.

అందుకనీ మగపిల్లవాండ్రతోపాటు ఆడపిల్లలకు కూడా చదువుచెప్పిస్తే అసలు యీ ప్రశ్నవచ్చే అవకాశమేవుండదు.

స్త్రీలను ఎప్పుడూ కూపస్తమండూకముల వలె వుంచకూడదు. చదువూ సంస్కృతీ అవసరము. స్త్రీ బాగా చదువుకోగలిగిననాడే ప్రపంచంలో పరిస్థితులను అర్థం చేసుకుంటుంది. అంతే కాని కన్నెచెర వదిలించు

మధ్యప్రదేశ్ లోని బస్తరు సంతలో ఒక దృశ్యం
—ఫోటో గాదె శేషగిరిరావు, రాజమండ్రి

వుందువ ఏ దిక్కూ మాలినవాడికో కట్టబెడితే తరవాతగతి ఏమిటి! స్త్రీలూ పురుషులూ ఇద్దరూ విజ్ఞానవంతులయితే ఇద్దరిలోనూ ఆదర్శభావా లున్నట్లయిన, అప్పుడు యువకుడు కూడా యువతిలో ఆదర్శభావాల్ని ఎంచిచూస్తాడు స్త్రీ పురుషుల భావాలు రెండూ ఏకమైనపుడు, భిన్న భిన్న భావాలు తొలగిపోయి ఇద్దరూ ఒకే ఒక మార్గంలోకి వచ్చినపుడు ఇక కట్నం అనే ప్రసక్తే వుండదు

కొంతమంది కట్నం పుచ్చుకోవటం ఆచారం అంటారు ఏ శాస్త్రంలోవుంది ఆచారం?

'మురిరాసులు' అనే వెనుకబడిన తెగలో 'ఓలి' ఇచ్చుకోవటం అనే ఆచారంవుంది ఓలి అంటే పెళ్ళికిముందు పిల్లవాడి తరఫువాళ్ళు పిల్లతరఫువారికి కొంత డబ్బు ముట్టచెప్పడం—కాని ఇప్పుడు అది వ్యతిరేకమయింది

మా ఆఫీసులో టైపిస్టుగా ఒక అమ్మాయి పనిచేస్తూంది ఆ అమ్మాయి ఎలాగో ఎస్ ఎస్ ఎల్ సి వరకూ చదువుకుందట ఇంకా పైచదువు చెప్పించటానికి తల్లిదండ్రులు ఇష్టపడలేదట ఎందుకంటే పెద్దచదువులు చదివితే పెద్దగా చదువుకున్నవాడు కావాలంటే, మళ్ళీ ధస్తామని చదువు మాన్పించి సంబంధాలకోసం తిరిగారు కాని వేలకువేలు ప్రతిధ్వనిస్తున్న యీ కాలంలో కట్నం ఎక్కడనుంచి తేవటం! ఎక్కడా కట్నం తక్కువలో దొరకలేదు అందుకని బలవంతంచేసి ఆ అమ్మాయిని ఓ ముసలాడికి కట్టేశారు ఫలితం! ముసలాడు కాస్తా గుటుక్కుమన్నాడు ఇప్పుడా అమ్మాయి కోర్కెలకు నీళ్ళొదులుకొని టైపిస్టయింది

ఇలాంటి పై సంఘటనలు తరుచూ సంభవిస్తూనే వుంటాయి ఐతే వాటిని అరికటటం ఎల్లాగూ అన్నదే ప్రశ్న

ప్రభుత్వం కేవలం శాసనం చెయ్యటం వరకే అమలూ, ఆచరణా అంతా ప్రజలదే

ఈ కట్నజాలానికి చెదలుపట్టాలంటే ఆ జాలాన్ని కల్పించిన వారి మనోభావాల్లోనూ, అలవాట్లలోనూ, ఆచార వ్యవహారాల్లోనూ మార్పు రావడం ఎంతయినా అవసరము ఈ మార్పు ప్రతీ మనుష్యుని మనస్సులోనూ కలిగిననాడే యీచట్టం జయప్రదం కావటానికి అవకాశం కలుగుతుంది

కట్నాలవల్ల కలిగే ఘోరాలను మనం నిత్యం అనేకము చూస్తున్నాము కూతుండ్ర పెండ్లికోసరము కొంపా గోపు లమ్ముకొని అప్పులపాలయినవాళ్ళనేకు లున్నారు

మా అబ్బాయికి కట్నం పుచ్చుకోము మా అమ్మాయికి కట్నం ఇవ్వము అనే భావమూ పట్టుదల ప్రజల హృదయాల్లో కలగాలి అయితే యీ పరివర్తన అనేది ఎప్పుడు వస్తుందీ అనేదే ప్రశ్న పురుషులతోపాటు స్త్రీలు కూడా విద్య నేర్చుకోవాలి స్త్రీ విద్యావ్యాప్తివల్ల కట్నాల జాలం తొలగిపోవచ్చును



## గృహవైద్యం:

# ★ నాలుకపూత, పగుళ్లకు ★

శీతాకాలంలో నాలుక పూస్తుంది. పెదాలు కూడా పగుల్తాయి. ఒక్క శీతలంవల్లనే కాకుండా శరీరంలో అధికమైన వేడి ఉండి అదిగాని పొంగిందంటే కూడా నాలుక పూస్తుంది. గొంతులో కూడా మంటగా వుంటుంది. ఏది తిన్నా కారంగా వుండి చాలా అవస్థపెడ్తుంది. ఒక్కొక్కసారి నాలుక పగులుతుంది కూడా.

ఏదో కొద్దిగా పూసివుంటే వుదయాన్నే దంతధావనం కాగానే ఎండుకొబ్బరి ముక్కలు గసగసాలను నోట్లో వేసుకొని బాగా నమిలి వానిరసం మింగాలి. కొద్దిగా నాలుక పూసివుంటే ఈ విధంగా రెండు రోజులు చేయగానే పోతుంది.

కొంచెం ఎక్కువగా నాలుక పూసిన వారికి ఈ వైద్యం పనిచేయదు. అందువల్ల ఓ నాలుగు బాదం పప్పులు, కొద్దిగా గసగసాలు నూరుకోవాలి. ఆ నూరిన ముద్దను కొద్దిగా పాలలో (ఆవు పాలు లేదా బర్రె పాలు) కలపాలి. దీన్ని ఉదయం, సాయంత్రం త్రాగితే నోటిపూత తగ్గుతుంది. కొత్త నోటికి పుళ్ళు పట్టినట్లయితే, వేయించిన బియ్యాన్ని సన్నసూకగా విసిరి దానితో జల్లుగా జావకాయాలి. ఈ జావలో పాలను బాదంపప్పు గసగసాల నూరినముద్దని కలిపి త్రాగవచ్చు. పైరెండుపరిస్థితులకన్నా మించి పోయి నాలుక బద్దలుబద్దలుగా పగిలి ఎర్రగా పూసివుంటుంది. అటువంటివారు త్వరగా తగ్గాలనుకొంటే ఒకపనిచేయాలి. పత్తిఆకు లేతది తీసుకొనిరావాలి. 'కాసినకూర' అని అమ్ముతారు. బహుశా ఈ కూరను అన్ని ప్రాంతాలవారు ఒకేపేరుతో పిలుస్తారను కుంటాను. ఆ కాసినకూరను, పత్తి ఆకును కొద్దిగా నీళ్ళల్లోవేసి బాగాకాచాలి. సల సల కాగినతర్వాత దించి కొంచెం గోరు వెచ్చగానే పుక్కిలించాలి. అంతే గాని కడుపులోకి త్రాగకూడదు. బాగా రోజుకు నాలుగు లేక ఐదు సార్లు పుక్కిలిస్తే నోటి పూత తగ్గిపోతుంది. ఇదిచాలాగుణమిస్తుంది. పూర్తిగా పుక్కిలించాక నాలుకకు కొత్త వెన్నరాస్తే చల్లగాబాగుంటుంది.

పై వైద్యం చేసినాక నాలుకపూతచాలా వరకుతగ్గుతుంది. పూర్తిగా పోయినతర్వాత, నామమును (ముఖంపెట్టుకొనే నామం) ఒకనీటిచుక్కలో అరగదీసి నాలుకకుపూస్తే దుర్నీరంతా కారిపోయి మాటిమాటికీ నాలుకపూయదు. నాలుక పూయకుండానే వుండాలి గానీ పూసిందంటే చాలా అవస్థ పెడ్తుంది. ★

—వి. అనసూయ, నెల్లూరు.

* * *

## ధన్యవాదాలు

శ్రీమతి నందూరి రాజ్యలక్ష్మిగారు రాసిన 'కిశోరజనుల సంరక్షణ' అన్న వ్యాసము చదివాను. చాలా బాగుంది. ఆమె చెప్పినట్లే మా అమ్మాయికి చాలా సార్లు కుదుళ్ళకు బాగా నూనెరాయమని చెప్పేదాన్ని కాని ఆమె వినేదికాదు. పై పైన రాసుకొని దువ్వుకొనేది. కాని ఈవ్యాసం అతి ఉత్సాహముతో చదివి, దాన్ని ఆచరిస్తోంది. దానివల్ల ఆమెజుట్టు ఊడటం తగ్గి చక్కగా పెరుగుతున్నది. నేను చెప్పినది వినకపోయినా పుస్తకంలో చూసైనా నేర్చుకుంటున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. ఈ వ్యాసం రాసినవారికి నా హృదయపూర్వక అభినందనములు 'ఆంధ్ర వారపత్రిక' ద్వారా తెలియ పరుస్తున్నాను. ఇటువంటి వ్యాసములు ఇంకా 'వనితాలోకం'లో రాస్తారని ఆశిస్తున్నాను.

—వి. సూర్యబంగారమ్మ, శ్రీకాకుళం. ★




## ప్రశ్నకి జవాబు

"సుగాత్రి" గారు రచించిన ఆంధ్రపత్రిక వారపత్రిక (తే 12-2-58) యందలి "ఆధునిక ఇల్లాళ్లు-అనాచారాలు" అన్న వ్యాసం నన్నాకర్షించింది. ఆసాంతం చదివేవరకు వదల బుద్ధేయలేదు. ఆధునిక గృహిణుల అనాచారాలను యధాతథంగా రచించారు. శుభ్రమయిన దుస్తులు ధరించితే చాలదా! మడియంటూ ఆచారాన్ని పెట్టి తాతలతరాల నించి ఉంటూన్న నారవస్త్రాలను కట్టుకుంటూ అవి ఎంత అసహ్యంగా యుంటూన్నా పవిత్రంగా ధరిస్తూ వుంటారు పూర్వ సువాసినులు కొందరు. "నేనోసారి మా మామ్మను దాన్నిగురించి అడిగాను. ఆమె మండిపడి చీవాట్లు పెట్టింది. "గుడ్డొచ్చి పిల్ల వెక్కిరించిందట. మా కాలంలో యీ స్నోలు, పౌడర్లు, సిల్కులూ యివంతా మేమెరగమమ్మా. యీ కులుకులు యీ తళుకులు మాకు తెలిస్తేగా?" అంటూ తిన్నబోయింది. ఇట్లా వుంటాయి వాళ్లమాటలు. ఏమన్నా అంటే మేం పెద్దలం అంటూ పైకొస్తారు.

—కేవూరు రాధ, నెల్లూరు.]

* * *

## అనవసరమైన వెందుకు?

ఫిబ్రవరి 19-వ తేదీ పత్రికలో కుమారి పుష్పగారు వ్రాసిన "బహుదూరపు బాటసారి" వ్యాసంలో ఆమె తన స్నేహితురాండ్రు మగవాళ్ళతో జరిపిన పాటల పోటీ గురించి ఎందుకు వ్రాశారో అర్థంకాకుండా వుంది. వనితాలోకం శీర్షికలో స్త్రీలకు విజ్ఞానం, కలిగించే వ్యాసాలు వ్రాస్తే బాగుంటుంది. కానీ అనవసరమయిన సందర్భాలతో అవసరం లేని వ్యాసాలతో మన శీర్షికను అనవసరం చెయడంకన్నా స్త్రీలకు పనికివచ్చే వ్యాసాలను వ్రాస్తే బాగుంటుంది అని మనవి.

—సి. ఇందిరాశైలం, నిజామాబాద్.]

* * *

## అరుదు

లీలావతిగారు వ్రాసిన 'సిగ్గు-సింగారము' అను వ్యాసం బాగుంది. స్వభావికంగానే వర్ణించారు. నామటుకు నాకు పొద్దస్తమానం సిగ్గుపడే వారిని చూస్తే మహా చిరాకేస్తుంది. భోంచేయమంటే సిగ్గు, కూచోడం సిగ్గు, నిల్చోడం సిగ్గే వీరికి. వీరితో మాటాడ్డం మహాకష్టము. కొందరికి మాటాడ్డము రావనుకుంటా, చాల సిగ్గుపడతారు మాటాడేందుకు. వీరిని మనమై 'ఏమండి' అంటే—'ఏమండి' అంటారు. చాలా ముభావంగా ఉండే మనుషులన్నమాట. ఇటువంటి వారిని దగర కూచోబెట్టుకుని మాట్లాడుతూ ఉంటే వీరుకూడ మాటాడ్డం నేర్చుకుంటారంటారు లీలావతిగారు. ఈ ఫలితం ఎక్కడో బహు అరుదుగా కనుపిస్తుంది.

—కే. కుమారి, కశేకల్లు.]

* * *

## అవును...మరి!!

"నల్లనివాళ్ళంటే ఎందుకంత హేళన!" అనే వ్యాసం బాగుంది. నిజమే మరి! నల్లటి పిల్లలంటేనే ఓ విధమైన హీనభావాన్ని చూపిస్తారు, కొంతమంది. ఎరుపు ఎన్ని వంకలయినా తీరుస్తుందనే భావం అనేకమందికి. కన్ను, ముక్కు తీరుగా లేకపోయినా, తెల్లటి పాలిపోయిన ముఖాలు అందంగా వున్నట్లు కనిపిస్తాయి చాలమందికి. కాదూ...మరి!...ఉత్తరగారు వ్రాసినట్లు తాము నల్లగావున్నా, తమకు వచ్చే వాళ్ళు తెలగా, అందంగా—వుండాలని కోరుతారు. ఇది చదువుతుంటే మా ఫ్రెండు జ్ఞాపకానికి వచ్చింది. తన పెండ్లివిషయంలో ఇరవైమంది పెండ్లికొడుకులను తెల్లగా లేరనే కారణంగా చేసుకోనని నిక్కచ్చిగా చెప్పిందట, పెద్దవాళ్ళకు."

ఏమైనా నల్లగా వున్నంతమాత్రాన అందవిహీనులుగా భావించటం ఏమిటి? "బాగుండటం" అనేది కేవలం 'తెలుపు - నలుపు' శరీర ఛాయమీద ఆధారపడి వుండదని మనకందరికీ తెలుసు. అందాన్ని కోరి గౌరవించవచ్చుగాని కేవలం ఎర్రగా వుండాలని ప్రాకులాడటం - తెలివితక్కువతనం క్రిందికే వస్తుంది.

## వనితావాణి

పల్లెటివాళ్ళను గురించి వ్రాసిన ఉత్తర గారికి నా అభివందనాలు. బాహ్య సౌందర్యం కన్న అంతర్ సౌందర్యమే ప్రధానం.

—కుమారి జి.ఎస్.వాణి, ఏలూరు]

* * *

## నిజం

"ఆంధ్ర సచిత్రవారపత్రిక (జనవరి 8) లో, నండూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన, "పిల్లలూ-పెంపకము." అను వ్యాసం చాలా బాగుంది. ఆ వ్యాసంలోని ప్రతి విషయమూ నూటికి నూరుపాళ్ళు నిజం.

పిల్లలపెంపకం విషయంలో తల్లితండ్రుల కున కర్తవ్యాలను చాలాబాగుగా వివరించారు. ఆ రచయిత్రికి నా అభివందనాలు."

—ఎ. అనంతలక్ష్మి, నంద్యాల.]

## ఆడపిల్లలకు చదువెందుకు?

(35వ పేజీ తరువాయి)

మైళ్ళదూరం నడచి వెళ్ళివచ్చేవారు.

పూర్వం, ఈ సీమ ఫ్రెంచి వలసగా ఉన్నపుడు, విద్య నేర్చే అదృష్టం ఈ అవకాశం లేకపోయింది. లక్షాధికారుల ఇంటిపడుచులు కొద్దిమంది బడికి వెళ్లేవారు. బహులా బహు కొద్దిగా ఉండేవి. విశ్వవిద్యాలయందాకా వెళ్ళిన వాళ్ళని వేళ్ళమీద లెక్క పెట్టవచ్చును. నాటికీ నేటికీ తేడా, బేరీజు వేసి చూస్తే ఇపుడు చదువుకుంటున్న ఆడపిల్లల సంఖ్య, అప్పటికన్న యాభైరెట్లు ఎక్కువ అని తేలింది.

నిర్మాణ కార్యక్రమాలలో కూడా ఈనాడు స్త్రీలు బహుళంగా పని చేస్తున్నారు. యుద్ధంవల్ల ధ్వంసమైన కట్టడాలన్నిటినీ ఇపుడు తిరిగి నిర్మిస్తున్నారు. రైల్వేలు, ఆనకట్టలు, ఫ్యాక్టరీలు మొదలైనవన్నీ నిర్మించడంలో అన్నివిధాలా పురుషులకు ఉజ్జీగా నిలబడి వీరు పనిచేసి తమ అజ్ఞాత ప్రజ్ఞని ప్రదర్శిస్తున్నారు. రైలు మార్గాల నిర్మాణంలో నే 33,81,536 రోజుల పని స్త్రీల చేతిమీదుగా జరిగింది.

సాంగ్ - కా నదిమీద పనిచేసే వారిలో నూటికి 80 మంది మహిళలే. ప్రభుత్వాధ్వర్యాన నడిచే ఒక పేపరు మిల్లులో ద్-తి-వాన్ అనే మహిళ, ఉత్పత్తిని పెంచడానికి ఒక కొత్త పద్ధతి కనిపెట్టింది. ఆ పద్ధతి అవలంబించిన ఏ పరిశ్రమలోనైనా, ఉత్పత్తి మామూలు కన్న హీనపక్షం నూటికి 80 వంతులు పెరుగుతుందట. అనేక పరిశ్రమలలో కార్యాలయాలలో ఎందరో స్త్రీలు, ఇంజనీర్లుగాను, ఆఫీసు మానేజర్లుగాను పని చేస్తున్నారు. జీతభత్యాలు పురుషులతో సమానంగానే, పనినిబట్టి పుచ్చుకుంటారు. వైద్యరంగంలో ఈనాడు 1122 మంది స్త్రీలు వివిధ కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు. వీరిలో వైద్యులు 108 మంది ఉన్నారు.

ఇక రాజకీయరంగంలో కూడా వీరు సముచిత ప్రాతినిధ్యం సంపాదించుకున్నారు. శాసనసభలో పదిమంది మహిళలున్నారు. గ్రామపాలక సంఘాలలో 2235 మంది సభ్యులుగా ఉన్నారు. కనిహాన్, విన్-ఫూ, హోనాం రాష్ట్రాలలోనే వివిధ సంఘాలకు అధ్యక్ష ఉపాధ్యక్ష పదవులను నిర్వహిస్తున్న స్త్రీలు 167 మంది ఉన్నారు.

ఇలాగే అన్ని రంగాలలోనూ వియత్నాం మహిళలు ముందడుగు వేసి, దేశ పునర్నిర్మాణ కార్యక్రమంలో పురుషులకు తాము ఏవిధంగాను తీసిపోరని నిరూపిస్తూ, దేశాభ్యున్నతికి పనిచేస్తున్నారు. ★

(విమెన్ ఆనది మార్చ్' సౌజన్యంతో)




# ★ 'పెద్దమ్మ కొడుకు' ★

పూర్వ మొక నియోగి మంత్రి
పుణ్యాత్ముం డుండువాడు;
అత డన్నదాత యనెడు
ఖ్యాతిగన్న ధర్మాత్ముడు.

వందలాది విప్రవరులు
వచ్చి అతని పంక్తియందు
కూరుచుండి భుజియింతురు
కూరిమిగల బంధువులై.

ఎవ్వారలు తనతోడుత
ఎన్ని ఎన్ని నాళ్ళ నుండి
భుజియించుచు నున్నారలొ
పూర్తిగాగ నత డెఱుగడు.

తనదు పంక్తి రెండు పూట్ల
కనిపించెడి ఒక విప్రుని
ముఖ పరిచయ మగుటవలన
మోమోడుచు నిట్లనియెను.

"ఓ స్వామీ! మీ రెవ్వరు?
ఊ రెయ్యది చెప్పు"డన్న
"అయ్యా! మీ పెద్దమ్మకు
అనుగు సుతుని నన్నెఱుగర?"

"అయ్యయ్యో! మా తల్లికి
అక్కగారు లేన లేరు
లేకున్నను నీ వెట్టులు
మాకు బంధు వయితొ చెపుమ!"

అపుడు విప్రు డిట్లనియెను:
"అయ్యా! తమ రమాత్యపదవి
నందుటచే మరచినారు,
బంధుగులగు మమ్ముగూడ.

"మా యమ్మకు చెల్లియలగు
మీ యమ్మ; మహానుభావ!
శ్రీ లక్ష్మి పుత్రుండవు
చిన్నావిడ కొమరుండవు.

మీ తల్లికి గల చిన్నెలు
మీ కడ గనబడుచున్నవి;
నా తల్లికి గల చిన్నెలు
నా కడ గనబడుచున్నవి.

పెద్దమ్మకు సుతుడనేను,
పిన్నమ్మకు సుతుడ వీవు;
కావున మన మిరువురమును
ఈ విధముగ సోదరులము.

మీకు అన్న నగుటచేత
నాకేదైన ఉపాధిని
కలుగజేయవలయు"నంచు
పలికె పేద బ్రాహ్మణుండు.

మంత్రిగారు నవ్వుకొనుచు
'మంచి అన్న దొరకె'నంచు
కొలువులోన అతని కొక
గొప్ప పదవి నప్పగించె. ★

★ ఉత్పల ★

# తాత చేసిన మేలు

శివయ్య ఒంటరిమనిషి. ఇంట్లో ఎవ్వరూ లేరు. హోటలులో భోజనంచేసి ఇంట్లోవచ్చి పడుకుంటాడు. ఇల్లు కొంచం పెద్దదే. అంత ఇంట్లో అతనొక్కడే వుండాలి. ఒక్కడే పడుకుంటే దిగులుగా వుంటుంది. అప్పుడప్పుడూ భయమేస్తుంటుంది కూడాను. అయితే ఏంచేయడం? ఏంచేయడానికీలేదు! శివయ్య ఆ వూరికి కొత్తగావచ్చి ఉద్యోగంలో ప్రవేశించాడు. రాత్రిళ్లు కొంతసేపు కబుర్లు చెప్పడానికిగానీ, ధైర్యం చెప్పడానికిగానీ ఎవరూ స్నేహితులు లేరు.

ఆ యింటికి ముందు వీధి ప్రక్కగా మంచి విశాలమైన అరుగుంది. అరుగుమీద కప్పుంది. శివయ్య పడుకొనే గది ఈ అరుగు ప్రక్కనేవుంది. వీధికేసి ఆ గదికి పెద్ద కిటికీవుంది. అందువల్ల, గాలీ, వెలుగూ ఆ గదిలోకి విస్తారంగా వస్తాయి. అయితే రాత్రిపూట ఈ కిటికీ వుండటమే భయంగావుంటుంది శివయ్యకు. కిటికీ మూసేస్తే గాలి రాదు. ఉక్కపోస్తుంది. తెరిస్తే, ఎవరైనా రాళ్లు విసురుతారేమో. దొంగలు కిటికీ బ్రద్దలుకొట్టి లోపల ప్రవేశిస్తారేమో.

వీధరుగుమీద రాత్రిళ్లు ఒక ముసలాయనవచ్చి పడుకొంటాడు. రెండు రోజులు పోనీలే అని వూరుకొన్నాడు శివయ్య. ఆ తాత మరీ ముసలివాడు కాదు. మంచి బలంగానే వున్నాడు. ఇప్పటికీ పగలంతా ఎక్కడో ఓ చోట ఏదేనా పని చేసి తన పొట్ట తాను పోషించుకుంటూనే వున్నాడు.

శివయ్యకు తాతను చూస్తే భయం. అర్ధరాత్రి లేచి ఆ తాతే, ఆ కిటికీ బ్రద్దలు కొట్టి లోపల దూరితే...ఏం గతి? తన ట్వీడ్ సూట్లు, రిస్టువాచీ, ఇంకా విలువగల వస్తువులు, ఖర్చులకుంచుకొన్న డబ్బు ఒక్కసారిగా పోతే ఏం గతి, అనుకొన్నాడు శివయ్య.

**రాజేంద్ర**

తాతను నాలుగు మాటలని ఇకమీదట ఇక్కడ పడుకోరాదని చెప్పాడు. తాత వినలేదు. తాత ఆ అరుగు మీద ఎన్నో ఏళ్ళనుంచీ పడుకొంటున్నాడు. ఇదివరకు ఎవరూ వద్దనలేదు. ఇప్పుడీ అబ్బాయి పొమ్మంటే ఎందుకు పోవడం. రెండు రోజులు చెప్పి, అతనే ఊరుకుంటాడులే అనుకొన్నాడు.

కానీ శివయ్య వూరుకోలేదు. రోజూ తిడ్తూనే వున్నాడు. ఒకరోజు రాత్రి గట్టిగా మందలించాడు. "ఇక్కణ్నుంచి కదలక పోయావంటే తన్ని తగిలేస్తా"నని బెదిరించాడు. తన్నడానికి దగ్గరకొచ్చాడు కూడాను. తాత విసిగి పోయాడు.

"ఇక్కడ పడుకుంటే మీకేం నష్టంబాబూ. నేనిక్కడున్నానంటే ఇంకా మీకేలాభం. మీ యింటి కాపలాదారులాగా వుంటాను. ఏ దొంగా ఇటు ప్రక్క రాడు" అన్నాడు తాత.

"నువ్వుండగా వేరే దొంగ లెవరొస్తారు" అన్నాడు శివయ్య.

తాతకు కోపమొచ్చి వెళ్ళిపోయాడు. వెళ్ళినవాడు దూరంగా ఎక్కడికో వెళ్ళిపోలేదు. ఎదురింటి అరుగుమీద పడుకొన్నాడు. ఆ అరుగుమీద కప్పులేదు. మంచు కురుస్తుంది. వర్షమొస్తే...... చాల కష్టం. అయినా సరే తాత అక్కడే పడుకొన్నాడు. వేరే దారిలేదు మరి.

తాతకు అర్ధరాత్రి మెలకువొచ్చింది. ఎదురింటికేసి చూశాడు. శివయ్య పడుకొనే గది కిటికీ కమ్ముల్ని ఎవరో రంపంతో కోసేస్తున్నారు. అప్పుడే ఒక ఊచను కోసేశారు. ఇంకోటి కోసేసి మనిషి లోపల దూరేస్తాడు.

'పాపం ఆ అబ్బాయి మంచివాడే. చూడగానే మంచివాడిలా కనిపిస్తాడు. ఆ దొంగ ఆ అబ్బాయిని ఏం చేసినా చేయొచ్చు. పాపమా అబ్బాయి చాల అందంగా వున్నాడు. ఎక్క-



పట్టపుటేనుగు
చిత్రకారుడు: కె. కృష్ణారావు—ఏలూరు.

కైనా చిన్న దెబ్బ తగిలితే, అందం పోతుంది. పాపం వాళ్ళ అమ్మ, నాన్నా ఏడవరా......'

తాత లేచాడు. తన ఊతకఱ్ఱ తీసుకొన్నాడు. మెల్లగా నడుచుకొంటూ వెళ్ళాడు. వెనకనే వెళ్ళి వెనకనుంచే దొంగ బుఱ్ఱ మీద ఒకటిచ్చాడు. దొంగ 'అమ్మో' అని కేకవేసి క్రిందపడి పోయాడు. శివయ్య మేల్కొన్నాడు. లైట్ వేశాడు. అరుగు మీద లైట్ వేశాడు. కిటికీ గుండా చూశాడు. ఒక మనిషి క్రిందపడి వున్నాడు తాతచేతిలో కఱ్ఱ వుంది. తాత శివయ్య కేసి నవ్వుతూ చూశాడు శివయ్య తలుపు తీసుకొని అరుగు మీదికొచ్చాడు. శివయ్యకు అంతా అర్థమైంది.

"తాతా, వీడు దొంగేనా! కొట్టావా. క్రిందపడి లేవడం లేదు. చచ్చిపోయాడేమో చూడు" అన్నాడు గాభరాగా...

"లేదు చావలేదు. మూర్ఛపోయినట్లున్నాడు. ఒక గ్లాసునీళ్లు తీసుకురండి బాబూ" అన్నాడు. శివయ్య లోపలికి వెళ్ళాడు.

దొంగ మేలుకొన్నాడు.

ఇటూ అటూ చూసి టక్ మని లేచి పరుగు పుచ్చుకొన్నాడు. శివయ్య వచ్చేసరికి దొంగపత్తా లేదు. తాత దొంగను కొంతదూరం వెంబడించి తిరిగి వచ్చేశాడు.

"నువ్వు ఇంత మంచివాడవనుకోలేదు తాతా. నువ్వు ఏమీ అనుకోవుకదూ. నువ్వు లేకపోతే నాగతేమయ్యేది. రెండుమాసాల జీతం నాకు ఈ రోజే వచ్చింది.

## ★ తాత చేసిన మేలు ★

అంతా వాడే తీసుకుపోయి వుంటే ఆగతేమయ్యేది" అన్నాడు.

"మరి మీరు వెళ్ళిపడుకోండి, బాబూ" అన్నాడు తాత.

"ఈ రోజునుంచీ నువ్వు కూడా మా ఇంట్లోనే పడుకోవాలి తాతా! లేకపోతే నాకు భయంగా వుంటుంది" అన్నాడు శివయ్య.

"నాకు ఇల్లెందుకు బాబూ. నా చోట్లో నన్ను పడుకోనిస్తే చాలు. మీకేం భయంలేదు. మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు పెడ్తాను. వెళ్ళి పడుకోండి" అన్నాడు తాత.

"తాతా! నువ్వెంత మంచివాడివి" అని శివయ్య సంతోషంతో తాత రెండు చేతులూ పట్టుకొన్నాడు. ★

# ★ దగా పడిన తమ్ముడు ★

(19-వ పేజీ తరువాయి

కుంటూ; "నాగవుర్న మెంటోడు పెద్దోడైతే, నానుసుఖపడనా! యీలందరూ, మొర్రోమని యేడవరా? చేసినపని సెరిపే గలమా? ఇలాగ నీతికి కటుబడి సచ్చిపోతాను గానీ...అన్యాయానికి సెట్టుకుంటానురా?"

అక్కడేవున్న పుల్లయ్య ఒళ్లు పులకరించి "బలేబాగా సెప్పావురయ్యా! ఇలాగ సచ్చిపోతాంగానీ...అన్యాయానికి మొక్కతామా? ఈగేమపెద్దలు యేంసేస్తారో సూద్దాం."

సరేసరేఅంటే సరే అన్నారు. అలాగ వస్తూన్న రాజిగాడు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. "ఏంరా పీసా! రేసనుతీసి కెళ్ళలేదు...నీకువద్దంటే, కారుడుయిస్తే యింకోకలికి పనికిరాదా?" అన్నాడు నాయుడు.

"నాను యివ్వను. నాకు కానీపరక కలిగిన్నాడు కొనుకుంటాను, లేన్నాడు వూరుకుంటాను."

"నీకారుడు యివ్వకపోతే—మరి పని జరగదు," అనుకుంటూ, చేతివాచీ చూసుకుంటూ వెళ్ళిపోయాడు నాయుడు.

పులయ్య పోల్చుకుని, "పీసా! టి. ఎస్. ఒ. తో సెప్పాలిరా ఈ వైనం!" అన్నాడు.

"అంతా ఒకటేనిరా"...ఆడు కూతురి పెళ్ళని, తాలూకాని దోసేసాడు! బురద నీరు పారేకా, మంచినీరు పారదా? రారా! ఎవరుచేసిన కర్మ వారనుభవించరా? నీకళ్లూ, నాకళ్లూ మూస్తారు. వాళ్లికళూ, వాళ్ళకళ్ళకి కళ్ళయిన దేముడికళ్లూ, మూసేస్తారా?" అంటూ పీస వెళ్ళిపోయాడు.

పుల్లయ్య యింటికి వెళ్ళేసరికి కొడుకు నవ్వుతూ, ఎగురుతూ, ముందుకువచ్చి స్వాగతం ఇచ్చాడు. తండ్రి ఎత్తుకోగానే కిలకిల్లాడి, ఒళ్ళు ఆడించాడు. వరిచేలు కోతకి వస్తున్నాయ్. చులకనలు అక్కడక్కడ కోస్తున్నారు. ధాన్యం కంట్రోలు ధర గరిసె మూడువందలే. కానీ ప్రజానీకానికి ఆధరకి దొరకలేదు. నల్లబజారులో, 600, 650, 700 వరకూ పెరిగిపోతూంది.

ఈ సంవత్సరం బాగాపండింది. పొలాల నుంచి కళ్ళాలకు పంటవచ్చినా ఎవరూ ఇదివరలా, ఒకవెన్ను ఎవరినీ ముట్టనివ్వడం లేదు. ధాన్యం బంగారంలా చూస్తున్నారు. నీలి ప్రతిసంవత్సరంలానే ఇవ్వవలసిన వాళ్ళకుఇన్తూంటె, పుల్లయ్య ఎగిరిపడ్డాడు. ధాన్యం ఇప్పుడు బంగారంతో సమానం కాబట్టి చూసుకొని పెద్దరికం చెలాయించకున్నాడు. నీలి నవ్వి, యిది బంగారం అని చేతులు నరుక్కోమంటావా? అంతా నాకే అనుకొంటే, ఆకోలానికి నూసినోలెవ్వరూ ఉండరు. మా మామ్మ సెప్పేంది. నూతులుండి సేదలు లేకపోయినా, సేదలుండి నూతులు లేకపోయినా బతకలేమని!"

పుల్లయ్య మరి మాటాడలేదు. బుగత ఈ సంవత్సరం పర్మిట్ తీసుకొనివచ్చి ధాన్యం కొలిపించుకున్నాడు. కళ్లానికి కొడుకు రావటంవల్లనే ధాన్యం బాగా రాలిందని పుల్లయ్య పెళ్లాంతో చెప్పుకున్నాడు.

1948 వ సంవత్సరం ప్రవేశించింది. పొలాల్లో పెసర వుంది. పెద్దపండుగకి కొడుక్కి మెళ్లో వెండి అత్తిక్ర చేయించాడు. మల్లు మొదటి పీకినా తరవాత అలవాటుపడి వూరుకున్నాడు. అప్పుడే తల్లిని విడిచిపెట్టి తండ్రిదగ్గర చనువు ఏర్పరుచుకుంటున్నాడు. రాత్రిళ్ళు నీలి మత్తుగా నిద్రపోతూంది. ఏకుస్తే, పుల్లయ్యే ఎత్తుకుని త్రిప్పి గుండెమీద వేసుకుని నిద్రపుస్తున్నాడు. చెయ్యిమీద వుంటేగాని,నిద్రపోడు. పుల్లయ్య చెయ్యి తీసివేస్తే "కయ్"మంటున్నాడు. ముసలమ్మ, పిల్లడు వరుసగా నాలుగురోజులు నిద్రలేకండా యేడవటంతో, ఏ గాలి సోకిందోనని ముల్లున్న రణభేరికాయున్న కొమ్మను పెణకలోదోపింది. ఇప్పుడంతగా ఏడవటంలేదు. ఒకోక్కనాడు పెద్దల పేరంటాలను తల్చుకొని మనవడికి యేంరాకండా చూడమనేది! ఒకోక్కసారి కింకపెట్టేవాడు. తండ్రి ఓదారిస్తే కొంత నయం. లేదాఅంటే తండ్రి వచ్చేవరకూ తగ్గేదికాదు. ఒకోక్కసారి తండ్రితో వెంట పడేవాడు; తీసికెళ్ళకపోతే ఏడుపు!

ముసలమ్మ పిల్లాడి ఏడుపువిని యేవో పాటలుపాడేది. వినాకింక వదలేదు. ఏవైనా బాలారిష్టాలేమో అని, మట్టిబొమ్మచేసి, ఐదు కొమ్మలు, ఐదు ఆకులూ, ఐదు ఖజ్జాలూ, నల్లటిగుడ్డ, జుత్తు, అన్నం, దీపంతో, చేటలోపెట్టి-వూరికి దక్షిణవేపు పోయించింది. ఏడుపు తగ్గింది. కానీ పిల్లాడు చిక్కినట్టే వున్నాడు. పడమటి ఆకాశంలో రక్తవర్ణంతో మేఘాలు రోజూ కనిపించాయ్. ఏదో అనర్థం వస్తుందని ముసలమ్మ అనుమానపడసాగింది. "మా రోజుల్లో యీ కంట్రోళ్ళూ యివన్నీ యెరగం! కలిగిన పొరుగమ్మ వున్నదాంటో యిరుగమ్మకు ఆకో పాకో యిచ్చేది. కానీ ముకం సూడకండా బతికేమంటే యెలాగమరి!"

నీలి వున్న, గంజి గడుగూ, వెంకన్న గన్నెమ్మలాంటి అనాధులకు పోసేది. ఒకనాడు పుల్లయ్య పొద్దు తిరిగినా ఇంటికి రాలేదు. మొగుడుకోసం అన్నం వుంచింది. అడుక్కునే కుష్ఠురోగి వచ్చాడు. చూడటానికి భయంకరంగా వ్యాధి శరీరంఅంతా వ్యాపించివుంది. "ఊరు ఆ చివరనుంచీ అడుక్కుని వస్తున్నాను. ఏ తల్లికీ కనికరం కలగలేదు. రెండురోజులైందమ్మా...నోటిలో ఒక్కడు గంజిపొయ్యలేదు. యిలా వెళ్ళి ఆ యేటిలో పడిపోయి ఛస్తాను. నా శవాన్ని యే నక్కలో పీకి, రాబందులో తింటే కొంత పుణ్యమేనా వస్తాది" అన్నాడు.

"రామ రామ" అంది నీలి.

"నానేం పాపం యెరగనుతల్లీ, నాకీ కష్టం వచ్చింది-ఇలాగ వచ్చిందికదా అని దేముడ్ని తిడతానా? ఏ జన్మలో యే పాపం చేసానో, యీ జన్మలో, అనుభవించేస్తే, వచ్చే జన్మలో ఒకే మాట ఆడే వోడిగా పుట్టాను."

నీలివాడి సిలవరి గిన్నెలో మొగుడికోసం వుంచిన అన్నంలో సగం వేసింది. నిల్చొనే ఒక్క నిముషంలో లేదనిపించాడు! మరి కొద్దిగా తెచ్చింది. ఇలా మొగుడికి మరి లేకపోయింది. వాడు "తల్లీ! యీ కడుపాక సముద్రం అమ్మా! ఆకలి అగ్గిలాంటిది. అగ్గికి యేదో హారం వెయ్యకపోతే, మనిషినే కాల్చేస్తాది. ఒక పేణం నిలిపావు తల్లీ! నీ ధర్మమే నీకు గొడుగై కాస్తాది," అని దీవించాడు.

పెళ్ళం పొయ్యి వెలిగించి వండుతోంది. కానీ శరీర మంతా యేదో తిప్పుతున్నట్లుంది. పుల్లయ్య గబగబ వణికిపోతూ వచ్చాడు. కొడుకు యెదురై నవ్వుతూంటే, ఏమీ అనకండా ఇంటినులక మంచంమీద కూర్చుని బొలబొలా కన్నీరుకారుస్తున్నాడు. పెళ్లాం వచ్చి ఆశ్చర్యంగా మాటాడలేకపోయింది. ఒక్కసారి ఘొల్లుమన్నాడు. మలు తండ్రిని చూసి ఒకటేగోల. వీళ్ళిద్దరి ఏడుపుతో నీలి కళ్లంటి,నీరు చిమ్మి మెల్లిగా రాలుతున్నాయ్! ముసలమ్మ కళ్ళు మసకలు కమ్మాయ్! అంతలోనే వూరంతా అట్టుడికి పోయింది. చిన్నా పెద్దా పిల్లా పిచికా కళ్ళల్లో నీరే కనిపిస్తోంది. ఈ ఏడుపు హృదయంలోంచి వుబికి వుబికివస్తోంది. జాతి, వర్ణ, వర్గ, భేదాలులేకండా అందరూ ఏడుస్తున్నారు. లోకంతల్లకిందులై పోతూంది. ఇంక మనం వుండి దేనికి-మనం అంటూ వుంటామా అని ఎవరికి వారే అనుకుంటున్నారు. కుష్టురోగి కూడా, విషయం తెలుసుకుని తలమొత్తుకొని యేడ్చాడు.

ఊరంతా నీలమ్మ గుడిదగ్గర సమావేశమైనారు. సరి! ఆ తెలివి తక్కువ వెధవెవడో ఆ దేముడ్ని పేల్చేశాడు. ఆ దేముడు ఆ

# దగాపడిన తమ్ముడు

దా పుత్రో లేకపోయినా, మన వెంట వుండనే వుంటాడు–దేముడు లేకపోతే యీ సంపదలు వుంటాయా— అని తలో లా అన్నారు. ఆయన ఆత్మశాంతికి ప్రార్థించారు పదో రోజున నీలమ్మ గుడిదగ్గర ఊరంతా కలిసి బీదలకు అన్నదానం చేశారు అంతా ఏకమై కలిసి మెలిసి బరువుగుండెలతో ఈ పని నెరవేర్చారు ఈ సమయంలో దాసుడు నీలమ్మగుడి తలుపులు తెరిచి, గుమ్మందగ్గర సంతోషంతో నిటారుగా నిల్చున్నాడు. తింటూన్న బీదల ముఖాలను చూస్తూంటే తన కెంతో జాలి వేసింది. నీలమ్మ తల్లివైపు చూశాడు. ఆనందంతో నవ్వుతున్నట్టు స్ఫురించింది–కనిపించింది! ఒక్కసారి ప్రజల నుద్దేశిం. "నాయనలారా చూడండ్రా! ఆ తల్లి సంతోషం ఇంతా అంతా కాదు! ఆ గ్రాంధీమహాత్ముడు దేముడు—దేముడు పేరు చెప్పి మీరు మంచి పని చేసారు–మంచి పనిసే సే మాతలు దూరం అయిపోవా? ఆ తల్లికి సంతోషం కదా?"

శీన లేచాడు. "ఆ దేముడిని, ఆ రూప కంతో మరి చూడం–కానీ ఓ రయ్యలారా! ఆ దేముడు పెట్టిన బరవడినపోతే, ఈ బీదా బిక్కీ, ఆ పెద్దరైతో కళ్ళనాగే రేయేళ్ళన్నీ నోటిలోకి రావు. ఇంటిలోను ఒకడు కడుపునిండా తిని తందనాలాడి, మిగతా వాలకి కడుపు మాడితే ఆ ఇల్లు ఇల్లేనా? ఆ తిన్నోడు మనిషేనా? ఎక్కువ వుండిందాకో, ఉన్నదే నలుగురికి సర్దినోడు మనిషి–అదు తినకండా ఎదరోలకి ఇచ్చినోడు పెద్ద–అందరూ పెద్దలెలాగయిపోతారు?"

పెద్దలు మాతులు త్రిప్పారు. చిన్నలు శ్రద్ధతో విని నిజమే అనుకున్నారు. ఇంతలో సంజీవి చెవిలో నాయుడు ఏదో చెప్పాడు గబగబ శీన చెయ్యి పట్టుకొని, "కబుర్లు చెప్పు దువుగాని రారా! వదుగురికి వడ్డెడన్నం వడ్డించరా!" అన్నాడు.

శీన విదలించుకొని పులుకుండాక పట్టుకొంటూ, "బాలనాయకం, బహునాయకం" అని గొణుక్కున్నాడు.

(ఇంకా వుంది)

# న్యూఢిల్లీ లేఖ

(6-వ పేజీ తరువాయి)

బ్రాడ్ కాస్టింగ్ శాఖను, కార్మికశాఖను, విద్యాశాఖను, ఆర్థిక శాఖను చూసేందుకు సాధారణమంత్రులను నియమించాలి వీరు తమ తమ శాఖల్లో స్వతంత్రంగానే వ్యవహరిసారు. వీరందరి పనులను సంఘటితం చేసేందుకుమాత్రం ఒక కాబినెట్ మంత్రి



కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో కర్ణాటక సంగీతకళాశాలకు వీణ అధ్యాపకులుగా వెడుతున్న వైణికులు, సంగీతవిద్వాన్ శ్రీ మొక్కపాటి నాగేశ్వరరావు. వీరు శ్రీ ఎం. ఏ. కల్యాణకృష్ణభాగవతార్ ముఖ్య శిష్యులు.

ఉండాలి. ఇదేమీ కొత్తగా చెయ్యాల్సిన మార్పు కాదు. పౌర విమానశాఖకు మంత్రిగా శ్రీ హుమయూన్ కబీర్ వ్యవహరించటం లేదా?

వెంటనే ఆర్థికమంత్రిని నియమించకపోతే ఆర్థికశాఖలో ఇద్దరు సాధారణ మంత్రులను వేయాల్సి ఉంటుంది. ఉపమంత్రి శ్రీ భగత్ బాగానే పనిచేస్తున్నారనుకోండి. అయినా ఆయన ఉపమంత్రేకదా! ఇక ప్రధానమంత్రి ఉన్నారంటే ప్రభుత్వంలోకల్లా ముఖ్యమైన ఈ శాఖ దైనందిన వ్యవహారాలన్నీ జాగ్రత్తగా చూసుకొనేటంత తీరిక ఆయనకుంటుందా?

* * *

ట్యునీషియాలోని సకియత్ గ్రామంపై బాంబులు వేసిన విమానాల్లో చాలాభాగం ఉత్తర అట్లాంటిక్ సంధి ననుసరించి అమెరికా ఫ్రాన్సుకు సప్లయి చేసినవేనని న్యూ స్టేట్స్‌మన్ (లండన్) పత్రిక వ్రాసింది. రెండేళ్ల క్రితం సూయజ్ పై దాడి జరిగినప్పుడు కూడా అమెరికన్ ఆయుధాలే ఉపయోగింపబడ్డాయి. దీన్నిబట్టి చూస్తే పాకిస్థానుకు ఇవ్వబడుతున్న ఆయుధ సహాయం గూర్చి భారతదేశానికున్న ఆందోళన నిరాధారమైనది కాదని స్పష్టపడుతోంది అసలు భారత దేశాన్ని ముట్టడించడానికి తమకు ఆయుధ సామగ్రి అవసరమని పాకిస్థాన్ నాయకులే బాహాటంగా చెబుతూండగా భారతదేశము ఆందోళన పడకుండా ఎలా ఉండగలదు?

పాకిస్తాన్ అమెరికన్ ఆయుధాలను భారతదేశంపై ఎన్నటికీ ఉపయోగించదని అమెరికా అధ్యక్షుడు ప్రకటన చేశారు. కాని ఆయుధాలంటూ చేతులో ఉన్న తరవాత ఇవి ఫలానావారిచ్చినవి, ఇవి ఫలానావారివి అనే విచక్షణ చేయటం కష్టం. అటీగాక అమెరికన్ విమానాలతో ఫ్రాన్సు ట్యునీషియాపై బాంబులు వేసినందుకు అమెరికా ఫ్రెంచిప్రభుత్వం మీద ఏంచర్యతీసుకోబోతోంది?

పాకిస్థాన్ దురాక్రమణ చేయదలచుకున్నప్పుడు అమెరికన్ ఆయుధ సామగ్రిని ఉపయోగించకుండా పాకిస్థానును వారిస్తామని అమెరికా హామీ ఇస్తోంది. అయితే ట్యునీషియాలో ఫ్రాన్సు దురాక్రమణదారా, కాదా? అదీగాక కాశ్మీర్ చరిత్ర చూస్తే ఇది దురాక్రమణ, ఇది కాదు అని నిర్వచించటమంతకష్టం మరొకటి లేదని తెలియటం లేదా? అందుకే ట్యునీషియాపై అమెరికన్ విమానాలతో జరిగిన ఫ్రెంచి దాడిని చూసైనా, అమెరికా తన విధానాలను పునర్విమర్శ చేసుకోవటం తప్పనిసరి అవుతోంది. ★



# సినిమా

యావద్భారత చలనచిత్ర పరిశ్రమకూ, ముఖ్యంగా, ఉత్తమ ప్రమాణాలను మన్నించి మంచి చిత్రాలు నిర్మించాలన్న ఉత్సాహంఉన్నా, పరిస్థితుల ప్రాబల్యం వల్ల నిస్సహాయులై ఉత్తమ చిత్రాల బదులు ఉత్త చిత్రాలే నిర్మిస్తున్న దర్శక, నిర్మాతలకు, కళాకారులకు, సంతోషం కలిగించిన శుభవార్త గతవారం ఢిల్లీ నుండి వచ్చింది. బహుమతులూ, ప్రశంసా పత్రాలూ ఇచ్చి చప్పట్లుకొడితే, నష్టపోయే నిర్మాతకు ఏమి లాభంఅని బాధ్యతగల పలువురు చేసిన సూచనలను పురస్కరించుకొని, ఇటుపై ప్రభుత్వం మామూలు బహుమతులిచ్చి గౌరవించే చిత్రాల నిర్మాతలకు నగదురూపంలోకూడా బహుమతులిచ్చి ఆర్థికంగా కొంత సహాయం

## శుభవార్త

చేయాలని భారత ప్రభుత్వం నిర్ణయించింది. క్రిందటి సంవత్సరం ఉత్తమచిత్రాలు నిర్ణయించడానికి సెలక్షన్ మండలిఅధ్యక్షుడు, మాజీ ఆర్థికమంత్రి, శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్ తొలిసారిగా ఈ సూచనను అధికార రీత్యా ప్రతిపాదించి ఆ మండలిచేత ఆమోదింపచేసి ప్రభుత్వానికి అందచేశారు. ఇందుకు ఆయన ప్రత్యేకం అభినందనీయులు. ఆ సూచన ఈ ఏడాది కార్యరూపం ధరించడం ముదావహం

చలనచిత్ర పరిశ్రమపట్ల ప్రభుత్వం గౌరవాభిమానాలు పెరుగుతున్నవనడానికి ఇది మరొక నిదర్శనం.

ఈ ప్రకటనను చూడగానే, ఫిలిం పరిశ్రమలోని చిన్నా పెద్దా అందరూ సంతోషం వెలిబుచ్చారు ఇది, మంచి ప్రమాణాలను మన్నించి చిత్రాలు తీయడానికి ప్రోత్సాహం ఇచ్చే సత్సంకల్పమని మెచ్చుకొన్నారు.

ప్రభుత్వ నిర్ణయం ప్రకారం నగదు బహుమతులు ఈ విధంగా ఉంటాయి రాష్ట్రపతి సువర్ణపతకం అందుకొనే ఉత్తమ కథా చిత్రానికి, ప్రధాని సువర్ణపతకం సంపాదించే ఉత్తమ బాల చిత్రానికి చెరి [illegible] వేలు

(55-వ పేజీ చూడండి)



'గంగా గౌరీ సంవాదం'లో కృష్ణకుమారి



'పర్వారిష్' చిత్రంలో మాలాసిన్హా

# నేటి నిర్మాతలు

పత్రికా రచయిత దగ్గర్నించి ఫిలిం నిర్మాత వరకూ, ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు ఫిలిం పరిశ్రమమీద ఘాటైన విమర్శలు విసరడం పరిపాటే. సాధారణంగా ఈ విసుర్లలో సబబు ఉండదు. ఒక్కొక్కసారి మటుకు 'అమృక్కరైతే అందులో తప్పులేదు' అనిపిస్తుంది. హఠాత్తుగా ఒక రోజున ఒక మేటి నటుడు ఈ పరిశ్రమ భవిష్యత్తు గురించి ఆలోచించి, చాలు చెడ్డలు వేస్తాడు. రేపు ఇంకో సంగీత దర్శకుడు ఇంకో రకమైన విమర్శ చేస్తాడు. ఎల్లుండి ఒక దర్శకుడు, 'నేటి' విషమ పరిస్థితులను నిశితంగా ఖండిస్తాడు. ఇలాగే టెక్నీషియన్‌లు, చిన్న

## బొంబాయి సినిమా లేఖ

ఉద్యోగులూను. నిజానికి ఈనాడు ఫిలిం పరిశ్రమ స్థితిగతులను గట్టిగా దుయ్యబట్టే అధికారం ఉన్న ఆసామి ఎవరూ అంటే, చలన చిత్ర నిర్మాతేనని చెప్పుకోవాలి.

కాలుగ్రదేశన్నగా, ఈ పరిశ్రమ చిత్ర విచిత్రగతులలో పడుతూ లేస్తూ, ఈనాటికొక దుర్భేద్యమైన వ్యూహంగా తయారైంది. ఇందులో మిట్టపల్లాలు ఎక్కువయ్యాయి. నడక కష్టం అవుతోంది. ఈ దుష్ఫలితాల స్వరూపం స్పష్టంగా కనబడడానికి కొంత కాలం పట్టవచ్చుగాని ప్రస్తుతానికి స్వతంత్ర నిర్మాత అన్నవాడు—ఆ మాటకొస్తే, పెద్దపెద్ద స్టుడియోలు ఉన్న పెద్ద నిర్మాతలు కూడా—చిత్ర నిర్మాణం సాగించడం నానాటికీ కష్టతరం అవుతోంది. ఒక దుర్గుణం మరొకదానికి, ఒక ఇబ్బంది మరి పదింటికీ దారితీయడంతో, నిర్మాణం దాదాపు అసాధ్యం అనిపించే స్థితికి వస్తోంది.

### స్వతంత్ర నిర్మాత

ఉదాహరణకి పెట్టుబడివ్యవహారం పరిశీ

లిద్దాం. నేటి 'స్వతంత్ర నిర్మాత' (దీన్నే అచ్చతెలుగులో చిన్న నిర్మాత అని అంటున్నారు) ఫిలిం తీయాలనుకుంటాడు. డబ్బు ఉండదు. అందువల్ల పెట్టుబడిపెట్టే మనిషిని వెతుకుతాడు. డబ్బు వడ్డీకి తిప్పడం, డబ్బు చేసుకోడం, ఆ వ్యక్తి వృత్తి ధర్మం కాబట్టి, అతను లాభాలను దృష్టిలోఉంచుకొని కాంట్రాక్టు పత్రంలో షరతులు పకడ్బందీగా కట్టుకువస్తాడు. తత్ఫలితంగా చిత్రం నిర్మాణం అవుతున్నంతకాలమూ, నిర్మాతకు జీతండబ్బులు మినహా, పైన కానిడబ్బు చేతిలో ఉండదు. ఆ స్థితిలో అతడు ఈ మహాయజ్ఞాన్ని నిర్వహించడం దుస్సాధ్యంగా కనిపిస్తోంది. ఆ తరువాతి కథ అంతా యాతనామయమే. ముఖ్యంగా ఇటు పెట్టుబడిదారుని సముదాయించి, డబ్బు తీసుకోడంతోను, అటు మేటినటీనటులను లాలించి సెట్ మీదకు తీసుకురావడంతోనూ అతనికి ప్రాణం చాలొస్తుంది. వాళ్ళమధ్య నలిగి నానాఅవస్థా పడతాడు. అయితే ఆ కాడికి పెద్ద నటులవెంట పరుగులుపెట్టడం ఎందుకు? అనవచ్చు కొందరు. ఈ ప్రశ్న నిర్మాతని అడగడంకన్నా పెట్టుబడిదారు-ఉరఫ్ డిస్ట్రిబ్యూటర్‌ని అడగడం సబబు. స్టార్‌లు లేకపోతే డబ్బులివ్వరువాళ్లు. ఈ సంగతి స్టార్లకీ తెలుసు. అందువల్ల వాళ్ళు బోలెడన్ని షరతులు పెడతారు. ఫలితం. 'స్వతంత్ర' నిర్మాత, అటు ఇటూకూడా వంగి వంగి సలాములుపెడుతూ ఆప్ కా గులామ్ హూఁ అంటూ తిరగడం.



బి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'చెంచులక్ష్మి'లో పుష్పవల్లి, హిరణ్యకశిపుడు, రేలంగి.

## ప్రాయశ్చిత్తం

ఈనాడు బొంబాయిలో ఒక్క దిలీప్ కుమార్ మినహా-మిగతా పెద్దనటులందరూ బోలెడన్ని చిత్రాలకు కాంట్రాక్టులు రాసుకున్నారు. అందువల్ల వాళ్లు ఒక్కొక్క చిత్రానికి నెలకు ఒకరోజు, మహాఅయితే రెండురోజులకు మించి పని చెయ్యడానికి వీలు ఉండదు. ఒకొక్కసారి, 'ఘటనబలం' వల్ల ఆ ఒక్కరోజు కూడా స్టార్‌కి ఏ ఇబ్బందో వచ్చినందువల్ల. కాల్‌షీటు కాన్సిలు అయిపోతుంది. ఆ నాటికి ప్రొడ్యూసరు స్టుడియోలో చోటు సంపాదించి, సెట్ వేసుకుని, మిగతా చిన్న నటులందరినీ పోగేసుకుని కూర్చుంటాడు. ఇదంతా వృథా అవుతుంది. ఇటు స్టుడియో వాళ్ళు సెట్ పీకెయ్యమని ఒత్తిడిచేస్తారు. ఇలా 'స్టార్'లు ఇచ్చే కాల్‌షీట్ల మధ్య కొంప మునిగినట్టు ఒకొక్కసారి—వారానికోసారి కాబోలు—ఆదివారం వచ్చి పడుతుంది. ఆ రోజు సెలవుదినము. పెద్దతారలు పనిచేయరు. నిజానికి పనిచేసేరోజులోకూడా ఏ ఒకరూ—మధుబాల మినహా—వేళకి రారు. అలా రావడం నామోషీ. రాకపోడం ఫ్యాషను. పనికి, రావలసిన వేళ వాళ్లకి గుర్తుండకపోయినా, ఎనిమిదింట నాలుగ్గంటలు ఆలస్యంగా వచ్చినా, కాల్‌షీట్ ముగిసే వేళ వాళ్ళకి కంఠతా. ఏ పనిచేస్తున్నా, వేళ ముగియవస్తోందనేసరికే ఎక్కడలేనితొందర, చిరాకు నటించి, గబగబ కారెక్కిపోతారు. ఉదయం 7 నుండి రాత్రి 9 వరకు ఏర్పాటైన షూటింగ్‌కు (డబల్ కాల్‌షీట్) మధ్యాహ్నం ఒంటిగంటకు వచ్చి 'అయామ్ వెరీసారీ.' అంటూ ఇంగ్లీషులో స్టయిలిష్‌గా బాధపడతారు. ఆనక, రాత్రి 9 కే పని అయిపోతున్నా, 12 దాగా ఉండడానికి సంసిద్ధత తెలియచేస్తారు; తమ తప్పుకు ప్రాయశ్చిత్తంగా.

## ఊహ మంచిదే

ఊహ మంచిదేకాని, ఆ ప్రాయశ్చిత్తం అనుభవించేది, ఒంటిగంటదాకా నిద్రపోయి ఓవల్టిన్ తాగివచ్చిన తారకాదు; పొద్దున 7 గంటలకు వచ్చి, స్టుడియో మెతుకులు తిని అక్కడే పడి ఉన్న చిన్ననటులూ పనివాళ్ళూను. ప్రొడ్యూసరు 12 దాకా ఆగమంటే ఆ సన్నకారు జీవులు కాదనలేరుగా. తారమటుకు తారకు తన కంపెనీకి అన్యాయం చేయలేదన్న తృప్తి ఉంటుంది. తరవాత సారికూడా, ఇదే పద్ధతిలో న్యాయం చేసెయ్యొచ్చులే అన్నధీమాతో, మళ్ళీ అలాగే ఆలస్యంగా వస్తారు. కొందరు పెద్దనటులు హఠాత్తుగా, విదేశయాత్రకు బయల్దేరుతారు అప్పుడు. వాళ్ళు పనిచేస్తున్న చిత్రాల నిర్మాతలబాధ ఇంతా అంతా కాదు.

ఈవిధంగా ఐదులక్షల రూపాయలతో నాలుగు నెలలలో పూర్తి చేదామనుకున్న నిర్మాణం తెమిలి, చిత్రం ఇవతల పడేసరికి, అంతకు పదింతలు కాలం, ఐదింతలు ఖర్చు పెరుగుతాయి. ప్రొడ్యూసరు, పెట్టుబడిదారు దగ్గిర, ఆ యూనిట్‌లో పనిచేస్తున్నా యావత్తు జనాభాదగ్గిర ప్రత్యక్షంగాను పరోక్షంగానూ చివాట్లు తింటాడు. అసమర్థుడు అని బిరుదు తెచ్చుకుంటాడు. హాస్యాస్పదుడవుతాడు. ఎవరిమటుకు వాళ్ళే, 'నీ మూలాన నేనెంత కష్టపడ్డానో, నష్టపడ్డానో చూడు' అని గదమాయిస్తారు. అందరి దృష్టిలోను ఖులాసాగా, గూట్లో గువ్వల్లే ఉన్నవాడు నిర్మాత ఒక్కడే! దాదాపు ఏడాది రెండేళ్ళుగా, నిర్మాణం "సాగుతూ" ఉన్న చిత్రాలు ఎన్నో ఉన్నాయి. అపోలో ఆర్ట్సువారి 'కినారే కినారే' ఏ నాటిది? అది ఇప్పుడిప్పుడే గమ్యస్థానం చేరుతున్నట్టుంది. సత్యేన్ బోస్ చిత్రం 'సవేరా' నిర్మాణం ఇంకా 'సవేరా' ఘడియల్లోనే ఉందంటే తెలిసిన వాళ్ళెవరూ సత్యేన్ బోస్‌ని తప్పుపట్టరు. వసంత్ జోగేల్కర్ తీస్తున్న

# ★ బొంబాయి సినిమాలేఖ ★

"కారిగార్" ప్రారంభించి శరవేగంతో నడుస్తోంది. త్రివేణి వాళ్ళ తెలుపబడని తెలుగొంది అశోక్‌కుమార్ స్వంతచిత్రం 'రాగిణి'లో అశోక్, కిశోర్, పద్మిని ఉన్నారు. ఇది పూర్తికావడానికి ఏడాది పట్టింది

ఇలా నిర్మాణకాలం దారుణంగా 'సాగి' పోవడానికి కారణాలు తెలియరావు; చెప్పాలంటే చెప్పవచ్చు అవన్నీ ఒకదానితో ఒకటి లంకెపడి ఉంటాయి కాగా, ఇలా అవస్థపడేది కేవలం చిన్న నిర్మాత ఒక్కడే కాదు పెద్ద స్టుడియో అధిపతులకు కూడా ఈ చిక్కులు తప్పటంలేదు ముఖ్యంగా 'స్టార్ సిస్టం' ప్రభావానికి లొంగనివారు లేరు. ప్రముఖ దక్షిణ భారత నిర్మాత ఎస్. ఎస్. వాసన్‌కు దేశం మొత్తంమీద అగ్రగణ్యుడని పేరు ఉంది ఆయన తీసిన చంద్రలేఖ, నిషాన్, సంసార్, మంగళ, బహుత్ దిన్ హుయే, ఇన్సానియత్ పెద్ద హిట్ చిత్రాలు అంత పలుకుబడీ పేరూ ఉన్నా, 'రాజ్ తిలక్', చిత్రనిర్మాణంతో ఆయన రెండేళ్ళనించి చిక్కులు పడుతున్నారు కారణాలు పోలేదు వాటిలో ముఖ్యమైనది మాత్రం పేరుపొందిన నటుల "సహకారం" అలాగే, వరసా స్టుడియో అధిపతి రెండేళ్ళ క్రితం 'సితారోంసె ఆగే' ఆరంభించారు. దురదృష్టవశాత్తు ఆ చిత్రం దర్శకుడు గ్యాన్ ముఖర్జీ హఠాత్తుగా మరణించారు. తరువాత ఇంకో దర్శకుడిని కుదిర్చి తీసుకురావడానికి చాల కాలం పట్టింది నటులను తీసుకురావడానికి ఇంకా చాలా కాలం పట్టింది.

## కారణం

ఈ విధంగా పత్రికలకు ప్రమాద హేతువుగా పరిణమించిన 'స్టార్ సిస్టం' ఇంత బలవత్తరకారి అయినందుకు, స్వతంత్ర నిర్మాతలను విమర్శించి లాభంలేదు. ఆ పెద్దల పేర్లు లేకపోతే వీరికి పెట్టుబడి దొరకదు. అయితే, దేశంలో పేరుప్రతిష్ఠలున్న పెద్దపెద్ద సంస్థలు కూడా ఈ విధానానికి లోబడడం శోచనీయం. ఆ సంస్థల పేర్లు, వాటి నిర్మాణ దక్షత ప్రజలకు తెలుసు వాటినిచూసే వారు చిత్రం చూడబోతారు. అందువల్ల పెద్ద సంస్థలు తారల దుందుడుకులు తారాజువ్వలలే పెరగడాన్ని నివారించవచ్చును. అంటే, వాళ్లు కొత్తవాళ్ళతో చిత్రాలుతీసి నెగ్గుకురావచ్చును.

ఈనాడు ఇక్కడ ఒక చిత్రానికి పది పదహారు లక్షల రూపాయలు ఖర్చు కావడం మామూలు అయిపోయింది ఇంత ఖర్చు అయిన చిత్రం, మొత్తంమీద ఒక కోటి రూపాయలు వసూలుచేస్తే తప్ప ప్రొడ్యూసరు అప్పులపాలు కాకుండా బయటపడడం సాధ్యం కాదు. ఈనాడు అన్ని చిత్రాలకూ ఖర్చు దారుణంగా అవుతున్నా, అన్నిటిలోనూ కొన్ని మాత్రమే, హిట్‌లు అయి డబ్బు గడిస్తున్నాయి.

ఈనాడు పరిశ్రమలో డైరెక్టర్లు అంతే వాళ్లు అరుదైపోవడం మరో విశేషం ఉన్న డైరెక్టర్లందరు ప్రొడ్యూసర్లే ప్రతి అసిస్టెంటు డైరెక్టరూ, డైరెక్టరు హోదాకు వచ్చిన తక్షణం ఎలాగో అలా ప్రొడ్యూసరు కావడానికి తహతహలాడుతాడు. అలా అయి నెగ్గుకొస్తున్నవాళ్లూ కొందరున్నారు ముఖ్యులు గురుదత్, మోహన్ సెగాల్, సత్యేన్ బోస్. వీరు కాక ఇంకా మహేష్‌కౌల్, రాజ్ ఖోస్లా, మంజీ బర్మన్, రాజ్ రిషి, శంకర్ ముఖర్జీ, అరవింద్ సెన్, సుబోధ్ ముకర్జి మొదలైన వాళ్ళు యీ దారిలోనే ముందుకు వస్తున్నారు.

## అసలు కారణం

ఈ దృష్ట్యా చిత్రం నిర్మించదలచుకున్న ఆసామి డైరెక్టరుకూడా తనే చేయాల్సిన పరిస్థితిలో పడుతున్నాడు బయటివాళ్ళకు ఒప్పగిస్తే, వాళ్లు స్వయంగా తీస్తున్న చిత్రం ఏదో ఉండితీరుతుంది అందుకని వాళ్ల దృష్టి దానిమీద ఉంటుంది దేనికి ముందు పనిచేయడం అనే ప్రశ్న వస్తుంది. పోతే, దర్శకుడి రుసుము ఒకటుంది. ఈనాడు ఇక్కడ రేటు చిత్రానికి 50 వేలు.

'ఇదిగో మనమే చూసుకుంటే, అరలక్ష రూపాయలు మిగులు' అనిపిస్తుంది స్వతంత్ర నిర్మాతకి.

అన్నెం పున్నెం ఎరగని ప్రొడ్యూసర్లు చాలమంది, దర్శకత్వ నిర్వహణకు ఒడిగట్టడానికి ఇదే కారణం కాబోలనిపిస్తుంది.

పోతే, నటీనటులు ఏమీ తీసిపోలేదు. పెద్దనటులందరూ చిత్రనిర్మాణ సంస్థలు నెలకొల్పుకొన్నారు. అందువల్ల పిక్చర్ బుక్ చేస్తే, కాల్‌షీటు జాబితాలో ఎక్కువ ఎవరికి దొరుకుతారో, స్వతంత్ర నిర్మాతలు అందరికీ తెలుసు.

ఈ విషవలయాన్ని ఛేదించి, మంచి పద్ధతి ఏర్పాటుచేయడానికి ఒక్కటే మార్గం ఉంది ఎ. వి. ఎం., జెమినీ, ఫిలింస్తాన్ వంటి పెద్ద సంస్థలు ఆమారంలో ప్రయత్నాలు ఆరంభిస్తున్నాయి. డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్ వ్యాపారం తమ చేతులలోకి పెట్టుకొని, ఒక్క బిగిన ఆరేసి, ఏడేసి చిత్రాలు నిర్మించినట్లయితే, వ్యాపారంలో నిర్మాతకు ప్రాముఖ్యం, పలుకుబడి పెరుగుతాయి. అప్పుడు పరిస్థితులను అదుపులోకి తేవచ్చును.

ఇది ఇలా ఉండగా కొందరు స్వతంత్ర నిర్మాతలు, తామంతా కలసి దేశంలోని వివిధ కేంద్రాలలో డిస్ట్రిబ్యూషన్ కేంద్రాలు నెలకొల్పుకొని ప్రదర్శన వ్యాపారాన్ని తమ అజమాయిషీలో పెట్టుకోవాలని



శ్లోకాపూరి 'భూలోకరంభ'లో చలం

చిత్రసమీక్ష:

# శ్రీ రాజరాజేశ్వరీ వారి 'అన్నతమ్ముడు'

సినిమానవకాలమానం ప్రకారం పద్దెనిమిది రీళ్ళపాటు (మానవకాలమానం ప్రకారం విలన్, దుర్మార్గపు పనులు మొదలుపెట్టాక పాతికముప్పైఏళ్ళు తిరిగి కోరికలుడిగే వరకూ) అధర్మం విచ్చలవిడిగా విహరించి విజయం చేపడుతుంది. సెమీఫైనల్స్‌లో కూడా దానికే డోకా ఉండదు 19 వ రీలులో జరిగే ఫైనల్ రౌండులో ధర్మమే జయించుట పరిపాటి అప్పుడు హీరో హీరోయిను యుగళగీతం పాడడం అలవాటు.

ఈ ఏర్పాటు అక్షరాలా ఇలాగే మూస పోసినట్లు ఉండకుండా, చెప్పుకోతగ్గ (మన చిత్రాలకు సంబంధించినంత వరకు) కొత్త పద్ధతిలో కథను అల్లుజేయాలన్న సంకల్పంతో రూపొందించిన చిత్రం 'అన్నతమ్ముడు' కథాంతాన నాయికా నాయకుల యుగళగీతం బదులు నేపథ్యగానం ఏర్పాటు చేయడం వంటివి అలా ఉండగా 'ధర్మము తప్పక జయిస్తుంది అన్న సత్యాన్ని తిరగేసి, "అధర్మము తప్పకుండా ఏదో ఒకరీలులో పరాజయం పొందగలదు" అని చాటడం ఈ చిత్రకథలో విశేషం. దీని తరువాత కొసమెరుపులాంటి జీవితసత్యాన్ని దానికి అలంకరించారు. అది: నిర్దోషి అని చివర వరకు మీరు అనుకునే వ్యక్తికి యావజ్జీవకారాగార శిక్ష పడడం...ఇదే ఈ చిత్రానికి ఒకవిధమైన విలక్షణతను సమకూర్చిందని చెప్పుకోవచ్చు.

ఇదరన్నదమ్ములు చెరోదారీ తొక్కడంతో కథ ఆరంభంఅవుతుంది. పెద్దాయన ఇడి మంచివాడు. రెండో ఆయన బహా అరోగ్యుడు. దుర్వ్యసనాలకు హెడ్డాఫీసు లాంటివాడు. తనవంతు ఆస్తి అంతా వాటికై ఖర్చుపెట్టేసి, ఆపైన అన్నగారి సొత్తు కోసం కృషిచేస్తాడు. వజ్రం అనే ప్రియురాలూ బ్రహ్మాండం అనే గౌరవ బావమరిదీ అతనికి తోడౌతారు. ఈ దుష్టుడు అన్నకి విషంపెట్టి చంపేస్తాడు. గర్భిణీ అయిన వదినెను, ఆమె కొడుకుని కూడా చంపబోతాడు గాని వాళ్ళు పారిపోతారు. ఆనక ఆ పిల్లడిని, వాళ్ళింటి నౌకరు పెంచుతాడు. తల్లి, ఒక క్రైస్తవ మిషనరీ ఆశ్రయం సంపాదించి అక్కడే కష్టపడి పనిచేసి జీవనం సాగిస్తూ ఉంటుంది. అధర్మానికి మంచిరోజు కాబట్టి, అట్టే రభస లేకుండానే ఆమె మీద నిష్కారణం హత్యానేరం, తత్ఫలితంగా పన్నెండేళ్ళ కారాగార శిక్ష పడతాయి. ఆమె తిరిగి వచ్చేవరకు పెద్ద కొడుకు ఎన్. టి. రామారావులాంటి రవి గాను, చిన్నవాడు జగ్గయ్యవంటి రాజేంద్ర గానూ పెరుగుతారు. రవి కాయకష్టం చేసుకు బతుకుతాడు. రాజేంద్ర లాయరై పేరూ, కారూ సంపాదిస్తాడు. నవ దర్శకుడు పి. ఎస్. రావు, పాత పద్ధతిలో పుట్టుమచ్చలూ, గంట్లూవంటి కొంత గుర్తులని ఆస్కారం ఇవ్వనందువల్ల తల్లి కొంతమంది వాళ్ళని గుర్తించదు. ఎవరన్నా చెబితే బాప్రజ్ఞని ఎం. ఎస్. రామారావు నేపథ్యం లోంచి ప్రాధ్యంగా సూచించినా ఎవరూ చెప్పరు. అయినా, అనిర్వచనీయమైన అనురాగం పెల్లుబికినందువల్ల రవి, తల్లిని కనికరం కొద్దీ చేరదీసి, తల్లి లాగే పూజిస్తూ ఉంటాడు. ఈలోగా, అతని పినతండ్రి నాగేశ్వరరావు నానా అఘాయిత్యాలూ చేస్తూ ఉంటాడు. రవి చెల్లెలువలె పెరుగుతున్న పద్మను చెరచబోయి ఆమె మరణానికి కారకుడవుతాడు. పగతీర్చుకో వచ్చిన రవిని చంపబోయి, తన ప్రియురాలు వజ్రం మరణానికి కారకుడౌతాడు. ఆ నేరాన్ని రవి మీదకు తోసేస్తాడు. ఆ తరవాత, లాయరు రాజేంద్రభార్య రాణిని బలాత్కరించేవేళ, తన పాతకృత్యపు రవి మళ్ళీ సిద్ధం అవుతాడు. ఆయుధం చేత బట్టిఉన్న ఆ దుష్టుడి బారినుండి, రాణిని, తనను కాపాడుకోవడానికి జరిపిన పోరాటంలో, రవి, నాగేశ్వరరావును చంపివేస్తాడు.

ఇక్కడనించి, కథ ఇంకోదారి పట్టడమే ఈ చిత్రం విశేషం.

రవి, ముద్దాయిగా కోర్టులో హాజరయే సరికి, అతని తమ్ముడు రాజేంద్ర న్యాయమూర్తి పదవికి వచ్చేస్తాడు, అలా బజారు కెళ్ళొస్తా నన్నట్టు రోమ్‌నగరం వెళ్ళొస్తా నన్న 'ఫాదర్', ఆ వేళకు తిరిగి వచ్చి

---

ఒక పథకం వేశారు. అప్పట్లో అది ఆలోచనల ఘట్టంలోనే ఆగిపోయింది. కాని, ఇపుడు తిరిగి కృషి ఆరంభమైనదనీ, గురుదత్ మోహనసైగాల్, సత్యేన్ బోస్, బి. ఆర్. చోప్రా ప్రభృతుల అధ్వర్యాన అది త్వరలోనే కార్యరూపం ధరించవచ్చుననీ తెలుస్తోంది.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



పొన్నలూరివారి 'శోభ'లో రామారావు, అంజలిదేవి



# 'అన్న - తమ్ముడు'



రాజేంద్ర కాంతమ్మను కొడుకేనని వెల్లడిస్తాడు "అయితే రవి నీకు అన్నయ్యేనని, ఆ సంగతి క్రితంరోజే తెలుసుకొన్న కాంతమ్మ వెల్లడిస్తుంది

న్యాయస్థానంలో, రవి, "న్యాయవాదులనే సవతితల్లుల" సహాయం అక్కరలేదని, హత్యకు సంబంధించిన కథయావత్తు తనే చెబుతాడు ఒక దుష్టుడినుండి, ఒక అబలను (ఆమె జడ్జిగారి భార్య) కాపాడడానికి, తన ప్రాణం కాపాడుకోవడానికీ రవి,హత్య చేశాడన్నది స్పష్టంగా తెలిసినా, రవి,పూర్వం నుండీ పగబట్టి ఉన్నాడన్న విషయాన్ని కూడా లెక్కలోకి తీసుకొని, దుష్టశిక్షణ ప్రభుత్వం పని కాని, వ్యక్తులకు ఆ అధికారం లేదన్న శిక్షాస్మృతి అధికరణాన్ని అక్షరాక్షరంగా ఈ వివాదానికి వర్తించి నిందితుడు తన అన్న అయినప్పటికీ, దోషి అనే ఎంచి, యావజ్జీవ కారాగారశిక్ష విధించినట్లు రాజేంద్రతీర్పు చెబుతాడు.

చాలా గొప్పవిషయం ఉత్తమ ఆదర్శం.

కాని, ఎంతవరకు న్యాయం? అన్న సందేహం కలుగుతుంది లాయర్ల మాట దేవుడెరుగు; హత్య జరిగినపుడు అక్కడే ఉన్న నౌకరు, రవివల్ల తన ప్రాణం కాపాడుకొన్న రాణీవినా సాక్ష్యం ఇచ్చారుగాదు రవి వాళ్ళని పిలవకపోయినా, పోలీసులు ఆ సమయంలో వాళ్ళని అక్కడ చూశారు గాబట్టి వాళ్ళేనా తీసుకువస్తారు ఆ సదుపాయాలు లేవు. కాగా, ఆత్మరక్షణ కోసం, నేరం తప్పనిసరి అయింది అని పరిస్థితులు నిరూపిస్తున్న సత్యాన్ని కూడా పట్టించుకోకుండా, 'ఫస్ట్ డిగ్రీ మర్డర్'గా పరిగణించి శిక్ష వేయించారు. పాతకేసులు తిరగేసి, 'ప్రిసిడెంట్స్' ఎలా ఉన్నాయో చూసినా, 8వ రీలులో "చిన్నపిల్లని నగల కోసం హత్య చేసిందన్న" ఆరోపణపై కాంతమ్మకు పన్నెండేళ్లు శిక్ష పడిందన్న సంగతి బయటపడేది 'ఎలాగా హీరోయను లేదు గాబట్టి ఎక్కడుంటేనేం' అని జడ్జిగారు అనుకున్నారేమో తెలీదు

"మొత్తానికి పొయటిక్ జస్టిస్ లేకపోయినా, మామూలు జస్టిస్ కూడా చెయ్యలేదు జస్టిస్ రాజేంద్ర" అన్నారు ఈ-చిత్రం చూచిన ఒక 'న్యాయవాది'

కథకు తృప్తి చేకూర్చడంకోసం, మంచివాడైన రవికి అంత పెద్ద శిక్ష వేసి తీరాలనే సంకల్పిస్తే,ఆ పాత్రకు ఒకటో రెండో దండనార్హమైన వంకలు పెట్టి ఈ కేసును కాస్త కట్టుదిట్టంగా కట్టుకు రావలసిందని ఆయన అభిప్రాయం. లేకపోతే, ఇప్పటి కేసు ప్రకారం, ఇందులోని నిసలైన దుష్టుడు చచ్చికూడా పగసాధించాడని సూచించినట్లవుతుంది.

* * *

కథకి సంబంధించినంతవరకూ ఇది ఎలా ఉన్నా, నటనను లెక్కలోకి తీసుకుంటే, పై వాదాలు గట్టిగా నిలబడవు. జస్టిస్ రాజేంద్ర, ఈ అభియోగాన్ని సాకల్యంగా వంట బట్టించుకున్న మీదట, ముద్దాయికి శిక్ష విధించకపోవడం అధర్మం అని మనస్ఫూర్తిగా నమ్మి మరీ అతని చేశాడన్న నమ్మకం కలిగేలా జగ్గయ్య నటించాడు నేటి ప్రేమఘట్టాలు మటుకు, కొండగుర్తు పోజులకు మించి నటించడానికి ఆస్కారం లేకుండా ఉంటున్నాయి కాబట్టి వాటిని మినహాయించుకున్నా, ఇతర సన్నివేశాలన్నిటిలోను జగ్గయ్య నటన, పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేసేదిగా ఒప్పింది బ్రతికి చెడ్డ ఇల్లాలుగా, బిడ్డలకోసం ఆరాటపడ్డ తల్లిగా, మాలతి ప్రదర్శించిన నటనకూడా సహజంగా సాగి, ఆ పాత్రకు ప్రేక్షకుల సానుభూతిని సంపాదించి పెట్టింది

పెళ్ళికూతుర్ని చూడడానికి బదిలీ పెళ్ళికొడుకును పంపి ఎవరికీ తెలియకుండా ఫొటో కాపుకాస్తున్న గుర్నాథాన్ని ఉమ కనిపెట్టి చిక్కు తెచ్చింది-రిపబ్లిక్ వారి "పెళ్ళిసందడి"లో సురభి బాలసరస్వతి, చలం.



మాటలు పినిశెట్టి పాటలు దాశ గోపాలం, బి.వి.ఎన్ ఆచార్య, కొసరాజు, సముద్రాలజూనియర్ సంగీతం అశ్వత్థామ నటవర్గం ఎన్ టి రామారావు, జగ్గయ్య, రేలంగి, ముక్కామల, చదలవాడ కుటుంబరావు, కె వి ఎస్ శర్మ, ఆర్ నాగేశ్వరరావు, పద్మనాభం, ఎ వి సుబ్బారావు, నల్ల రామమూర్తి, మాలతి,జానకి, రాజసులోచన నిర్మాత కడారు వెంకటేశ్వరరావు

ఒక వేషంలోనే, రకరకాల వేషాలు వేస్తూ హుషారుగా తిరిగిన రవిగాను, ధర్మదేవతకన్న ధర్మశాస్త్రానికే ఈనాడు ఎక్కువ విలువబడి ఉందన్న సంగతి తెలుసుకోలేక దండన పొందిన అమాయకుడు రవిగాను ఎన్. టి. రామారావు, సమర్థంగా నటించి, ఉన్న మేరకు పాత్రను ఒప్పించాడు నీచ దుష్టుడు నాగేశ్వరరావు పాత్రను, ముక్కామల ఎన్నతగ్గ సౌలభ్యంతో సొగసుతో నడిపాడు అతడి ప్రియురాలుగా రాజసులోచన, బావమరదిగా చదలవాడ, వంటవాడుగా పద్మనాభం, క్రైస్తవ మతాచార్యుడుగా కె వి. ఎస్ శర్మ, పోలీసు ఆఫీసరుగా ఆర్. నాగేశ్వరరావు, జడ్జిగా ఎ వి. సుబ్బారావు, రాజేంద్ర భార్యగా జానకి మొదలగువారంతా తమ తమ పాత్రలను యథోచితంగా నటించారు తొలిసారిగా, ఎన్నతగ్గ పెద్ద భూమికను నిర్వహించిన మిక్కిలినేని నటన ప్రశంసనీయంగా ఉంది. పోలీసుగా రేలంగి ఎప్పటికి మల్లేనే, [illegible] కొంత హడావుడిచేసి నవ్వించాడు.

పంచులక్ష్మి నాటకం వంటి హంగులన్నీ ఆహ్లాదకరంగా ఉన్నాయి. అశ్వత్థామ కూర్చిన పాటలలో, రాజేంద్ర, రాణిలకు గాత్రధారులుగా శ్రీనివాస్, సుశీలలు పాడిన పాట చాలా హాయిగాఉంది. పాటను చిత్రించినచోటు కూడా చాలా సినిమాటిక్ గా ఉంది...

రెండుతరాల మనుషుల కథను చిత్రించబోవడం దర్శకుడికి గురుతరమైన కార్యభారం. అయినా, విసుగు కలగకుండా, తెరమీద చెప్పుకువచ్చారు. ఎటొచ్చి, 18 రీళ్లు సాగిన కథను, కథ స్వభావాన్ని బట్టి, ఉండతగ్గ గమ్యస్థానం, లక్ష్యం హఠాత్తుగా అంతర్ధానమై పోయాయో, క్లైమా

# ‘అమెరికన్ అవార్డ్’ పోటీకి ‘మదరిండియా’

అమెరికా మోషన్ పిక్చర్ అకాడమీ ఏటేటా ఉత్తమ విదేశీయ చిత్రాలకు ఇచ్చే బహుమతికై, ఈ ఏడాది మహబూబ్ నిర్మించిన ‘మదరిండియా’ చిత్రాన్ని కూడా పరిశీలనకు ఎన్నిక చేశారు.

దీనితోపాటు మరి నాలుగు విదేశీయ చిత్రాలు నామినేట్ చేయబడ్డాయి. అవి ‘గేట్స్ ఆఫ్ పారిస్’ (ఫ్రాన్స్), ‘ది డెవిల్ కేమ్ ఎట్ నైట్’ (జర్మనీ), ‘ది నైట్స్ ఆఫ్ కాబిరియా’ (ఇటలీ), ‘నైన్ లైవ్స్’ (నార్వే) పరిషత్ సభ్యులు ఈ ఐదింటిలోనూ ఒక చిత్రాన్ని బహుమతికి యోగ్యమైనదిగా నిర్ణయిస్తారు.

ఇందు నిమిత్తం ‘మదరిండియా’ చిత్రం ప్రతినొకదానిని, ‘ఇంగ్లీష్ సబ్ టైటిల్స్’ జోడించి పంపవలసిందని అకాడమీ పాలక వర్గం దర్శక నిర్మాత మహబూబ్ కు లేఖ వ్రాసింది. మహబూబ్ లండన్ వెళ్లి అక్కడి ‘టెక్నికలర్’ సంస్థ (‘మదరిండియా’ ప్రతులు తయారైన చోటు) నుండి ఒక కొత్త ప్రతి తీసుకొని స్వయంగా హాలీవుడ్ వెళ్లగలరని తెలిసింది.

అమెరికన్ చిత్రాలలో అకాడమీ అవార్డుకు సిఫార్సు చేసిన మూడు చిత్రాలలో ప్రథమస్థానం ‘సయొనారా’ది. తరువాతి రెండూ ‘పేటన్ ప్లేస్’ ‘బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్.’

ఉత్తమ నటీనటులకు ఇచ్చే బహుమతులకు డెకొరేటర్ (హౌసన్ సోక్ మిల్లర్ ఆలీ వర్గ్ తో కలసి). ఆలెక్ గిన్నెస్ (‘బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్’) ఈ పేర్లు నామినేట్ చేశారు. ఇద్దరూ బ్రిటిష్ నటులే

## శ్రీమతి శాంతకుమారి సోదరి వివాహం

ప్రముఖ దర్శకనిర్మాత శ్రీ పి. పుల్లయ్య గారు, వారి మరదలు, (శ్రీమతి శాంతకుమారి సోదరి) చి॥ సౌ॥ అమ్మాజీ (బి. ఎ.) ని చి॥ ఎం. జగన్నాథరావు (బి. ఎస్ సి; బి. ఇ. సౌత్ ఇండియన్ రైల్వేలో ఇంజనీరు) కు ఇచ్చి ఫిబ్రవరి 21 వ తేదీనాడు 8 గంటలకు మద్రాసు లాయిడ్స్ రోడ్ లోని ‘సత్య గృహ’ భవనంలో వైభవంగా వివాహం జరిపించారు. పలువురు చిత్ర నటీనటులూ, పత్రికలవారు, పెద్దలూ, పలువురు ప్రముఖులూ వచ్చి వధూవరులను ఆశీర్వదించి, కానుకలు చదివించారు. సాయంకాలం విందు, శ్రీమతి కమలాలక్ష్మణ్ నృత్యప్రదర్శనం జరిగాయి.

## ‘కృష్ణగారడీ’

నంది పిక్చర్స్ వారి సాంఘికం ‘కృష్ణగారడీ’ మార్చి 1 న విడుదల అవుతుంది. వై. వి. (మల్లీశ్వరి) రావు దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో అమర్ నాథ్, రేవతి, జగయ్య, మిక్కిలినేని, ఎ. వి. సుబ్బారావు, శివరావు పాల్గొన్నారు. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు సమకూర్చారు.

## జయభేరి

శ్రీ శారదా ప్రొడక్షన్ వారి ‘జయభేరి’ పి. పుల్లయ్యగారి దర్శకత్వాన తయారవుతోంది. నాగేశ్వరరావు, అంజలీ దేవి, నాగయ్య, రేలంగి నటిస్తున్నారు. సంగీత దర్శకుడు పెండ్యాల. ★

## శుభవార్త

(49 వ పేజీ తరువాయి)

రూపాయలు ఇస్తారు. వాటి తరువాత అఖిల భారత స్థాయి ప్రశంసాపత్రం అందుకునే కథా చిత్రానికీ, పిల్లల చిత్రానికీ రు. 12,500 చొప్పున ఇస్తారు.

తరువాత రాష్ట్రపతి సువర్ణపతకం సంపాదించే ఉత్తమ డాక్యుమెంటరీ చిత్రానికి ఐదు వేల రూపాయలూ, రెండవ బహుమతిగా అఖిలభారత ప్రశంసాపత్రం లభించే డాక్యుమెంటరీ చిత్రానికి రెండు వేల ఐదు వందలూ ఇస్తారు.

ప్రభుత్వ నద్యావానికి, పరిశ్రమ అభివృద్ధిపట్ల గల శ్రద్ధకీ లాంఛనా చిహ్నప్రాయంగా ఉన్న ఈ నగదు బహుమతులకు ఇవే పరిమితులు కారాదని, వీలువెంట సాధ్యమైనంత త్వరలో ఈ మొత్తాలు పెరుగగలవని ఆశిస్తున్నామనీ పలువురు దర్శక నిర్మాతలు అన్నారు ఎందుకంటె ప్రధాని నెహ్రూ ఈమధ్య ఒకసారి అన్నట్టుగా మనదేశంలో ఇంకా మంచి చిత్రాలకు డబ్బురావటం లేదు.

---

పట్టాల క్రాసింగ్ పాయింట్లు పొరబాటుగా పడినందువల్ల దారి మారిందో తెలీదుకాని మొత్తానికి ఇది ఎక్కదలచుకొన్న రైలన్నా కాకపోవాలి; లేదా వెళ్లదలచుకొన్న ఊరన్నా కాకపోవాలి. ఉన్న పళంగా ఒక్కపాటలో (లేదా చివర నేపథ్య గాయకుడు పాడిన ఒక్క పాటలో) చెప్పాలంటే, రాజమండ్రి నించి విశాఖపట్నం వెళ్ళే రైలు పొరబాటున సామర్లకోటలో దారిమారి కాకినాడ చేరుకుందను కోవాలి. ★



జలరుహా వారి ‘రాజనందిని’లో రేలంగి



డోసీ ఫిలింస్‌వారి 'చందన్'లో మాలాసిన్హా

## శుభవార్త

కాబట్టి డబ్బురాని చిత్రాల నిర్మాతలకు పారితోషికలు సహాయం ను పోషకారం కావాలదు.

ప్రముఖ దక్షిణభారత దర్శక నిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డిగారు కొంతకాలం క్రితం ఫిలింసెమినార్ సందర్భంలోనూ దరిమిలా కొన్ని సభలలోను సూచించినట్టు నిర్మాణ వ్యయాన్ని దృష్టిలో ఉంచుకొని, బహుమతి మొత్తాలను నిర్ణయించడం వాంఛనీయం.

## ప్రాంతీయ భాషాచిత్రాలు

మరో ముఖ్య విషయం, రాష్ట్రీయ స్థాయిలో బహుమతులుపొందిన చిత్రాలకు ఇటువంటి ప్రోత్సాహం లేకపోవడం. అఖిలభారతస్థాయిలో ప్రదర్శనకై చిత్రాలు నిర్మించేవారితప్ప, ప్రాంతీయ భాషా చిత్రాల నిర్మాతలు అందరూ ఈ బహుమతులు సంపాదించడానికి ప్రయత్నించే అవకాశం అంతగా ఉండదు. అందువల్ల రాష్ట్రపతి రజతపతకం పొందే చిత్రాలకు కూడా ఈవిధమైన ప్రోత్సాహం కల్పించి ఆదుకోవడం అవసరం.

ఈ బహుమతులకు కావలసిన సొమ్ము సమకూర్చడం కేంద్రానికి దుస్సాధ్యం అయినట్లయితే రాష్ట్రప్రభుత్వాలు ముందం జవేసి, కొంత తాముభరించి, మరికొంత కేంద్రప్రభుత్వం ఇచ్చేపద్ధతినైనా ఏర్పాటు చేయడం వాంఛనీయం. 

---

## [illegible] మార్కు సింహాసనం

చెప్పించాడు. ఎడిటింగ్ పనికి తన తరఫునుంచి నాకూర్చోపెట్టి రాత్రిళ్ళుకూడా పని చేయించాడు. ఎంత లోకువగా వాడుకున్నాడంటే ఆఖరికి, డబ్బింగులో, తను కోపధారి డైలాగులు బాగా చెప్పడానికితగ్గ వేడి మూడ్ రావడానికని. రామారావుని నిలబెట్టి ఉత్త పుణ్యానికి తిట్టిపోసేవాడు. ఇంకా ఏం చెప్పను బ్రదర్. తల్చుకుంటే గ్లిసరిన్ లేకుండా కళ్ళనీళ్ళొస్తాయి. చివరికి ఏమైందనుకున్నావు?

ఒక్కరు టైటిల్సులో డైలాగులురాసినవాడు టి. ఆర్. రావు అని వేయించాడు

"అకేమిటి, టి. రామారావు అని వెయ్యరాదా, ఇంకెక్కడికన్నా వస్తే ఇది చూసి అయినా ఛాన్సిస్తారూ" అని అడిగాడు రామారావు.

"ఫరవాలేదు బ్రదర్ అలాగే ఉంచు. నాపేరు టి. రాజారావు. అంటే ఇద్దరికీ పనికొస్తుంది. నీదనినువ్వను నాదని నేనంటా" అన్నాడు రాజారావు.

'సరే డబ్బున్నా పారెయ్యి రూముకి అద్దె కట్టాలి' అన్నాడు రామారావు.

'ఎంత'

'పదిహేను'

'వెరిగుడ్. పాతిక తీసుకో. పోయినాని కూడా ఉంటుంది. గుడ్‌లక్' అనేసి లేచి పోయాడు రాజారావు.

* * *

'19 వేల అడుగుల ఫిలిముకి డైలాగులూ, పాటలూరాసి, మూడుపెద్దకారెక్టర్లడబ్బింగుకి డైలాగులు చెప్పి, మూడెళ్ళ అహోరాత్రాలూ అడ్డమైన చాకిరీచేసినందుకు ఇదా ఫలితం' అని పెద్ద డైలాగురాసి చదువుకుని మరీ ఏడ్చాడు రామారావు.

ఆ పైన, అతనుపని వెతుక్కుంటూ అక్కడా అక్కడా, ఫలానా పిక్చరుకి డైలాగులు రాసిన టి. ఆర్‌.రావుని అని చెప్పుకునేవాడు.

కాని ఎవరూ నమ్మలేదు. రాజారావు పేరు కొట్టేస్తున్నాడనుకున్నారు. ఓ కోజన రాజారావే తనకి తెలిసిన పలుగుర్లోనూ పెట్టి కడిగేశాడు ఇతన్ని. తప్పకాదూ ఇలాంటి దొంగపనులు చేస్తావా అని.

చూశావా అదాడు, అతనికి నలుగో ఇచ్చిన అనుభజ్ఞాడి మాటవింటే, ఇంత అవస్థ వచ్చేదా? ఇప్పుడు భవిష్యత్తుకూడా లేకుండా పోయింది. అని కథ ముగించాడు కొలంబస్.

రాజా బరువుగా నిట్టూర్చాడు.

"అన్నట్టు ఇంకో తమాషా విను. ఇది జరిగిన అర్నెల్లకి ఒక సింహళభాష పిక్చరు డబ్బింగు అవుతోందని వార్తవచ్చింది. మాటలూ పాటలూ రాస్తున్నవాడిపేరు టి. ఆర్. రావు అని తెలిసింది. రాజారావు అని రామారావు అనుకొన్నాడు. రామారావు పైకొస్తున్నాడేమోనని రాజారావు హడలిపోయాడు. ఇంతకీ ఈ మిస్టరీ ఏమిటంటావు. ఆటి. ఆర్. రావు ఎవరంటావు?"

రాజా ఓ నిముషం ఆలోచించి బహుశా రాజారావే నేమో అన్నాడు.

'నీబొంద. కాదని చెప్తానుగా. ఈ టి. ఆర్. రావుపేరు రంగారావు!...యూస్‌లెస్ బ్రదర్. నువ్వు పనికిరావు. ఈ మాత్రం కనిపెట్టకపోతే ఏం లాభం?" అన్నాడు కొలంబస్. (ఇంకా ఉంది)

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



నిరుపహతి స్థలము

ఫొటో: నందగోపాల్, హైదరాబాదు.